శ్రీః

శ్రీ శివాయ గురవే నమః

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీలలితామహాత్రిపురసుందర్యై నమః

శ్రీమద్భాస్కరరాయవిరచితమ్

# శ్రీ వరివస్యారహస్యమ్




ప్రకాశికా

శ్రీమతీ రావి కృష్ణకుమారీ

**404, జంజనం కాంప్లెక్స్, చీరాల – 523 155.**

శ్రీః

శ్రీమద్భాస్కరరాయ విరచితమ్

# శ్రీవరివస్యారహస్యమ్


ప్రతులు : 500

ప్రథమముద్రణ : 21.02.2020, మహాశివరాత్రి

పుటలు : 140

వెల : రూ. 100/-



**సంపాదకుడు :**

**RAVI MOHAN RAO**, M.Sc., M.A. (Sanskrit)
404, Janjanam Complex,
Opp. I-Town Police Station,
**CHIRALA** - 523 155.
**Cell : 94401 15411**



**ప్రతులకు :**

**డా॥ కవుతా సుబ్రహ్మణ్యశాస్త్రి,** M.A., Ph.D.
శ్రీసదనం, సంపత్‌నగర్,
గుంటూరు - 522 004.
**Cell : 63022 88948**

D.T.P.:
**P. PARVATHI**
Cell : 7416586775.

Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.



శ్లో॥ భజేచ్ఛ్రీచక్రరాజస్థాం దక్షిణోత్తరయోస్సదా ।
శ్యామావార్తాళిసంసేవ్యాం లలితామ్బాం చతుర్భుజామ్॥



# 'అకథాసనేశీ'



*"శ్లో॥ భజేచ్ఛ్రీచక్రరాజస్థాం దక్షిణోత్తరయోస్సదా ।*
*శ్యామావార్తాళిసంసేవ్యాం లలితామ్బాం చతుర్భుజామ్॥"*

సమయాచారవర్తనుడైన **శ్రీభాస్కరరాయమహోదయు**ల పాదపద్మములకు నమస్కరిస్తూ, శ్రీవిద్యోపాసనావర్తనుడైన **బ్రహ్మశ్రీ కవుతా నరసింహశాస్త్రుల**వారిని స్మరిస్తూ, పుణ్యశీలవర్తనుడు, సోదరతుల్యుడైన **శ్రీకవుతా సుబ్రహ్మణ్యశాస్త్రి**గారిని అభినందిస్తూ, ఈ గ్రంథముద్రణకు అవకాశము కల్పించిన '**త్రిపుటి**'కి అంజలి ఘటిస్తున్నాను.

పఠితలు అధ్యయన-అధ్యాపనాదులతో 'అకథ'న రమింతురుగాక.

***శ్రీ గురుః సర్వకారణభూతా శక్తిః***

భవదీయుడు,
**రామోరా.**

చీరాల,
02. 02. 2020.




శ్లో॥ సింహాసనేశీ లలితా మహారాజ్ఞీ వరాఙ్కుశా ।
చాపినీ త్రిపురా చైవ మహాత్రిపురసున్దరీ ॥

శ్లో॥ సున్దరీ చక్రనాథా చ సమ్రాజ్ఞీ చక్రిణీ తథా ।
చక్రేశ్వరీ మహాదేవీ కామేశీ పరమేశ్వరీ ॥

శ్లో॥ కామరాజప్రియా కామకోటిగా చక్రవర్తినీ ।
మహావిద్యా శివాఽనఙ్గవల్లభా సర్వపాటలా ॥

శ్లో॥ కులనాథాఽఽమ్నాయనాథా సర్వామ్నాయనివాసినీ ।
శృఙ్గారనాయికాచేతి పఞ్చవింశతి నామభిః ॥

శ్లో॥ స్తువన్తి యే మహాభాగాం లలితాం పరమేశ్వరీమ్ ।
తే ప్రాప్నువన్తి సౌభాగ్యమష్టౌ సిద్ధీర్మహద్యశః ॥

శ్రీః

సామ్రాజ్ఞీ – ముద్రణము : సమ్రాజ్ఞీ – చదువుట

శ్రీః

శ్రీ శివాయ గురవే నమః

శ్రీలలితామహాత్రిపురసుందర్యై నమః

శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ మద్భాస్కరరాయదీక్షితచరితము

దక్షిణా పథమందలి బీజాపుర ప్రాంతమైన కర్ణాటక దేశీయులు. వీరి తండ్రి భారతీ గంభీర రాయదీక్షితులు. వీరు మహావిద్వాంసులు. సోమయాజి. బహుశాస్త్రగ్రంథ నిర్మాత. రాజనీతిజ్ఞుడు. బీజాపుర నవాబుకు మంత్రి. వీరికి **భారతి** అనుబిరుదము కలదు. వీరిది విశ్వామిత్రగోత్రము. గంభీరరాయల భార్య కోనమాంబ. రాజకార్యార్థ మీ దంపతులు హైదరాబాద్ (భాగ్యనగరము) చేరియుండ వీరికి భాస్కరరాయలు జన్మించిరి. వీరు తమ పుత్రునితో తీర్థాటనము చేయుచు కాశీనగరము చేరిరి. అచట భాస్కరరాయల నుపనీతుని గావించిరి. అటుపైన శ్రీ పరదేవతా సాక్షాత్కారముగల శ్రీనృసింహయజ్వవద్ద అనతికాలము ననే చతుర్దశవిద్యల నభ్యసించి భాస్కరరాయలు పండితలోకమున ప్రకాశించెను. పిమ్మట సూరత్‌నగరవాసులైన ప్రకాశానందనాథ శివదత్తశుక్ల వద్ద పాదుకాంత దీక్షను పొంది భారతదేశమంతట పర్యటింప సాగిరి. శ్రీభాస్కరరాయలు భారతదేశమంతట సంచరించెను. వీరికనేకులు రాజులు శిష్యులైరి. అగ్రహారముల నొసంగిరి.

శ్రీ భాస్కరరాయలు మధ్వమతమును ఖండించి శ్రీ భగవచ్ఛంకరాచార్యుల మతమునే స్వీకరించిరి. ఈతడు మధ్వమతాధిపతియైన సత్యబోధయతిని వాదమున జయించి అతని సోదరుని పుత్రికను పార్వతిని ముద్రాంకితురాలిని, ప్రాయశ్చిత్తవిధితో శోధించి స్మార్తాచార రీతిగా కన్యాదానమున స్వీకరించి పరిణయ మాడెను.

వీరు పరదేవతాజ్ఞచే కాశీక్షేత్రమున లలితా సహస్రనామములకు **సౌభాగ్యభాస్కర**మను పేర భాష్యమును వ్రాసిరి. మఱియు వరివస్యారహస్యము – భావనోపనిషత్ భాష్యము, శ్రీసూక్తభాష్యము, సేతుబంధము, సప్తసతీటీక, గుప్తవతి మొదలగు అసంఖ్యాక గ్రంథములను రచించిరి.

భాస్కరరాయులను గూర్చి వారి శిష్యుడు, జగన్నాథుడనువారు **భాస్కరవిలాస** కావ్యమును వ్రాసెను. అందు ప్రధానముగ

శ్లో॥ భూషావానఖిలైర్గుణైః స్వకృతిభిః సంతానవాన్ భూయసా
విద్యాభిర్ధనవాన్ సుధాధవలయా కీర్త్యా చిరం దేహవాన్ ।
పిత్రా దైవతవానభూత్సుకృతవాం ల్లోకోపకారేణ యః
సాధర్మ్యం లభతామనేన భువి కః శ్రీభారతీయజ్వనా ॥

శ్లో॥ శ్రేయోమార్గనిరూపణాయ శరణాపన్నేషు బద్ధాదరా
దుర్వారప్రతివాదిచక్రవిమలీకారప్రకారోత్తరాః ।
సాష్టాంగప్రణమన్నరేంద్రమకుటీరత్నప్రభామేదురాః
శ్రీమద్భాస్కరభారతీపదనఖజ్యోత్స్నాంకురాః పాన్తు నః ॥

శ్లో॥ చార్వాకస్యోక్తిరర్వాగజని సమకుచద్బౌద్ధరాద్ధాన్తభఙ్గీ
భాట్టో హాట్టో వినష్టో వ్యరమదథ కథా పశ్య పశ్యత్పదస్య ।
యోగోఽభూదస్తయోగస్త్రిజగతి ఫణితిః కాపిలీ సాపి లీనా
ధ్వాన్తశ్చ ధ్వంసితాధ్వా శ్రుతిశిఖరమతస్థాపకే **భాస్కరార్యే** ॥ అను

ఈ శ్లోకములలో శ్రీభాస్కరరాయల గుణగణాది విశేషములుగ్గడింపబడినవి. మఱియు వీరి గ్రంథములలో

1. సౌభాగ్యభాస్కరము, 2. వరివస్యారహస్యము, 3. సేతుబంధము. అను మూడు గ్రంథములు ప్రస్థానత్రయమని శాక్తేయమున వ్యవహరింపబడుచున్నవి.

శ్రీలలితాత్రిపురసుందర్యై నమః

శ్రీ భాసురానంద నాయక శ్రీమద్భాస్కరరాయలు తన అసామాన్య బుద్ధి వైభవముతో ఆసేతు హిమాచలము పర్యటించి పండితాగ్రేసరుడని ప్రఖ్యాతిగాంచి కాశీ పట్టణమందు కొంతకాలము స్థిరనివాసము చేసిరి. అచ్చట చతుశ్శాస్త్రపండితులును శ్రౌత స్మార్త ఆగమ విద్యాపారంగతులునగు శ్రీ నారాయణ భట్టు అను వారితో వివాదము సంభవించి విజయము నొందినట్లు చరిత్ర గలదు. కనుక నారాయణభట్టు కాలము క్రీ.శ. 1700 సంవత్సరము గాన వీరును ఆ కాలము వారేయని నిర్ణయము.

శ్రీ భాస్కరరాయల వృత్తాంతమండలి కింవదన్తి యిట్లు గలదు.

వీరు కుశాగ్రబుద్ధియై బాల్యము నుండియు సారస్వతోపాసన గావించి, ఆసేతు హిమాచలము పర్యటించి విద్వదగ్రగణ్యుడని పేరుగాంచి, కాశీ మహాక్షేత్రమున నివసించుచున్న సమయమున అచ్చటనున్న పండితులందరు వీరిని ప్రశంసించుచు సమ్మానములను గావించు చుండిరి.

పిమ్మట శ్రీభాస్కరరాయలు శ్రీరాజరాజేశ్వరీ బ్రహ్మవిద్యా మహాత్రిపురసుందర్యారాధనా

చరణులై దేవ్యారాధన చేయుచుండుట చూచి యచ్చటనున్న పండితులు శ్రీభాస్కరరాయలు వామమార్గపరులని భావించి ద్వేషబుద్ధితో వారిని గౌరవించి యాదరించుట మాని వైచుటయేగాక నిందావాక్యములను గూడ పల్కుచుండిరి. అంతట శ్రీభాస్కర రాయలు వారి నిందావాక్యములను కర్ణాకర్ణికగ నెఱింగి స్వారాధ్యదేవతాగర్హణను సహింపక పరమ–రహస్యమును అత్యంత గోపనీయమగు **శ్రీమద్భగవతీవరివస్యావిధానము** నెఱుంగని కర్మఠుల శుష్కవేదాంతుల యజ్ఞానకృత మదమును తొలగించుటకై యచ్చటనే శ్రీదేవీయాగ సంభారములను సంపాదించి చతుష్పద మధ్య భాగమున విస్తీర్ణమైన స్థలములో సలక్షణ లక్షిత తోరణ పతాకాద్యలంకృత చతుర్ద్వార మంటపమును నిర్మించి అందలి మధ్యభాగమున యథావిధిగా శ్రీచక్రయంత్రమును లిఖించి మంటపద్వారమున పెద్ద పటముతో ధ్వజమును నిర్మించి ఆ ధ్వజముయొక్క పై భాగమున సలక్షణమైన శ్రీ త్రిపురసుందరీమూర్తిని, దానికి నొక భాగమున మత్స్యమును, రెండవ భాగమున అమృతాసవచషకపాత్రను నిర్మించి ఆ మధ్యభాగమున స్థూలమైన యక్షరములతో మంత్రశాస్త్ర ప్రసిద్ధ దేవ్యారాధనా దూషకుల గర్వ భంజనమునకై శ్రీ దేవ్యారాధనా బహిర్యాగము నారంభించిరి. పిమ్మట ఏతద్దేవీ పూజా ప్రతిపక్షులు వచ్చి ప్రశ్న ప్రతివచనములతో ప్రామాణ్యాప్రామాణ్యములను నిర్ణయింప వలయును. ఆ వాదమున నేను పరాజితుడనైన నీ మార్గమును విడచి పెట్టెదను. విజితుడనైనచో నాకు జయపత్రిక నొసంగవలయునను ప్రకటనను తన శిష్యవర్గము ద్వారమున నచ్చట గల పండితులకు తెల్పుటయేగాక కరపత్రములను కూడా పంచిరి.

పిమ్మట కాశీ పట్టణమున విద్వాంసులందరు శ్రీనారాయణభట్టు మహాశయుని ముందిడుకొని విచారించిరి. శ్రీభాస్కరరాయు లసమానమైన బుద్ధిశాలురనియు వివిధ విద్యాపారీణులనియు విద్యలలో బృహస్పతి సములనియు వారి వాదమునందు జయము సాధ్యము కాదనియు, వారితో వాదము శ్రీవిశ్వేశ్వరులకు తప్ప యితరుల కసాధ్యమని నిర్ణయించుకొని, తుదకు గంగాతీరముననున్న శ్రీపరమహంసపరివ్రాజకులును పదవాక్యప్రమాణేత్యాది బిరుదావళీ విరాజమానులునగు శ్రీకుంకుమానందస్వామివారి సన్నిధికేగి పండితులందరు శరణుజొచ్చిరి. అంత శ్రీకుంకుమానందులు పూర్వాశ్రమమున శ్రీదేవీపూజాధురంధరులై శ్రీదేవీసాక్షాత్కారము నొందిన వారు గనుక వారికి తాము వచ్చిన విషయమును తెలిపిరి. అంతట శ్రీకుంకుమానందులు, 'ఓ విద్వాంసులారా! నేనింతకు పూర్వమే శ్రీభాస్కరరాయల ప్రకటన నెఱింగితిని. ఆ భాస్కరరాయులు సంపూర్ణముగ దేవ్యనుగ్రహమును పొందిన వారనియు, వాదమున వారిని జయించుట అసంభవమనియు, కాన మీరందరు దురాగ్రహమును వదలి అశేషశేముషీశాలియు విద్వద్వరేణ్యులునగు వారికి విజయపత్ర మొసంగుటయే శ్రేయమని తెలిపిరి.'

అయినను వారు తమ పట్టును వీడక పరిపరి విధముల శ్రీకుంకుమానందులను

వేడుకొని వారిని ముందిడుకొని యజ్ఞవాటికకు చేరిరి. అంత భాస్కరరాయులు వారినందరిని సగౌరవముగా నాహ్వానించి ధన్యవాదము గావించిరి. కాశీవాసులైన పండితులందరు శ్రీభాస్కరరాయల వినయాదరణలకు హృష్టులై యచ్చట యజ్ఞసంభారములను తమకు యోగ్యతానురూపసత్కారములను అపూర్వమైన యజన పద్ధతిని చూచి చకితులై శ్రీనారాయణభట్టు మొదలైన పండితులు శ్రీ భాస్కరరాయులనే పద్ధతిలో ప్రశ్నింతమని బహుభంగుల విచారించి తుదకు ప్రకృతతాంత్రికానుష్ఠాన విషయ ప్రశ్నకు పూనుకొని యిట్లనిరి. ఆర్యా! తాంత్రికార్చనలందు **చతుష్షష్టియోగినీగణసేవితా** అని కలదుగదా! ఆ దేవియొక్క ప్రాదుర్భావ ప్రసంగ వివరములు అష్టాదశ పురాణోపపురాణములలో కనబడుటలేదు. ఆ యోగినుల పేర్లు చెప్పుమని కోరిరి. అంతట శ్రీభాస్కరరాయులు, ఆ పండితులను చూచి ఆ యోగినుల చరిత మా యోగినుల ముఖముననే విందురుగావుత మనగా నా యోగినీ గణమంతయు శ్రీభాస్కరరాయల భుజములనధిష్ఠించి శరపరంపరగా వారి నామముల నుగ్గడించుట విని యాశ్చర్య చకితులైన పండితులందరు ధారణాసామర్థ్యము లేక యిట్లనిరి.

ఆర్యా, మేమానందసంద్రమున నోలలాడితిమి. మీచే నారాధింపబడు దేవీ దర్శన భాగ్యమును మాకు గావించి మమ్ము కృతార్థులను గావింపుమని ప్రార్థించిరి. అంత ఓ విప్రవరులారా! అల్పతపస్కులకు దేవీదర్శనము సాధ్యముకాదనగా నా పండితులు మాకు దేవీదర్శనభాగ్యములేనిచో ప్రాయోపవేశము గావింతుమని వారి పాదములకు ప్రణిపాత మాచరించి శరణుజొచ్చిరి. అంత భాస్కరరాయలు వారి శరణాగతిచే వారిని దేవీ-దర్శనాధికారులుగా నిర్ణయించి, స్వవిరచితశ్రీజగదంబాభిషేకజలముతో నారాయణభట్టు నేత్రములకు అంజనసంస్కారమును గావించగా తక్షణమే లబ్ధ దివ్యదృష్టిగల భట్టు శ్రీభాస్కరరాయల స్కంధాధిష్ఠితురాలైన శ్రీరాజరాజేశ్వరీ బ్రహ్మవిద్యా మహాత్రిపురసుందరీ లలితా పరాభట్టారికాంబా శ్రీదేవిని దర్శించి తమ జన్మసార్థక్యము గావించి కొని తమ దురభిమానమును వీడిరి. పిమ్మట వారు శ్రీ భాస్కరరాయనికి వినీతులై శ్రీదేవికి శ్రీభాస్కరరాయలకు శ్రీకుంకుమానందులకు మాటి మాటికి ప్రకృష్టనీచైః పతనరూప ప్రణిపాతములను గావించుచు శ్రీదేవ్యనుగ్రహమునకు పాత్రులై పరమానందముతో శ్రీభాస్కరరాయులకు జయపత్రదానముచేసి పండితులందరు తమ తమ నివాసముల కరుదెంచిరి - ఇట్టి అతిమానుషమైన ప్రభావములు శ్రీభాస్కరరాయల విషయమున ననేకములు గలవు.

శ్రీభాస్కరరాయ మహోదయమును గూర్చి వీరి శిష్యులగు జగన్నాథులు శ్రీభాస్కర-విలాస కావ్యమున వివరముగ వ్రాసిరి.



శ్రీః

శ్రీ శివాయ గురవే నమః

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీలలితామహాత్రిపురసుందర్యై నమః

# శ్రీ వరివస్యారహస్యే - పూర్వాంశః

## ప్రారంభః

శ్లో॥ ప్రహ్లాదాభీష్టదానే విబుధసముదయస్తూయమానాపదానే(ఽ)
శేషక్షోణీభృదంతః ప్రవిలసితపదాహోబలక్షేత్రగర్భాత్ ।
ప్రాదుర్భూతే హిరణ్యద్విరదమతిమదధ్వాంతతంత్రం నిహంతుం
ధీరే సచ్ఛాస్త్రయోనౌ మమ భువనగురావస్తు భక్తిర్ నృసింహే ॥ 1

శ్లో॥ ఆ ప్రాచః కామరూపాద్ద్రుహిణసుతనదప్లావితాదా ప్రతీచో
గాన్ధారాత్సింధుసాన్ద్రాద్రఘువరచరితాదా చ సేతోరవాచః ।
ఆ కేదారాదుదీచస్తుహినగహనతస్సంతి విద్వత్సమాజా
యే యే తానేష యత్నస్సుఖయతు సమజాన్ కశ్చమత్కర్తుమీష్టే ॥ 2

శ్లో॥ స జయతి మహాన్ ప్రకాశో యస్మిన్ దృష్టే న దృశ్యతే కిమపి ।
కథమివ తస్మిఙ్జ్ఞాతే సర్వం విజ్ఞాతముచ్యతే వేదే ॥ 3

శ్లో॥ నైసర్గికీ స్ఫురత్తా విమర్శరూపాఽస్య వర్తతే శక్తిః ।
తద్యోగాదేవ శివో జగదుత్పాదయతి పాతి సంహరతి ॥ 4

శ్లో॥ సాఽవశ్యం విజ్ఞేయా యత్పరిణామాదభూదేషా ।
అర్థమయీ శబ్దమయీ చక్రమయీ దేహమయ్యపి చ సృష్టిః ॥ 5

శ్లో॥ తజ్జ్ఞానార్థముపాయా విద్యా లోకే చతుర్దశ ప్రోక్తాః ।
తేష్వపి చ సారభూతా వేదాస్తత్రాపి గాయత్రీ ॥ 6

శ్లో॥ తస్యా రూపద్వితయం తత్రైకం యత్ప్రపశ్యతే(ఽ)స్పష్టమ్ ।
వేదేషు చతుర్ష్వపి పరమత్యన్తం గోపనీయతరమ్ ॥ 7

శ్లో॥ కామో యోనిః కమలేత్యేవం సాంకేతికైశ్శబ్దైః ।
వ్యవహరతి న తు ప్రకటం యాం విద్యాం వేదపురుషోఽపి ॥ 8

శ్లో॥ క్రోధీశశ్రీకణ్ఠారూఢః కోణత్రయం లక్ష్మీః ।
మాంసమనుత్తరరూఢం వాగ్భవకూటం ప్రకీర్తితం ప్రథమమ్ ॥ 9

శ్లో॥ శివహంసబ్రహ్మావియచ్ఛక్రాః ప్రత్యేకమక్షరారూఢాః ।
ద్వితీయాకం కూటం కథితం తత్కామరాజాఖ్యమ్ ॥ 10

శ్లో॥ శివతో వియతో ముక్తం తృతీయమిదమేవ శక్తికూటాఖ్యమ్ ।
హృల్లేఖానాం త్రితయం కూటత్రితయేఽపి యోజ్యమంతే స్యాత్ ॥ 11

శ్లో॥ హృల్లేఖాయాస్స్వరూపం తు వ్యోమాగ్నిర్వామలోచనా ।
బిన్ద్వర్ధచంద్రరోధిన్యో నాదనాదాంతశక్తయః ॥ 12

శ్లో॥ వ్యాపికాసమనోన్మన్య ఇతి ద్వాదశసంహతిః ।
బిన్ద్వాదీనాం నవానాం తు సమష్టిర్నాద ఉచ్యతే ॥ 13

శ్లో॥ ప్రథమేఽష్టాదశ వర్ణా ద్వావింశతిరక్షరాణి మధ్యే స్యుః ।
ప్రథమేన తుల్యమంత్యం సంఘాతేనాష్టపంచాశత్ ॥ 14

శ్లో॥ మాత్రాద్వితయోచ్చార్యా కామకలా చ త్రికోణా చ ।
బిందురహితహృల్లేఖా మాత్రాకాలత్రయోచ్చార్యాః ॥ 15

శ్లో॥ అన్యేషాం వర్ణానాం మాత్రాకాలోఽర్ధమాత్రయా సహితః ।
బిందోరర్ధం మాత్రా పరే పరే చాపి పూర్వపూర్వార్ధాః ॥ 16

శ్లో॥ సంహత్యైకలవోనో మాత్రాకాలోఽస్య నాదస్య ।
ఏకాదశ వాక్కూటే సార్ధా ఏకాదశోదితా మధ్యే ॥ 17

శ్లో॥ సార్ధా అష్టౌ శక్తావేకైకలవోనితా మాత్రాః ।
సంహత్యైకత్రింశన్మాత్రా మంత్రే లవత్రయన్యూనాః ॥ 18

శ్లో॥ కణ్ఠే చ కణ్ఠతాలుని తాలుని దంతేషు మూర్ధ్ని నాసాయామ్ ।
స్పృష్టవివారాభ్యంతరబాహ్యైర్యత్నైస్తదక్షరోత్పత్తిః ॥ 19

శ్లో॥ ప్రలయాగ్నినిభం ప్రథమం మూలాధారాదనాహతం స్పృశతి ।
తస్మాదాజ్ఞాచక్రం ద్వితీయకూటం తు కోటిసూర్యాభమ్ ॥ 20

శ్లో॥ తస్మాల్లలాటమధ్యం తార్తీయం కోటిచంద్రాభమ్ ।
మాలామణివద్వర్ణాః క్రమేణ భావ్యా ఉపర్యుపరి ॥ 21

శ్లో॥ ఆధారోత్థితనాదో గుణ ఇవ పరిభాతి వర్ణమధ్యగతః ।
మధ్యే ఫాలం బిందుర్దీప ఇవాభాతి వర్తులాకారః ॥ 22

శ్లో॥ తదుపరి మతోఽర్ధచంద్రోఽన్వర్థః కాంత్యా తథాఽఽకృత్యా ।
అథ రోధినీ తదూర్ధ్వం త్రికోణరూపా చ చన్ద్రికాకాన్తిః ॥ 23

శ్లో॥ నాదస్తు పద్మరాగవదణ్డద్వయమధ్యవర్తినీవ సిరా ।
నాదాంతస్తటిదాభస్సవ్యస్థితబిందుయుక్తలాంగలవత్ ॥ 24

శ్లో॥ తిర్యగ్బిన్దుద్వితయే వామోర్ధ్వచ్ఛత్రిరాకృతిశ్శక్తిః ।
బిందూర్ధ్వచ్ఛత్ర్యశ్రాకారధరా వ్యాపికా ప్రోక్తా ॥ 25

శ్లో॥ ఊర్ధ్వాధోబిందుద్వయసంయుతరేఖాకృతిస్సమనా ।
సైవోర్ధ్వబిందుహీనోన్మనా తదూర్ధ్వం మహాబిందుః ॥ 26

శ్లో॥ శక్త్యాదీనాం తు వపుర్ద్వాదశరవికాంతిపుంజాభమ్ ।
ఇత్యేవం వర్ణానాం స్థానం జ్ఞాత్వోచ్చరేద్యత్నాత్ ॥ 27

శ్లో॥ నాదః ప్రాథమికస్తు ద్వితీయకూటేన సాకముచ్చార్యః ।
ద్వైతీయీకం నాదం తార్తీయేనోచ్చరేన్న పృథక్ ॥ 28

శ్లో॥ బింద్వాదినవకయోస్తు ప్రాక్తనకూటద్వయస్థయోరనయోః ।
సమ్మేలనేన శబలం తార్తీయీకం విభావయేత్కూటమ్ ॥ 29

శ్లో॥ బింద్వాదికసమనాంతం క్రమేణ తార్తీయముచ్చరేన్నాదమ్ ।
ఉన్మన్యంతర్లీనం విభావయేదేతదుచ్చరణమ్ ॥ 30

శ్లో॥ ఆద్యే దశ మధ్యే తాస్సార్ధాస్తృతీయకూటేఽష్టౌ ।
ఏకలవోనా ఊనత్రింశన్మాత్రా మనోర్జపే కాలః ॥ 31

శ్లో॥ వ్యష్టిసమష్టివిభేదాదస్యాం చత్వారి బీజాని ।
సృష్టిస్థితిసంహారానాఖ్యారూపాణి భావనీయాని ॥ 32

శ్లో॥ పుటధామతత్త్వపీఠాన్వయలింగకమాతృతత్సమష్టీనామ్ ।
రూపాంతరాణి బీజాన్యమూని చత్వారి చింతనీయాని ॥ 33

శ్లో॥ ఏకైకస్మిన్ కర్మణి సృష్ట్యాదివిభేదతస్త్రివిధే ।
బ్రహ్మాద్యా అధిపతయో భారత్యాదిస్వశక్తిభిస్సహితాః ॥ 34

శ్లో॥ బ్రహ్మాదయస్త్రయోఽమీ భారత్యాద్యాశ్చ శక్తయస్తిస్రః ।
ప్రత్యక్షరస్వరూపాశ్శాక్తార్థే వక్ష్యమాణయా రీత్యా ॥ 35

శ్లో॥ హృల్లేఖాకామకలాసపరార్ధకలాఖ్యకుణ్డలిన్యత్థాః ।
నాదాశ్చక్రత్రితయత్రితయాత్మనో విభావనీయాస్స్యుః ॥ 36

శ్లో॥ ఇంద్రియదశకవ్యవహృతిరూపా యా జాగరావస్థా ।
తత్ర ప్రకాశరూపో హేతుర్భావ్యస్తృతీయగే రేఫే ॥ 37

శ్లో॥ అంతఃకరణచతుష్కవ్యవహారస్స్వాప్నికావస్థా ।
సా తార్తీయేకారాద్యోర్ధ్యాపి గలస్థలే చింత్యా ॥ 38

శ్లో॥ ఆంతరవృత్తేర్లయతో లీనప్రాయస్య జీవస్య ।
వేదనమేవ సుషుప్తిశ్చింత్యా తార్తీయబిందౌ సా ॥ 39

శ్లో॥ తుర్యావస్థా చిదభివ్యంజకనాదస్య వేదనం ప్రోక్తమ్ ।
తద్భావనార్ధచంద్రాదికం త్రయం వ్యాప్య కర్తవ్యా ॥ 40

శ్లో॥ ఆనంద్రైకఘనత్వం యద్వాచామపి న గోచరం నృణామ్ ।
తుర్యాతీతావస్థా సా నాదాంతాదిపంచకే భావ్యా ॥ 41

శ్లో॥ తార్తీయీకే రేఫస్థానే బిందౌ చ రోధిన్యామ్ ।
నాదాంతవ్యాపికయోశ్చంద్రకతుల్యాని పంచ శూన్యాని ॥ 42

శ్లో॥ ఉన్మన్యాం నీరూపం షష్ఠం చింత్యం మహాశూన్యమ్ ।
ప్రాణాత్మమానసానాం సంయోగః ప్రాణవిషువాఖ్యః ॥ 43

శ్లో॥ ప్రాథమికకూటనాదే త్వనాహతాద్బ్రహ్మరంధ్రాంతే ।
వ్యష్టిసమష్టివిభేదాద్బీజచతుష్కస్య చ స్వస్య ॥ 44

శ్లో॥ ఐక్యేన నాదమయతావిభావనం మంత్రవిషువాఖ్యమ్ ।
ఆధారోత్థితనాదస్యోచ్చారాద్బ్రహ్మరంధ్రాంతమ్ ॥ 45

శ్లో॥ షట్చక్రాణాం గ్రంథీన్ ద్వాదశ భిన్దన్ సుషుమ్నయైవ పథా ।
నాడీనాదార్ణానాం సంయోగో నాడివిషువాఖ్యః ॥ 46

శ్లో॥ రేఫే కామకలార్ణే హార్దకలాయాఇచ్ఛ బిన్ద్వాదౌ ।
నాదాంతావధి నాదస్సూక్ష్మతరో జాయతే తత్ర ॥ 47

శ్లో॥ శక్తేర్మధ్యే తల్లయచింతనముదితం ప్రశాంతవిషువాఖ్యమ్ ।
శక్త్యంతర్గతనాదం సమనాయాం భావయేల్లీనమ్ ॥ 48

శ్లో॥ సమనాగతమున్మన్యామేతే ద్వే శక్తికాలవిషువాఖ్యే ।
శ్రీవిద్యాకూటావయవేషు కకారాదిషూన్మనాంతేషు ॥ 49

శ్లో॥ అకులాదికోన్మనాంతప్రదేశసంస్థేషు సకలేషు ।
అధ్యుష్టనిమేషోత్తరసప్తదశాధికశతత్రయం త్రుటిభిః ॥ 50

శ్లో॥ ఉచ్చరితే నాదే సతి తస్యాన్తే తత్త్వవేదనం భవతి ।
తదిదం చైతన్యాభివ్యక్తినిదానం తు తత్త్వవిషువాఖ్యమ్ ॥ 51

శ్లో॥ ఏవమవస్థాశూన్యవిషువంతి చక్రాణి పంచ షట్సప్త ।
నవ చ మనోరర్థాంశ్చ స్మరతోఽర్ణోచ్చారణం తు జపః ॥ 52

శ్లో॥ భాస్కరరాయేణ గురోః కరుణావశతస్సమున్మిషితే ।
వరివస్యాతిరహస్యే **పూర్వాంశః పూర్ణతామగమత్** ॥ 53

**వరివస్యారహస్యే - ప్రథమోఽంశః ॥**

# శ్రీ వరివస్యారహస్యే - ఉత్తరాంశః

## ప్రారంభః

శ్లో॥ నార్థజ్ఞానవిహీనం శబ్దస్యోచ్చారణం ఫలతి ।
భస్మని వహ్నివిహీనే న ప్రక్షిప్తం హవిర్జ్వలతి ॥ 1

శ్లో॥ అర్థమజానానాం నానావిధశబ్దమాత్రపాఠవతామ్ ।
ఉపమేయశ్చక్రీవాన్ మలయజభారస్య వోఢైవ ॥ 2

శ్లో॥ పురుషార్థానిచ్ఛద్భిః పురుషైరర్థాః పరిజ్ఞేయాః ।
అర్థానాదరభాజాం నైవార్థః ప్రత్యుతానర్థః ॥ 3

శ్లో॥ అథాతః పూర్ణగాయత్ర్యాః ప్రతిపాద్యోఽర్థ ఆదిమః ।
భావార్థస్సంప్రదాయార్థో నిగర్భార్థస్తురీయకః ॥ 4

శ్లో॥ కౌలికార్థో రహస్యార్థో మహాతత్త్వార్థ ఏవ చ ।
నామార్థశ్శబ్దరూపార్థశ్చార్థో నామైకదేశగః ॥ 5

శ్లో॥ శాక్తార్థస్సామరస్యార్థస్సమస్తసగుణార్థకౌ ।
మహావాక్యార్థ ఇత్యర్థాః పంచదశ్యాస్స్వసంమితాః ॥ 6

శ్లో॥ కామయతే స కకారః కామో బ్రహ్మైవ తత్పదస్యార్థః ।
సవితుర్వరేణ్యమితి వై సవితృశ్రేష్ఠం ద్వితీయవర్ణార్థః ॥ 7

శ్లో॥ సర్వాంతర్యామి దధద్భర్గో దేవస్య ధీతి తుర్యార్థః ।
పృథ్వీ మహీ లకారస్తృతీయతుర్యాంఘ్రిబోధికా మాయా ॥ 8

శ్లో॥ త్రిపదీ త్రివర్ణబోధ్యా తుర్యస్తదుపరిషడక్షరీగమకః ।
అథ తార్తీయే వర్ణద్వితయం త్రిపదీషడక్షరీగమకమ్ ॥ 9

శ్లో॥ కూటద్వితయే శేషం పూర్వవదున్మేయమితి తు విద్యాయాః ।
గాయత్ర్యర్థస్త్రిపురోపనిషది కథితస్తథైవ భాగవతే ॥ 10

శ్లో॥ వామేచ్ఛే బ్రహ్మభారత్యౌ జ్యేష్ఠాజ్ఞానే హరిక్షితీ ।
రౌద్రీక్రియే శివాపర్ణే ఇత్యేతన్మిథునత్రయమ్ ॥ 11

శ్లో॥ త్రిభిః కూటైః క్రమాద్వాచ్యమీంకారత్రితయేన తు ।
ఏతత్త్రయసమష్ట్యాత్మ వాచ్యం **శాంతాంబికాత్మకమ్** ॥ 12

శ్లో॥ యద్వా గీస్సకలబ్రహ్మప్రభృతీనాం త్రయం త్రయమ్ ।
త్రికూటవాచ్యం మాయాయాస్తురీయం మిథునం మతమ్ ॥ 13

శ్లో॥ వామేచ్ఛాద్యాః షడీంకార ఇతి సప్తభిరక్షరైః ।
త్రిరావృత్తైరియం విద్యా సంజాతా తేన తన్మయీ ॥ 14

శ్లో॥ వామాదిసప్తశక్తీనాం సమష్టిః పరదేవతా ।
షట్త్రింశత్తత్త్వరూపాఽస్మాన్మాత్రయాఽపి న భిద్యతే ॥ 15

శ్లో॥ అహకారౌ శివశక్తీ శూన్యాకారౌ పరస్పరాశ్లిష్టౌ ।
స్ఫురణప్రకాశరూపావుపనిషదుక్తం పరం బ్రహ్మ ॥ 16

శ్లో॥ విశ్వసిసృక్షావశతస్స్వార్ధాం శక్తిం విలోకయద్బ్రహ్మ ।
బిందూభవతి తమిందుం ప్రవిశతి శక్తిస్తు రక్తబిందుతయా ॥ 17

శ్లో॥ ఏతద్బిందుద్వితయం విసర్గసంజ్ఞం హకారచైతన్యమ్ ।
మిశ్రస్తు తత్సమష్టిః కామాఖ్యో రవిరకారచైతన్యమ్ ॥ 18

శ్లో॥ ఏషాఽహంపదతుర్యస్వరకామకలాదిశబ్దనిర్దేశ్యా ।
వాగర్థసృష్టిబీజం తేనాహంతామయం విశ్వమ్ ॥ 19

శ్లో॥ అంత్యప్రథమే మధ్యచతుర్థే మంత్రేఽపి తౌ వ్యక్తౌ ।
తేనాంబామనుజగతామభేద ఏవాత్ర భావార్థః ॥ 20

శ్లో॥ వ్యోమాదిజనక**హకరసల**ార్ణైర్ఘటనేన పంచభూతమయీ ।
పంచచతుస్త్రిద్వ్యేకగశబ్దాదిగుణాత్మపంచదశవర్ణా ॥ 21

శ్లో॥ తత్తజ్జనకైర్వర్ణైస్తత్తత్సంఖ్యైస్తు తద్గుణా జాతాః ।
కామకలాభిశ్చతసృభిరాసీత్సృర్యశ్చతుర్విధో న తు కైః ॥ 22

శ్లో॥ భువనత్రయసమ్బన్ధాదాసీత్త్రేధా లకారోఽపి ।
యే యే యద్యజ్జనకాస్తేషాం తేషాం త ఏవార్థాః ॥ 23

శ్లో॥ కకారత్రయవాచ్యాస్తు సకలాః ప్రలయాకలాః ।
విజ్ఞానకేవలాశ్చేతి త్రిప్రకారా ఉపాసకాః ॥ 24

శ్లో॥ అకారైర్దశసంఖ్యాకైరుచ్యంతే జీవరాశయః ।
విద్యాయాః ప్రాణభూతస్సంస్తద్వాచ్యేకాదశస్స్వరః ॥ 25

శ్లో॥ బిందుభిస్త్రిభిరుచ్యంతే రుద్రేశ్వరసదాశివాః ।
శాంతిశ్శక్తిశ్చ శమ్భుశ్చ నాదత్రితయబోధనాః ॥ 26

శ్లో॥ ఏవం సప్తత్రింశత్సంఖ్యాకపదైర్మహావిద్యా ।
షట్త్రింశత్తత్త్వానాం తత్త్వాతీతస్య చాభిధాత్రీయమ్ ॥ 27

శ్లో॥ జన్యజనకయోర్భేదాభావాద్వాచ్యస్య వాచకేనాపి ।
బ్రహ్మణి జగతో జగతి చ విద్యాఽభేదస్తు సమ్ప్రదాయార్థః ॥ 28

శ్లో॥ పరమశివే నిష్కలతా తదభిన్నత్వం స్వదేశికేంద్రస్య ।
తత్కరుణాతస్స్వస్మిన్నపి తదభేదో నిగర్భార్థః ॥ 29

శ్లో॥ మాతా నిరుపమతేజోమయ్యాస్స్వస్యా మరీచిరూపాణామ్ ।
ఆవరణదేవతానామీశిత్వాదుచ్యతే గణేశీతి ॥ 30

శ్లో॥ ఇచ్ఛాదిత్రయరూపా గుణత్రయాధ్యా౭నలేన్దురవినేత్రా ।
ఏవం నవభిర్యోగాద్గ్రహరూపేత్యుచ్యతే మాతా ॥ 31

శ్లో॥ ఇంద్రియదశకేనాంతఃకరణచతుష్కేణ విషయదశకేన ।
ప్రకృతిపురుషగుణతత్త్వైర్జాతా నక్షత్రరూపిణీ మాతా ॥ 32

శ్లో॥ నరపతిరవికాష్ఠాషట్సముద్రద్విసంఖ్యై-
రకడబవహపూర్వైరక్షరైర్వేష్టితాభిః ।
డరలకసహవర్ణాద్యాకినీభిస్తు షడ్భి-
ర్ఘటితతనురితీయం కథ్యతే యోగినీతి॥ 33

శ్లో॥ పంచభిర్నాగకూర్మాద్యైః ప్రాణాపానాదిపఞ్చభిః ।
జీవాత్మపరమాత్మాభ్యాం చైషా రాశిస్వరూపిణీ ॥ 34

శ్లో॥ అకథాదికషోడశాక్షరాత్మకతార్తీయకకామవాగ్భవైః ।
ఘటితా చ పరాదివాగ్గణైరితి విద్యాపి గణేశరూపిణీ ॥ 35

శ్లో॥ బిందుత్రయనాదత్రయతదన్యకూటైర్గ్రహత్వమిహ ।
నక్షత్రత్వం చ దశాకారాణాం వ్యంజనైరపార్థక్యాత్ ॥ 36

శ్లో॥ హృల్లేఖాభిస్తిసృభిస్తదన్యకూటైస్తు యోగినీ యోగాత్ ।
రాశీభూతాష్యేషా తిసృణాం పూర్వాక్షరైరైక్యాత్ ॥ 37

శ్లో॥ దేవ్యా రూపాంతరత్వేన విద్యాయాస్తదభేదతః ।
గణేశగ్రహనక్షత్రయోగినీరాశిపీఠతా ॥ 38

శ్లో॥ రేఖాదలకోణగణైర్ఘటనాచ్చక్రే గణేశత్వమ్ ।
త్రైలోక్యమోహనాద్యైర్నవభిశ్చక్రైర్గ్రహత్వం చ ॥ 39

శ్లో॥ వృత్తత్రయధరణీత్రయమన్వశ్రాణాం విభజ్య గణనేన ।
సప్తభిరితరైశ్చక్రైశ్చక్రే నక్షత్రరూపత్వమ్ ॥ 40

శ్లో॥ స్థితిసంహృతిచక్రే ద్వే పద్మే ద్వే వృత్తభూగృహే చ ద్వే ।
ఏవం షడ్భిర్యోగాచ్ఛీచక్రం యోగినీరూపమ్ ॥ 41

శ్లో॥ పంచచతుశ్శక్త్యనలా బిందుర్వృత్తం చ భూబింబమ్ ।
ఏవం ద్వాదశసంఖ్యైర్ఘటనాచ్చక్రస్య రాశిత్వమ్ ॥ 42

శ్లో॥ చక్రం విద్యాక్షరైరేవ జననాత్తదభేదవత్ ।
దేవ్యా రూపాంతరత్వాచ్చ తేన యుక్తోక్తరూపతా ॥ 43

శ్లో॥ యావన్మాతృకముదితాన్యేకసమేతాని పంచాశత్ ।
పీఠాని పునర్గణితాన్యోజాపూకాని చత్వారి ॥ 44

శ్లో॥ గణపగ్రహభాదీనాం శశినిధితారర్తుసూర్యసంఖ్యానామ్ ।
మేలనతః పీఠాని జ్ఞేయాన్యేతేషు పంచపంచాశత్ ॥ 45

శ్లో॥ కత్రితయాదీకారాద్బిందుర్జాతస్తదగ్రిమే చక్రే ।
హృల్లేఖాభిస్తత్పరచక్రత్రితయం హకారాభ్యామ్ ॥ 46

శ్లో॥ ఏకారేణ చ తత్పరచక్రే జాతే సకారాభ్యామ్ ।
చతురశ్రాణి లకారైరేవం విద్యాక్షరేణ చక్రజనిః ॥ 47

శ్లో॥ ఏతత్త్రితయాభిన్నస్స్వగురుస్తదభేదభావనాదార్ఢ్యాత్ ।
తేన గణేశాదిమయస్తద్దయయా చ స్వయం తథారూపః ॥ 48

శ్లో॥ ఇత్థం మాతా విద్యా చక్రం స్వగురుస్స్వయం చేతి ।
పంచానామపి భేదాభావో మంత్రస్య కౌలికార్థోఽయమ్ ॥ 49

శ్లో॥ ద్వాదశషోడశదశభిస్తపనశశిదహనకలాభిరాకీర్ణైః ।
పంచాశద్భిర్వర్ణైరభిన్నదేహా కులీనకుణ్డలినీ ॥ 50

శ్లో॥ బిసతన్వీ తటిదాభా మూలాధారస్థపద్మశృంగాటాత్ ।
భిత్త్వా మూలహృదాజ్ఞాగతవహ్నిరవీందుమణ్డలత్రితయమ్ ॥ 51

శ్లో॥ వ్యోమని చిచ్ఛశిమణ్డలమధ్యే త్వకులేన సంగమ్య ।
ఉభయాంగసంగజన్యం ప్రవాహయంతీ సుధాపూరమ్ ॥ 52

శ్లో॥ స్వయమపి తత్పానవశాన్మత్తా భూత్వా పునశ్చ తేనైవ ।
మార్గేణ పరావృత్య స్వస్మిన్ స్థానే సుఖం స్వపితి ॥ 53

శ్లో॥ సాక్షాద్విద్యైవైషా న తతో భిన్నా జగన్మాతా ।
అస్యాస్స్వాభిన్నత్వం శ్రీవిద్యాయా రహస్యార్థః ॥ 54

శ్లో॥ వాగింద్రియైరగమ్యే తత్త్వాతీతే మహత్తరేఽణుతరే ।
వ్యోమ్నోఽప్యుపరి స్థితిమతి విశ్వాభిన్నే చిదానందే ॥ 55

శ్లో॥ బ్రహ్మణి పరే నియోజ్యస్స్వాత్మా తదభేదసంప్రాప్త్యై ।
ఏష మహాతత్త్వార్థశ్శ్రీవిద్యాయాశ్శివేనోక్తః ॥ 56

శ్లో॥ తత్తద్వర్ణార్థేయం తత్తద్వర్ణస్వరూపేయమ్ ।
ఇతి తు శ్రీవిద్యాయా నామార్థశ్శబ్దరూపార్థః ॥ 57

శ్లో॥ కల్యాణ్యేకాక్షర్యావీశ్రీ చాపి లలితా చ ।
ఇత్థం నామత్రిశతీవాచ్యోఽర్థస్తత్తదక్షరస్యాపి ॥ 58

శ్లో॥ నామైకదేశమాత్రే నామగ్రహణస్య లోకసిద్ధత్వాత్ ।
నామోపస్థితిగమ్యః ప్రోక్తో నామైకదేశార్థః ॥ 59

శ్లో॥ తిథిమితబిందుగణోత్తరగజరసగిరిదస్రరామసంఖ్యాకాః ।
అర్థా భవంతి యోగాన్నామ్నో నామైకదేశస్య ॥ 60

శ్లో॥ వాక్కామశక్తికూటైరవయవశో విగ్రహో మాతుః ।
ప్రతిపాద్యోఽత్రా కణ్ఠాదా మధ్యాదా చ పాదాగ్రాత్ ॥ 61

శ్లో॥ వేధోభారత్యౌ మాధవలక్ష్మ్యౌ రుద్రపార్వత్యౌ ।
రేఫాన్తవర్ణషట్కస్యార్థాన్ క్రమశో విజానీయాత్ ॥ 62

శ్లో॥ తా ఏతాస్సకలా అపి కామకలా ఏవ న తతోఽన్యాః ।
సామానాధికరణ్యాదీకారేణాయమర్థోఽస్య ॥ 63

శ్లో॥ అయమేవ కూటయోరపి పరయోరర్థః పరం తు తార్తీయే ।
ద్వైతీయీకద్వైతీయీకహకారస్సకారతః పూర్వః ॥ 64

శ్లో॥ అన్వయితవ్యోఽక్షరశః శక్తేశ్చాక్తైర్విభావ్యత్వాత్ ।
వామేచ్ఛాదికశక్తిమయత్వోక్తేరేష శాక్తార్థః ॥ 65

శ్లో॥ కహయోర్లసయోరర్థౌ శివశక్తీ శుద్ధయోరచోః శక్తిః ।
ఉభయోస్సమరసభావో హృల్లేఖాయాః పరం బ్రహ్మ ॥ 66

శ్లో॥ బ్రహ్మైవ శివశ్శక్తిశ్చేతి ప్రత్యేకకూటార్థః ।
శివశక్తిసామరస్యాద్విద్యాయా ఏష సామరస్యార్థః ॥ 67

శ్లో॥ కన దీప్తావితి ధాతోః ప్రకాశకత్వం కకారార్థః ।
అధ్యయనార్థకతేజః స్యాదేకారస్తదీయకరణార్థః ॥ 68

శ్లో॥ వర్ణద్వయమేలనతః ప్రకాశికా బుద్ధిరిత్యర్థః ।
ఈ వ్యాప్తావితి ధాతోస్తస్యా వ్యాప్తిస్తృతీయవర్ణార్థః ॥ 69

శ్లో॥ తస్యా లహర్యాధిక్యం తన్నిర్మాణం మకారార్థః ।
హన హింసాయామితి హం శౌర్యం ప్రత్యర్థిహననకరణత్వాత్ ॥ 70

శ్లో॥ సం భోగసాధనం ధనముపభోగార్థాత్స్యతేస్సునోతేర్వా ।
కము కాంతావితి ధాతోరిచ్ఛావిషయోఽఙ్గనాదిః కమ్ ॥ 71

శ్లో॥ ఏషాం గమనం ప్రాపణమోహఙ్గత్యర్థధాతుజన్యం హమ్ ।
తస్యాతిశయో లహరీ తత్ర శ్లిష్టః సవర్ణదీర్ఘేణ ॥ 72

శ్లో॥ ఈకారస్తస్యార్థః కీర్తిస్సర్వాసు దిక్షు దీప్తత్వాత్ ।
ఈ దీప్తావితి ధాతోర్నిర్మితిరనయోర్మకారార్థః ॥ 73

శ్లో॥ వాగ్భవకూటస్యార్థస్సూక్ష్మమతివ్యాపనాధిక్యమ్ ।
శౌర్యధనస్త్రీయశసామాధిక్యం కామరాజార్థః ॥ 74

శ్లో॥ ఏతే సమ్యక్కలయతి సకలా హరతేర్హ్రకారస్స్యాత్ ।
నిఖిలజగత్సంహర్త్రీత్యర్థస్తస్యాపి వర్ణస్య ॥ 75

శ్లో॥ ఈకారః ప్రశ్లిష్టః సృష్టిస్థితిరూపదీప్తికర్త్రర్థః ।
యద్వా హృది ఖే దహరే ప్రకాశతే తేన మాతా హ్రీః ॥ 76

శ్లో॥ సకలాంతేన పదేన హ్రీకారే కర్మధారయః కార్యః ।
తస్య విశేష్యో మస్స్యాన్నాదార్థస్సంవిదర్థో వా ॥ 77

శ్లో॥ ధాతోర్బహ్వర్థత్వాద్బహులగ్రహణాత్పృషోదరాదిత్వాత్ ।
ఆకృతిగణపాఠేన స్వేచ్ఛానుగుణాదుణాదికల్పనతః ॥ 78

శ్లో॥ ఛందసి సర్వవిధీనాం వైకల్పికతావశాదముష్య మనోః ।
సిద్ధైః కథితేఽర్థేఽస్మిన్ వైయాకరణానుశాసనానుమతిః ॥ 79

శ్లో॥ బహుతరసమాసయోగాత్సమస్తపురుషార్థసాధనత్వోక్తేః ।
సంక్షేపాత్సారోక్తేః శ్రీవిద్యాయాస్సమస్తార్థః ॥ 80

శ్లో॥ కో విధిరేకారో హరిరకార ఈశస్తువార్థమీడపదమ్ ।
ద్విస్వరమధ్యగతస్య డకారస్య ళకార ఆదేశః ॥ 81

శ్లో॥ తేనర్గ్వేదాత్మత్వం సూచితమాద్యస్య కూటస్య ।
క్రమశోఽగ్రిమకూటయుగే తేన యజుస్సామతా సిద్ధా ॥ 82

శ్లో॥ హ్రీమితి నామ విశేష్యం నపుంసకం బ్రహ్మలక్షకత్వేన ।
విధిహరిగిరిశైరీడ్యం బ్రహ్మేతి ప్రథమకూటార్థః ॥ 83

శ్లో॥ హసకం తు హసద్వదనం మతం కకారస్య వదనవాచిత్వాత్ ।
యద్వా హస ఆనందః కస్సూర్యో హస్తు చంద్రస్స్యాత్ ॥ 84

శ్లో॥ ఏతౌ లౌ నయనే యస్య తత్తు కహలం రవీన్దునేత్రమితి ।
తేన ప్రకాశకత్వాచ్చిద్రూపత్వం చ నిగదితం భవతి ॥ 85

శ్లో॥ విధిహరిగిరిశేడ్యత్వే హేతూ ఏతే హసత్వకహలత్వే ।
తేనాత్యమితానందం చిద్బ్రహ్మేతి ద్వితీయకూటార్థః ॥ 86

శ్లో॥ సకలకలాభిః సహితం సకలం బ్రహ్మ తు తృతీయకూటార్థః ।
ఇత్థం గుణగణకథనాత్ విద్యాయా ఏష సగుణార్థః ॥ 87

శ్లో॥ విధిహరిశివవచనా అపి కకార ఏకారకోఽకారః ।
సృష్టిస్థితిభంగాత్మకతత్తజ్జనకత్వలాక్షణికాః ॥ 88

శ్లో॥ ఈశ్వరవాచీకారో వక్తి దకారస్సదాశివం తాభ్యామ్ ।
లక్షణయా తత్ర తిరోధానానుగ్రహణకృత్యతా గదితా ॥ 89

శ్లో॥ హస ఆనందస్సత్యం కం హమనంతం చ లం జ్ఞానమ్ ।
ఇత్థం బ్రహ్మ తటస్థస్వరూపలక్షణయుగేన నిర్ణాయి॥ 90

శ్లో॥ తదభేదం జీవగణే వక్తి తృతీయేన కూటేన ।
జాగ్రత్స్వప్నసుషుప్త్యాఖ్యకలాత్రితయేన సాహిత్యాత్ ॥ 91

శ్లో॥ **సకల**పదం జీవపరం బ్రహ్మపరం శక్తిబీజం స్యాత్ ।
సామానాధికరణ్యాత్తల్లక్షితశుద్ధయోరభేదోఽర్థః ॥ 92

శ్లో॥ అత్యల్పమిదం కథితం యత్సర్వం ఖల్విదం బ్రహ్మ ।
ఇత్యేవం బోధయితుం సకలపదం వా తృతీయకూటగతమ్ ॥ 93

శ్లో॥ ఏవమవాంతరవాక్యైర్జీవబ్రహ్మస్వరూపమభిధాయ ।
తదభేదో వర్ణిత ఇత్యేష మహాపూర్వవాక్యార్థః ॥ 94

శ్లో॥ శక్త్యా లక్షణయా వా యే యేఽర్థా దర్శితా మనోరస్య ।
తేషు న కోఽపి వివాదః ప్రత్యక్షత్వేన సిద్ధత్వాత్ ॥ 95

శ్లో॥ యే పునరిహ భావార్థాదయష్షడర్థా మనోరుక్తాః ।
తేషు యది శక్తిభక్తీ న హి సంభవతస్తథాపి కా హానిః ॥ 96

శ్లో॥ ఆస్తామన్యా వృత్తిర్విలక్షణా తద్గ్రహస్తు మనోః ।
శివవచనేన భవిష్యతి యద్వైషా శక్తిరేవాస్తు ॥ 97

శ్లో॥ ఏతస్మాదయమర్థో బోద్ధవ్య ఇతీశ్వరేచ్ఛాత్వాత్ ।
ప్రతిపదమర్థవిశేషాజ్ఞానేఽప్యాస్తామఖండవాక్యస్య ॥ 98

శ్లో॥ అర్థోఽప్యఖండరూపో విశిష్టమతిరిక్తమితి హి సిద్ధాంతః ।
ఆసేచనకవ్యాప్త్యాదిపదవదాస్తాం పదత్వమపి ॥ 99

శ్లో॥ ఏకస్యానేకార్థా దృష్టా హరిసైంధవాదిషు పదేషు ।
అన్యతమైకావగతౌ ప్రకరణతాత్పర్యయోర్విశేషకతా ॥ 100

శ్లో॥ ప్రకృతే తు సర్వబోధస్యేష్టత్వాన్నో విశేషకాకాంక్షా ।
అథ వా సకలార్థేష్వపి శక్త్యైక్యం పుష్పవంతపదవదిహ ॥ 101

శ్లో॥ యత్ర ప్రతిపదమర్థస్తాన్ ప్రత్యస్యాస్తు వాక్యత్వమ్ ।
క్వచనావాంతరవాక్యం సమాసవాక్యం మహావాక్యమ్ ॥ 102

శ్లో॥ ఏకస్యానేకార్థే వినియోగాదర్థబాహుల్యమ్ ।
వేదే బహుశః స్వీకృతమత్ర త్వేకత్ర వినియోగాత్ ॥ 103

శ్లో॥ అఖిలార్థబోధనియమో నియమాదృష్టం ప్రకల్పయతి ।
సిద్ధే ప్రమాణదార్ఢ్యే సకలం కల్ప్యం హి తదవిరోధాయ ॥ 104

శ్లో॥ యాగస్య స్వర్గం ప్రతి సంసిద్ధే హేతుహేతుమద్భావే ।
తదనుపపత్తిం నిరసితుమలౌకికాపూర్వమపి క్లప్తమ్ ॥ 105

శ్లో॥ విద్యావర్ణే యత్రోద్ధారః కాలస్తదుచ్చారః ।
ఉత్పత్తిస్థానం తద్యత్నో రూపం స్థితిస్థానమ్ ॥ 106

శ్లో॥ ఆకారః స్వం రూపం విభావ్యమర్థోఽన్తరంగాణి ।
ఋషయశ్ఛందోదైవతవినియోగా బీజశక్తికీలాని ॥ 107

శ్లో॥ న్యాసా ధ్యానం నియమాః పూజాదీని బహిరంగాణి ।
బాహ్యాన్యంగాని పునః ప్రాయో లోకే ప్రసిద్ధకల్పాని ॥ 108

శ్లో॥ దుర్లభమాంతరమంగం ప్రాయోఽంతర్ముఖజనైస్తదాదృత్యమ్ ।
తోషాయైషా తేషామతః ప్రదిష్టా రహస్యవరివస్యా ॥ 109

శ్లో॥ ఏతాముత్సృజ్య జడైః క్రియమాణా బాహ్యడంబరోపాస్తిః ।
ప్రాణవిహీనేవ తనుర్విగలితసూత్రేవ పుత్తలికా ॥ 110

శ్లో॥ బీజాన్మూలం మూలాత్ క్షేత్రస్యాన్తఃస్థబాహ్యవిస్తారౌ ।
యద్యప్యనయోస్సామ్యం ప్రాధాన్యమథాపి చాంతరంగస్య ॥ 111

శ్లో॥ సద్గురుకులతః కృపయా లబ్ధా కామానియం సూతే ।
నిజబుద్ధిమాత్రజన్యా పాపం కన్యా యథా స్వీయా ॥ 112

శ్లో॥ అకథాసనం హళక్షాంతరం సమాసాద్య మామకం జ్ఞానమ్ ।
మామకమేవానందం మహ్యం దదతో జయంతి గురుచరణాః ॥ 113

శ్లో॥ గురుచరణైకసహాయో భాస్కరరాయో జగన్మాతుః ।
వరివస్యాతిరహస్యం వీరనమస్యం ప్రజగ్రంథ ॥ 114

**వరివస్యారహస్యే - ద్వితీయోఽంశః ॥**

ఇతి శ్రీమత్ పదవాక్య ప్రమాణ పారావారపారీణ సర్వతంత్ర
స్వతంత్రశ్రీమన్నృసింహానందనాథ చరణారవిందమిళిందేన
శ్రీమత్ భాసురానందనాథేన ప్రణీతం వరివస్యారహస్యమ్ ।

గ్రంథశ్చాయం సమాప్తః ॥

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ



ఔః మ్

శ్రీ శివాయ గురవే నమః

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీలలితామహాత్రిపురసుందర్యై నమః

# శ్రీ వరివస్యారహస్యే - పూర్వాంశః

ప్రారంభః

**వ్యా : అవ :** సర్వతంత్ర స్వతంత్రులును విద్వన్మణులను నగు భాసురానందనాథులు (భాస్కరరాయులు) బాహ్యవరివస్య యందు మాత్రమాసక్తి గలిగి అంతరవరివస్యలేని ఉపాసకలోకమును జూచి వారి యందు దయ కలిగి వారి యుపకారమునకై శీఘ్రసిద్ధి

నిచ్చు ఆంతరవరివస్యయను సర్వతంత్రరహస్యార్థసారమగు గ్రంథము నారంభింప దలచి నిర్విఘ్నముగ గ్రంథపరిసమాప్తి నొంద మున్మందు శ్రీగురుదేవతా నమస్కార రూప మంగళము నొక్క శ్లోకమున నాచరించుచున్నారు.

**శ్లో॥ ప్రహ్లాదాభీష్టదానే విబుధసముదయస్తూయమానాపదానే(ఽ)**
**శేషక్షోణీభృదంతఃప్రవిలసితపదాహోబలక్షేత్రగర్భాత్ ।**
**ప్రాదుర్భూతే హిరణ్యద్విరదమతిమదధ్వాంతతంత్రం నిహంతుం**
**ధీరే సచ్ఛాస్త్రయోనౌ మమ భువనగురావస్తు భక్తిర్ నృసింహే ॥ 1**

ఈ శ్లోకమున నృసింహానందనాథ శిష్యులగు భాస్కరరాయలు తన గురువుయొక్క పేరు పోలికబట్టి అహోబలక్షేత్ర గురువగు నృసింహస్వామితో అభేదమును భావించి గురుదేవతాత్మక స్తోత్రమును చేయుచున్నారు.

ప్రహ్లాదాభీష్టదానే = ప్రహ్లాదుడను రాక్షస కుమారుని కోరికల నిచ్చువాడును, విబుధ సముదయస్తూయమానాపదానే = దేవసమూహముచే స్తోత్రము చేయబడిన పూర్వచరిత్ర గలవాడును. అతిమదధ్వాంతతంత్రమ్ = మిక్కిలి మదమనెడి చీకటికి స్వాధీనమైన, హిరణ్య ద్విరదమ్ = హిరణ్యకశిపుడను ఏనుగును, నిహంతుమ్ = చంపుటకు, శేషక్షోణీభృదంతః ప్రవిలసితపదాఽహోబలక్షేత్రగర్భాత్ = శేషాచల మధ్యభాగమున ప్రసిద్ధస్థానమైన అహోబల క్షేత్రముయొక్క మధ్యనుండి, ప్రాదుర్భూతే = ఉద్భవించినవాడును, ధీరే = ధైర్యశాలియు, సచ్ఛాస్త్రయోనౌ = ఋగ్వేదాది విద్యలకు కారణమైన వాడును, భువనగురౌ = లోకగురువును అగు, నృసింహే = నృసింహస్వామియందు, మమ = నాకు, భక్తిః = భక్తి, అస్తు = కలుగుగాక, "**యస్య నిశ్శ్వసితం వేదాః**" అను శృతి వేదములకు కారణమని భగవత్తత్త్వమును గూర్చి చెప్పుచున్నది. "**శాస్త్రయోనిత్వాత్**" అను బ్రహ్మసూత్రమున్ను శాస్త్రకారణత్వమును పేర్కొనినది. ఊర్ధ్వామ్నాయగురుమండలమున నృసింహమంత్రముండుటచే నృసింహుడు భువన గురువనదగియున్నాడు.

ఇక నృసింహానందనాథులగు గురుస్తోత్రపరమైన యీ శ్లోకమున కర్థము నిట్లు భావించుచున్నాడు.

ప్రహ్లాదాభీష్టదానే = ప్రహ్లాదమనగా – నిరతిశయానందము, మోక్షము – అభీష్టములు = పురుషార్థములు, ధర్మార్థ కామములు కాగా మోక్షమును ధర్మార్థకామముల నిచ్చువాడును, విబుధసముదయస్తూయమానాపదానే = పండిత సమూహముచే స్తుతింపబడుచున్న చరిత్రగల వాడును, హిరణ్యద్విరదమతిమదధ్వాంతతంత్రమ్ = ధనము, ఏనుగులు, అసచ్ఛాస్త్ర జ్ఞానము అనువానిచే కలిగిన అహంకారము గల మధ్వలయొక్క శాస్త్రమైన ద్వైతమును, హిరణ్యమ్ =

ధనము, ద్విరద = ఏనుగులు, మతి = అసచ్ఛాస్త్రజ్ఞానము, వీనిచే, మదముగల ధ్వాన్తులనగా 'ధ్వ' అను అక్షరము అంతమున గలవారు, మధ్వలు = వారి శాస్త్రము ద్వైతము, దానిని, నిహంతుమ్ = ఖండించుటకు, అశేషక్షోణీభృదంతః = అందఱి రాజులమధ్య, ప్రవిలసితపద = ప్రసిద్ధమైన స్థానముగల, అహోబల = అహోబలశాస్త్రియొక్క (భాస్కరరాయలతండ్రి), క్షేత్ర = భార్యయొక్క, గర్భాత్ = గర్భమునుండి, ప్రాదుర్భూతే = ఆవిర్భవించినవాడును, ధీరే = ధైర్యవంతుడును, సచ్ఛాస్త్రయోనౌ = బహుగ్రంథముల రచించిన వాడును, భువనగురౌ = గురువునందు సర్వదేవతాత్మకభావముండవలెను గాన, జగద్గురువగు నృసింహే = నృసింహా-నందనాథుని యందు, మమ = నాకు, భక్తిః = భక్తి, అస్తు = ఉండునుగాక "**మన్నాథః శ్రీజగన్నాథః, మద్గురుః శ్రీజగద్గురుః** " అను శాస్త్రము ననుసరించి తన గురువును తాను జగద్గురువుగ భావింపవలెను కాన భువనగురౌ అను విశేషణమును గురువునకు ప్రయోగించుట సమంజసము.

**అవ :** ఈ విధముగ మంగళాచరణ గావించి, ప్రారంభింపదలచిన శాస్త్రమునకు దేశమును అధికారమును రెండవ శ్లోకమున చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఆ ప్రాచః కామరూపాద్ద్రుహిణసుతనదప్లావితాదా ప్రతీచో**
**గాన్ధారాత్సింధుసాన్ద్రాద్రఘువరచరితాదా చ సేతోరవాచః ।**
**ఆ కేదారాదుదీచస్తుహినగహనతస్సంతి విద్వత్సమాజా**
**యే యే తానేష యత్నస్సుఖయతు సమజాన్ కశ్చమత్కర్తుమీష్టే ॥ 2**

ద్రుహిణసుతనదప్లావితాత్ = బ్రహ్మపుత్రానదిచే తడుపబడిన, ఆ కామరూపాత్ = కామరూపదేశపర్యంతము, ప్రాచః = తూర్పుదేశముగలవారును, సింధు సాంద్రాత్ = సింధునదముచే తడిసిన, ఆ గాంధారాత్ = గాంధారదేశపర్యంతము, ప్రతీచః = పడమటి దిక్కునగల వారును, రఘువరచరితాత్ = రామునిచే రచింపబడిన, ఆ సేతోః = సేతువు వరకు, అవాచః = దక్షిణపు దిక్కున గల వారును, తుహినగహనతః = హిమవత్పర్వత పర్యంతము, ఉదీచః = ఉత్తరదిక్కుననున్న వారును అగు, యే యే విద్వత్సమాజాః = ఎవరెవరు ఉపాసకులు, సన్తి = కలరో, తాన్ = ఆ ఉపాసకులను గుఱించి, ఏషః యత్నః = ఈ ప్రయత్నము, సుఖయతు = ఆనందింపజేయుగాక, సమజాన్ = పశుసమూహములను, చమత్కర్తుమ్ = ఆనందపరచుటకు, కః = ఎవరు, ఈష్టే = సమర్థుడగును, పైన చెప్పబడిన అవధులుగల భారతదేశమునందలి యుపాసకులను నా గ్రంథమానందింపజేయును. కాని పశుప్రాయులగు నితరుల నెవడానందింపజేయగలడు? ఎవడును సమర్థుడు గాడు.

**అవ :** శాస్త్రారంభము చేయుచు "**సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ**" అనెడి బ్రహ్మయొక్క స్వరూప

లక్షణమును, దానినుండి ప్రపంచోత్పత్తిని, తెలియదగిన విషయమగుటను, మూడు శ్లోకములతో చెప్పుచున్నారు.

**శ్లో॥ స జయతి మహాన్ ప్రకాశో యస్మిన్ దృష్టే న దృశ్యతే కిమపి ।**
**కథమివ తస్మిఞ్జ్ఞాతే సర్వం విజ్ఞాతముచ్యతే వేదే ॥ 3**

సః = అందరకు ఆత్మరూపమున ప్రసిద్ధమైనదియు, మహాన్ = అపరిచ్ఛిన్న మైనట్టియు, ప్రకాశః = సర్వావభాసకమైనట్టియు బ్రహ్మవస్తువు, జయతి = సర్వోత్కృష్టముగ వెలుగొందు చున్నది, యస్మిన్ = ఏ బ్రహ్మపదార్థము, దృష్టే = అపరోక్షానుభవ గోచరమగుచుండగా, కిమపి = జగద్వస్తు వేదియు, న దృశ్యతే = గోచరమగుట లేదో, తస్మిన్ = అట్టి బ్రహ్మ వస్తువు, జ్ఞాతే = అనుభవ గోచరమగుచుండగా, సర్వమ్ = జగత్పదార్థమంతయు, విజ్ఞాతమ్ = తెలియబడినదని, వేదే = వేదమునందు, కథమివ = ఎట్లు?, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తా :** '**సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ**' అనగా బ్రహ్మము సత్యమైనదియు, చిద్రూపమైనదనియు అనంతమైనదనిన్ని తైత్తిరీయశ్రుతియందు చెప్పబడినది. సత్యమనగా యథార్థమైనదియు, జ్ఞానమ్ = అవబోధకమైనదియు, **అనంత**మనగా దేశముచేగాని, కాలముచేగాని, వస్తుస్థితిచే గాని, పరిమితిలేనిది. ఆత్మయందీ మూడు ధర్మములుండుటచే **ఆత్మబ్రహ్మమే**యని శ్రుతులుపదేశించినవి. ఆత్మను అనగా తనను లేదని ఎట్టి స్థితిలోను ఏ ప్రాణియు, అంగీకరించు నవకాశము లేదు. కనుక ఆత్మ ప్రతిప్రాణియొక్క తన అనుభవరూపమున జాగ్రదాది సర్వావస్థలయందును నిత్యసిద్ధమగుటచే సద్రూపమైయున్నది. ఇట్టి ఆత్మ అనుభవరూపమున తనను భాసింపచేయుచు తనయందీ జగత్తునంతను భాసింపజేయుచున్నది. కనుక ఆత్మ చిద్రూపమైనది. అనగా జ్ఞానస్వరూపమైనది. ఈ ఆత్మయే నిత్యసిద్ధమై సర్వమును ప్రకాశింపజేయుటచే దీనిచే వ్యాపింపబడని దేశముగాని, వస్తువుగాని, కాలముగాని లేనందున ఇది అనంతము అనగా పరిమితి లేనిది. పరిపూర్ణమైనదని యర్థము. ఇట్లు ఆత్మయే బ్రహ్మ స్వరూపమని శ్రుతులు "**తత్త్వమసి**", "**అహం బ్రహ్మాస్మి**", "**అయమాత్మా బ్రహ్మ**" ఇత్యాది వచనముల వలన బోధించినవి. పై విధముగ ఆత్మాభిన్నమైన బ్రహ్మ నిర్వికల్ప - వృత్తిచే అనుభవగోచరమగు నప్పుడు జగత్పదార్థమేదియు దానికి పరిచ్ఛేదకముగా గోచరింపబడదు. కనుక ఆ బ్రహ్మము "**అశబ్దమస్పర్శమరూపమద్భుతం**" ఇత్యాది వచనములచే నిర్గుణము, భేదవస్తురహితము అని చెప్పబడినది. అనగా బ్రహ్మానుఽభవకాలమున జగత్ పదార్థమేదియు గోచరమగుటలేదని తాత్పర్యము. పై బ్రహ్మయే సకల జగద్రూపమున భాసించినదగుటచే జగత్కారణమగు ఆ బ్రహ్మము తెలియబడినచో, తత్కార్యమగు జగత్స్వరూపము జ్ఞాత మగును. అని దృష్టాంత పూర్వకముగ "**యేనాశ్రుతం శ్రుతం భవతి, అమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతం**"

మొదలగు శ్రుతివాక్యములచే ప్రతిపాదింపబడినది. ఇట్టి స్థితిలో అనగా బ్రహ్మదర్శన సమయమున జగద్దర్శనము లేకపోవుచుండగా, సర్వజగద్విజ్ఞానము శ్రుతిచే ఎట్లు బోధింపబడుచున్నది అను సందేహమును, నిరూపించి గ్రంథకర్త బ్రహ్మయందును జగత్తునందును ఏకరూపమున అనుగతమైయుండు అనిర్వచనీయ మగు ఒకానొక పరబ్రహ్మశక్తి యీ యుభయమునందును కలదని నిరూపించుచున్నారు.

**శ్లో॥ నైసర్గికీ స్ఫురత్తా విమర్శరూపాఽస్య వర్తతే శక్తిః ।**
**తద్యోగాదేవ శివో జగదుత్పాదయతి పాతి సంహరతి ॥ 4**

అస్య = శివశబ్దవాచ్యమైన యీ పరబ్రహ్మమునకు, నైసర్గికీ = స్వాభావికమైనట్టియు అనగా స్వరూపభూతమైన, విమర్శరూపా = విమర్శ స్వరూపమైన, స్ఫురత్తా = స్ఫురణమని వ్యవహరింపబడు, శక్తిః = శకియును, వర్తతే = కలదు, తద్యోగాదేవ = ఆ శక్తి కలిగియుండుట చేతనే, శివః = ఆ బ్రహ్మవస్తువు, జగత్ = ప్రపంచమును, ఉత్పాదయతి = సృష్టించుచున్నది, పాతి = రక్షించుచున్నది, సంహరతి = సంహరించుచున్నది.

**తా :** పైన చెప్పబడిన స్వరూపలక్షణము గల పరబ్రహ్మ వస్తువునకు "**యతో వా ఇమాని భూతాని జాయన్తే । యేన జాతాని జీవంతి । యత్ప్రయంత్యభి సంవిశంతి।**" అని తటస్థ లక్షణమున్ను, శ్రుతులయందే చెప్పబడియున్నది. ఈ పరబ్రహ్మ వస్తువే జగత్తుయొక్క సృష్టి, స్థితి, సంహారములకు కారణమని శ్రుత్యర్థము, విమర్శయనగా స్ఫురత్తా = అని వ్యవహరింపబడు అనిర్వచనీయమైన ఒకానొక శక్తి. ఈ అర్థమునే జగద్గురువులగు శంకరులు సౌందర్యలహరి ప్రథమశ్లోకమున "**శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం, న చేదేవం దేవో న ఖలు కుశలః స్పందితుమపి**" అని వర్ణించియున్నారు. కనుక ఆ శక్తిచే బ్రహ్మాకారాకారితవృత్తి గలిగినచో బ్రహ్మసాక్షాత్కారమగును. బ్రహ్మసాక్షాత్కారమున నీ ప్రపంచమంతయు స్ఫురణశక్తియందు లీనమై యీ స్ఫురణరూపశక్తిచేత ప్రకాశముచే సూర్యుని కనుగొనినట్లు, బ్రహ్మరూపమగు స్ఫురణశక్తిచే బ్రహ్మసాక్షాత్కార మగును.

ఈ యర్థమునే "**తే ధ్యానయోగాఽఽనుగతా అపశ్యన్ దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢామ్**", అని శ్రుతి తెల్పినది. సూర్యునియందు ప్రకాశశక్తివలెను, అగ్నియందు దాహకశక్తివలెను, బ్రహ్మయందు ఈ శక్తి అభేదరూపమున నుండి జగత్కారణమై పరిణమించుచున్నది. కనుక ఈ శక్తి సాక్షాత్కారమున "**సర్వం ఖల్విదం బ్రహ్మ**" ఇత్యాది శ్రుతి వాక్యములు లక్షణా యాసములేకనే సులభముగ సమన్వయమగును. ఇట్టి శ్రుతి సమన్వయముననుసరించియే, వేదవ్యాసులు "**ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాంతానుపరోధాత్**", "**ఆత్మకృతేః పరిణామాత్**", అని సూత్రములు వ్రాసిరి. ఈ శక్తి తన స్ఫురణముచే జగత్ – బ్రహ్మలను రెంటిని ప్రకాశింపచేసిన

స్థితికే **సమాధి** అని పేరు. అదియే పురుషార్థము. నిద్రాకాలమున ఈ శక్తి బ్రహ్మాభిన్నమగు ఆత్మను మాత్రమే ప్రకాశింపచేయుచున్నది. ప్రపంచమును ప్రకాశింపచేయలేదు. జగద్వ్యవహార కాలమున ప్రపంచమునే ప్రకాశింప జేయుచున్నది. కాని ఆత్మ స్వరూపమును తన మాయా విలాసమున మరుగుపరచుచు ప్రకాశింపజేయుట లేదు. కనుక యీ నిద్రా జాగ్రద్దశలు రెండు పురుషార్థములు కావు. స్వప్నదశ కూడా జాగ్రద్దశ వలెనే కేవలము జాగద్వ్యవహారదశ యగుటచే నదియు పురుషార్థము కానేరదు. జగద్బ్రహ్మలను రెంటిని ఒకే కాలము అభేద రూపమున ప్రకాశింపజేయుచు ఆ స్ఫురణశక్తి తాటస్థ్యమును పొందిన సమాధి కాలమున మాత్రమే బ్రహ్మదర్శన రూపమైన **మోక్షరూపమహాపురుషార్థ**మగుచున్నది. అట్టిస్థితిలో ద్వైత ప్రపంచ భాస ముండుట లేదు. ఈ స్ఫురణశక్తి బ్రహ్మానన్యము. కనుక **అద్వైతస్థితియే** శ్రుతులయందు వర్ణింపబడినది.

ఈ శక్తిగతమైన ప్రపంచకారణత్వము, శక్తికి గల అభేదస్థితిచేత, బ్రహ్మకుపకరింపబడినదే కాని శక్తిలేక బ్రహ్మకు స్వయముగ ప్రపంచకారణత్వము సిద్ధింపదు. ఈ శక్తికి పరబ్రహ్మమే స్వరూపము, కానిచో వేరుగా స్వరూపములేనిదై యీ శక్తికి గూడ స్వరూపసిద్ధి కలుగదు. కనుక నీ శక్తియు బ్రహ్మము, ఏకరసమై **ఆనంద** శబ్దముచే వ్యవహరింపబడుచు, శ్రుతి స్మృతులయందు బ్రహ్మమని, ఆనందమని ప్రతిపాదింపబడుచున్నది.

"**ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్**" అని బ్రహ్మసూత్రము కలదు. ఈ రెంటిలో ఏది లేకపోయినను రెండవదానికి సిద్ధిలేదు. శక్తిగతమైన జ్ఞేయతవ్వమే బ్రహ్మకుపచరింపబడు చున్నది. నిత్యసిద్ధమైన బ్రహ్మకు స్వతస్సిద్ధమున జ్ఞేయత్వము లేదు. బ్రహ్మాభిన్నమైన జగత్కారణ-భూతమైన శక్తియొక్క జ్ఞేయత్వమే బ్రహ్మకు గల జ్ఞేయత్వము కనుక, ఆ శక్తిని గురు శాస్త్రాదులచే అవశ్యము తెలిసికొనవలెనని ముందు శ్లోకమున వివరించుచున్నారు. ఆ శక్తి స్వరూప జ్ఞానమునకే **ఉపాసన** యని వ్యవహారము కాన, ఉపాసనయొక్క నిజస్వరూపము బ్రహ్మజ్ఞానమే అని తెలియదగును.

**శ్లో॥ సాఽవశ్యం విజ్ఞేయా యత్పరిణామాదభూదేషా ।**
**అర్థమయీ శబ్దమయీ చక్రమయీ దేహమయ్యపి చ సృష్టిః ॥ 5**

యత్పరిణామాత్ = ఏ శక్తియొక్క విలాసరూపమయిన మార్పువలన, ఏషా = అనుభవించబడు యీ, అర్థమయీ = శివతత్వము మొదలు భూమి వరకు గల షట్త్రింశత్తత్త్వ రూపమగు నదియూ, శబ్దమయీ = పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరీ రూపమగు శబ్ద రూపమగునట్టియు, చక్రమయీ = బిందువు మొదలు భూపురము వరకు గల చక్రరూప మైనదియు నగు, దేహమయీ = కారణ, సూక్ష్మ, స్థూల శరీరరూపమునగు, సృష్టిః =

నాలుగు విధములగు సృష్టి, అభూత్ = కలిగెనో, సా = ఆ శక్తి, అవశ్యమ్ = తప్పక, విజ్ఞేయా = తెలియదగినది.

**తా :** నాల్గవ శ్లోకమున నిరూపింపబడిన శక్తి యొక్క విలాసమున సృష్టి రూపమైన పరిణామము కలిగినది. ఆ సృష్టిని అందరమనుభవించుచున్నాము. అది శివాది పృథివి వఱకుగల ముప్పది యారు తత్వముల రూపమున బ్రహ్మాండములుగను; పరాది శబ్దరూపమున నామములుగను; బిందు, త్రికోణ, అష్టకోణ, బహిర్దశార, అంతర్దశార, చతుర్దశార, అష్టదళ, షోడశదళ, భూపురములను తొమ్మిది ఆవరణలుగల శ్రీచక్రముగను; స్థూల, సూక్ష్మ, కారణ శరీర రూపముననను, నాలుగు విధములుగ నున్నది. ఈ విధమున పరిణమించిన శక్తి, బంధమునకు కారణమయ్యెను. మఱల బంధమునుండి ముక్తి కావలెననిన ఆ స్ఫురణశక్తియే తెలిసికొన దగినది. అజ్ఞానమునకై అట్టి స్ఫురణశక్తిని ఉపాసింపవలెను. ఆ జ్ఞానమెట్టిదనిన, చతుర్విధ సృష్టియు తనకు కారణమైన స్ఫురణశక్తి కంటే వేరు గాదు. ఆ శక్తి బ్రహ్మకంటే వేఱు గాదు. కార్యకారణములకభేదము గనుక అన్నియు నొకటియే. వేఱుగ గోచరించుట ప్రతీతి మాత్రమే. స్ఫురణశక్త్యధీనమైన సృష్టి యంతయు నున్నదిగాని స్వతంత్రమైన స్థితిలేదు. అనునట్టి జ్ఞానమును సద్గురువుల వలన తెలిసికొని యిట్టి జ్ఞానోదయమునకై గురువు జూపిన విధము ననుసరించి, చతుర్విధసృష్టిగల **జగత్తునకు, పరదేవతకు, గురువునకు, తనకు** నభేదముననుసంధించి తాను అద్వైతానందము ననుభవించి **ఆనందరూపుడు** కావలెను. శక్తిని తెలిసికొనిన, బ్రహ్మ తెలియు నను భావమున "**సాఽవశ్యం విజ్ఞేయా**" అని గ్రంథకర్త చెప్పెను. కనుకనే "**తే ధ్యానయోగానుగతా అపశ్యన్ దేవాఽత్మశక్తిం స్వగుణైర్నిగూఢామ్।** " అని శ్వేతాశ్వతరోపనిషత్తున చెప్పబడినది. ఇందువలన ధ్యేయత్వము, జ్ఞేయత్వమున్ను, శక్తికే, శక్తిజ్ఞానమే బ్రహ్మజ్ఞానము, జ్ఞేయత్వాది ధర్మములన్నియు శక్తియందు ముఖ్యవృత్తి వలనను, బ్రహ్మయందు ఉపచారముగను నున్నవి.

**అవ :** అట్టిశక్తిని తెలిసికొను, ఉపాయమును చెప్పుచున్నాడు.

> **శ్లో॥ తజ్జ్ఞానార్థముపాయా విద్యా లోకే చతుర్దశ ప్రోక్తాః ।**
> **తేష్వపి చ సారభూతా వేదాస్తత్రాపి గాయత్రీ ॥** 6

తజ్జ్ఞానార్థమ్ = ఆ విమర్శశక్తిని తెలిసికొనుటకు, లోకే = లోకమున, చతుర్దశ విద్యాః = పదునాలుగు విద్యలు, ఉపాయాః = సాధనములుగా, ప్రోక్తాః = చెప్పబడినవి. అవి...

**తా :** పై శ్లోకమున ప్రతిపాదింపబడిన శక్తిని తెలిసికొనుటకై పదునాలుగు విద్యలు చెప్పబడినవి. అవి '**అంగాని వేదాశ్చత్వారో మీమాంసాన్యాయవిస్తరః । పురాణం ధర్మశాస్త్రం చ విద్యా**

**హ్యేతా శ్చతుర్దశ ॥**' అని పెద్దలచే చెప్పబడినవి. ఈ పదునాల్గింటిలో వేదములు సారమైనవి. వేదములలోను గాయత్రి సారవత్తరమైనది. వివరణ : **శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము** అను నారు వేదాంగములు శరీరమునకు, అవయవములెట్లు పూర్ణతనిచ్చు సాధనములో అట్లే వేదరక్షణకై యీ యారు అంగములుపకరించును. శిక్ష అక్షరసాధుత్వమును; వ్యాకరణము పదసాధుత్వమును; ఛందస్సు వాక్యసాధుత్వమును నిరూపించుచు, వేదమునందలి శబ్దమును రక్షించును. నిరుక్తము శబ్దార్థమును; జ్యోతిషము వేదోక్తకర్మలనాచరింపదగు కాలమును, అందువలన గలుగు ఫలాఫలములను; కల్పము – వేదోక్త కర్మల నాచరించు విధమును వివరించును. ఈ రీతిని నిరుక్తము జ్యోతిషము కల్పమున్ను వేదార్థమును రక్షించును. ఈ విధముగ వేదరక్షణకై మహర్షి ప్రోక్తములు, వేదాంగములు ఆరు. మీమాంస అనగా విమర్శ. ఇది సహస్రన్యాయములచే వేదార్థతాత్పర్యముల నిరూపించునట్టిది. న్యాయవిస్తర మనగా తర్కము. పురాణములు – వేదార్థమును కథారూపమున వివరించుచు, మిత్రునివలె బోధించునవి. ధర్మశాస్త్రము – కర్తవ్యాఽకర్తవ్యములను స్పష్టముగ తెలుపునట్టి మహర్షి ప్రోక్తములగు గ్రంథములు.

**శ్లో॥ తస్యా రూపద్వితయం తత్రైకం యత్ర్పపఠ్యతే(ఽ)స్పష్టమ్ ।**
**వేదేషు చతుర్ష్వపి పరమత్యన్తం గోపనీయతరమ్ ॥ 7**

తస్యాః = ఆ గాయత్రికి, రూపద్వితయమ్ = రెండు విధములైన రూపములు, స్తః = కలవు, తత్ర = ఆ రెంటిలో, ఏకమ్ = ఒకటి, స్పష్టమ్ = స్ఫుటముగ, ప్రపఠ్యతే = చదువబడుచున్నది. త్రిపాద్గాయత్రి అస్పష్టమ్ = అనియు పదవిభాగము. నాల్గవ పాదము = రహస్యముగ ప్రపఠ్యతే, పరమ్ = రెండవ రూపము, వేదేషు చతుర్ష్వ+అపి = నాల్గు వేదములయందును, అత్యంతమ్ = మిక్కిలి, గోపనీయతరమ్ = రహస్యముగ నుంచబడినది.

**తా :** వేదసారమైన గాయత్రికి రెండు విధములైన రూపములు గలవు. ఆ రెంటిలో ఒక రూపము స్పష్టముగ మూడు పాదములతో చెప్పబడినది. నాల్గవపాదము కొంత అస్పష్టముగ చెప్పబడినది. రెండవ రూపము నాలుగు వేదముల యందును రహస్యముగ దాచబడినది. అనగా దాని స్వరూపము "త్రిపాద్గాయత్రి" వలె స్పష్టముగ చెప్పబడలేదు. సాంకేతిక పదములచే చెప్పబడెను. ఆ విధమున చెప్పుటయే దాచబడుట.

**అవ :** సాంకేతిక పదములచే రహస్యముగ నెట్లు చెప్పినదియు ఈ శ్లోకమున చెప్పుచున్నాడు.

**శ్లో॥ కామో యోనిః కమలేత్యేవం సాంకేతికైశ్శబ్దైః ।**
**వ్యవహరతి న తు ప్రకటం యాం విద్యాం వేదపురుషోఽపి ॥ 8**

వేదపురుషః అపి = వేదపురుషుడున్ను, యాం విద్యామ్ = ఏ విద్యను, కామో యోనిః కమలా ఇతి = అని యీ విధముగ, సాంకేతికైః = సంకేతములుగల అనగా ప్రత్యేక పరిభాషతో నేర్పఱచుకొనిన, శబ్దైః = పదములచేత, వ్యవహరతి = వ్యవహరించుచున్నాడు. తు = కాని, ప్రకటమ్ = వెల్లడియగునట్లు, న వ్యవహరతి = వ్యవహరించలేదు.

**తా :** నాలుగు పాదములుగల, అపర గాయత్రి వేదమునందు స్పష్టముగా చెప్పబడినది. పరగాయత్రి యగు పంచదశాక్షరీ రూపమైన బ్రహ్మవిద్య, వేదమున త్రిపురోపనిషత్తు నందును రహస్యముగ నుండవలెనని సంకేత శబ్దములచే చెప్పబడినది. ఎట్లనగా "**కామో యోనిః కమలా వజ్రపాణిః । గుహాహసా మాతరిశ్వాభ్రమింద్రః ॥ పునర్గుహా సకలా మాయయా చ పురూచ్యేషా విశ్వమాతాదివిద్యోమ్ ॥**" అని చెప్పబడినది. ఈ సంకేత శబ్దములకిట్లు అర్థము తెలిసికొనవలెను.

కామః = కకారము, యోనిః = ఏకారము, కమలా = ఈకారము, వజ్రపాణిః = లకారము, గుహా = హ్రీంకారము, హసా = హకార సకారములు, మాతరిశ్వా = కకారము, అభ్రమ్ = ఆకాశబీజము హకారము, ఇంద్రః = లకారము, పునః గుహా = మఱల హ్రీంకారము, సకలా = సకార కకార, లకారములు, మాయయా చ = హ్రీంకారముచేతను అగు, ఏషా = ఈ **పంచదశాక్షరీ** మంత్రము, పురూచీ = పురాతనమైనది. విశ్వమాతా = జగత్తును కనినతల్లి, ఆదివిద్యా = వేదము నందును ప్రాచీనమని చెప్పబడినందున మొదటి విద్యా అనగా పరమైన **బ్రహ్మవిద్య** అని అర్థము. పరగాయత్రి ఆదివిద్యయగుటయు చతుష్పాద్గాయత్రి యగు అపర గాయత్రిని వేదము స్వరూపముననే చెప్పుటయు, పరగాయత్రి యగు పంచదశాక్షరీ మంత్రమును సంకేతశబ్దములచే చెప్పుటయు ఈ మంత్రముయొక్క విశేషమును, గొప్ప-దనమును తెలుపుచున్నది. అందువలన పరమపురుషార్థమగు **మోక్షమున** కిది సాధన మగుటయు అతిరహస్యమగుటయు, తప్పక తెలిసికొనదగినదేగాని వ్రాత, భాష, మున్నగువాని వలన తెలియదగినది గాదు. అట్లే ఇదియును తెలియదగినది.

**అవ :** విద్యావర్ణముల, ఉద్ధారమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ క్రోధీశశ్రీకణ్ఠారూఢః కోణత్రయం లక్ష్మీః ।**
**మాంసమనుత్తరరూఢం వాగ్భవకూటం ప్రకీర్తితం ప్రథమమ్ ॥ 9**

శ్రీకంఠారూఢః = అకారముతో కూడిన, క్రోధీశః = కకారము, ఈ విధమున కకారమున రెండక్షరములున్నవని తేలినది. కోణత్రయమ్ = ఏకారము, లక్ష్మీః = కామకలా అక్షరమైన ఈ కారము, అనుత్తరారూఢమ్ = అకారముతో గూడిన, మాంసం = లకారము, ఇట్లనుటచే

లకారమునందు రెండక్షరములున్నవని అర్థము. ఈ విధముగ ప్రథమకూటమున నాల్గు అక్షరములున్నవి. దీనికి వాగ్భవకూటమని పేరు.

"**శ్రీమద్వాగ్భవకూటైకస్వరూపముఖపంకజా**" అని సహస్రనామమున వాగ్భవకూటము పరదేవతయొక్క ముఖభాగముగ చెప్పబడినది.

**అవ :** రెండవకూటముయొక్క ఉద్ధారమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ శివహంసబ్రహ్మవియచ్చక్రాః ప్రత్యేకమక్షరారూఢాః ।**
**ద్వితీయాకం కూటం కథితం తత్కామరాజాఖ్యమ్ ॥ 10**

ప్రత్యేకమ్ = వేరు వేరుగా, అక్షరారూఢాః = అకారముతో కూడిన, శివః = హకారము, ఇట్లనుటచే ఒక్కొక్క అక్షరమున రెండు రెండు వర్ణములు కలవని యెరుగునది. ఈ విధమున ఐదు అక్షరములచే రెండవ కూటము చెప్పబడినది. ఈ రెండవ కూటమునకు కామరాజ కూటమని పేరు. "**కంఠాధఃకటిపర్యన్తమధ్యకూటస్వరూపిణీ**" అని సహస్రనామమున పరదేవతకు మధ్యశరీరముగ చెప్పబడినది.

**అవ :** ఇక మూడవ కూటమునకు అక్షరోద్ధారమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ శివతో వియతో ముక్తం తృతీయమిదమేవ శక్తికూటాఖ్యమ్ ।**

ఇదమేవ = ఈ ద్వితీయకూటమే, శివతః వియతః = హకారముల రెంటిచే, ముక్తమ్ = శూన్యమైనదై, తృతీయమ్ = మూడవదైన, శక్తి కూటాఖ్యమ్ = శక్తికూటమను పేరుగలది. భవతి = అగుచున్నది. అకారముతో గూడిన మూడక్షరములు శక్తికూటమగును.

**అవ :** పైన చెప్పిన రీతిగ విద్యకు పంద్రెండక్షరములే అగును. పదునైదు అక్షరములను ప్రసిద్ధి ఎట్లు సరిపోవును, అనగా దానికి సమాధానము ఈ క్రింది శ్లోకమున చెప్పుచున్నాడు.

**హృల్లేఖానాం త్రితయం కూటత్రితయేఽపి యోజ్యమంతే స్యాత్ ॥ 11**

హృల్లేఖానామ్ = హ్రీంకారముల యొక్క, త్రితయమ్ = మూడును, కూటత్రితయేపి = మూడు కూటముల యొక్కయు, అన్తే = చివర, యోజ్యమ్ = కలుపదగినదై, స్యాత్ = అగుచున్నది.

**తా :** మూడు కూటముల యందు ఒక్కొక్క కూటము చివర, ఒక్కొక్క భువనేశ్వరీ బీజమును, అనగా హ్రీంకారమును చేర్చవలయును. అట్లు చేర్చగా పదునైదు అక్షరములగును.

**అవ :** ఇక హృల్లేఖా స్వరూపమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ హృల్లేఖాయాస్స్వరూపం తు వ్యోమాగ్నిర్వామలోచనా ।**
**బింద్వర్ధచంద్రరోధిన్యో నాదనాదాంతశక్తయః ॥ 12**

**శ్లో॥ వ్యాపికాసమనోన్మన్య ఇతి ద్వాదశసంహతిః ।**
**బింద్వాదీనాం నవానాం తు సమష్టిర్నాద ఉచ్యతే ॥ 13**

వ్యోమ = హకారము, అగ్నిః = రేఫ, వామలోచనా = ఈకారము, బింద్వర్ధ... న్యః = బిందువు, అర్ధచంద్రము, రోధినీ, నాద... శక్తయః = నాదము, నాదాంతము, శక్తి, వ్యాపికాసమనోన్మన్యః = వ్యాపికా సమన, ఉన్మనీ, ఇతి = అనెడి, ద్వాదశసంహతిః = పంద్రెండింటి యొక్క సమూహము, హృల్లేఖాయాః = హ్రీంకారముయొక్క, స్వరూపమ్ = ఆకారము, తు = హకారము, రేఫ, ఈకారము, బిందువు, అర్ధచంద్రము రోధిని, నాదము, నాదాంతము, శక్తి, వ్యాపిక, సమన, ఉన్మనీ అనెడి పంద్రెండింటి యొక్క సమూహము హ్రీంకారము యొక్క ఆకారము. ఇచట హకార రేఫలు హల్ మాత్రములే, అకార విశిష్టములు కావు. బింద్వాదీనామ్ = బిందువు మొదలైన, నవానామ్ = తొమ్మిదింటి యొక్క, సమష్టిః తు = సమూహమైతే, నాదః = నాదము అని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తా :** బిందువు మొదలుకొని ఉన్మని వరకుగల తొమ్మిదింటికి కలిపి నాదము అని పేరు. దీనికి వర్ణములనియు సంజ్ఞ కలదు. మంత్రశాస్త్రమున అర్ధచంద్రము మొదలు ఉన్మని వరకు నాదము అని సంజ్ఞ. అయినను వ్యవహార సౌకర్యము కొఱకు బిందువునకును గౌణ వృత్తితో నాదమను సంజ్ఞ చేయబడినది.

**అవ :** సమష్టిగను, వ్యష్టిగను, మంత్రమునగల వర్ణముల సంఖ్యను చెప్పుచున్నాడు.

**శ్లో॥ ప్రథమేఽష్టాదశ వర్ణా ద్వావింశతిరక్షరాణి మధ్యే స్యుః ।**
**ప్రథమేన తుల్యమంత్యం సంఘాతేనాష్టపంచాశత్ ॥ 14**

ప్రథమే = మొదటికూటమునందు, అష్టాదశ వర్ణాః = పదునెనిమిది వర్ణములు, మధ్యే = మధ్య కూటమునందు అనగా రెండవ కూటమున, ద్వావింశతిః అక్షరాణి = ఇరువది రెండు అక్షరములు, స్యుః = ఉన్నవి. అంత్యమ్ = చివరి కూటము, ప్రథమేన = మొదటిదానితో, తుల్యమ్ = సమానమైనది. సంఘాతేన = సమూహముగ, అష్టపంచాశత్ = ఏబది యెనిమిది వర్ణములు.

**తా :** ప్రథమ కూటమున ఒకటి, నాలుగు, అక్షరములు రెండు రెండు వర్ణములు కలవి. రెండవ అక్షరము ఒకటి, మూడవది యొకటి, హ్రీంకారమున పంద్రెండు. ఇట్లు ప్రథమకూటమున పదునెనిమిది వర్ణములు ఉన్నవి. ద్వితీయ కూటమున హకారము మొదలు

అయిదు అక్షరములు రెండు రెండు వర్ణములు కలవి కాగా పది వర్ణములు. హ్రీంకారమున పంద్రెండు ఇట్లు మధ్యకూటమునందు, ఇరువది రెండు అక్షరములు గలవు. మూడవ కూటమున మొదటి మూడు అక్షరములు రెండు రెండు వర్ణములు గలవి. హ్రీంకారమున నున్న పంద్రెండు వర్ణములు కలసి ప్రథమకూటముతో సమానముగ నయ్యెను. ఇట్లు సమష్టిమంత్రమాత్రమున ఏబది యెనిమిది వర్ణములున్నవి.

**అవ :** ఇక వర్ణములయొక్క యుచ్చారణకాలమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ మాత్రాద్వితయోచ్చార్యా కామకలా చ త్రికోణా చ ।**
**బిందురహితహృల్లేఖా మాత్రాకాలత్రయోచ్చార్యాః ॥** 15

కామకలా చ = ఈ కారమున్ను, త్రికోణా చ = ఏకారమున్ను, మాత్రాద్వితయోచ్చార్యాః = రెండు మాత్రల కాలమున ఉచ్చరింపదగినది. బిందు రహిత హృల్లేఖా = బిందువులేని హ్రీంకారము, మాత్రా కాల త్రయోచ్చార్యాః = మూడు మాత్రల కాలమున ఉచ్చరింపవలసినది.

**తా :** హ్రస్వాక్షరము యొక్క ఉచ్చారణ ఒక్క మాత్రకాలమున జరుగును. దీర్ఘాక్షరముయొక్క ఉచ్చారణ కాలము రెండు మాత్రలు. వ్యంజనాక్షరముయొక్క ఉచ్చారణ కాలము అర్ధమాత్రము.

**శ్లో॥ "ఏకమాత్రో భవేద్ధ్రస్వో ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే।**
**త్రిమాత్రస్తు ప్లుతో జ్ఞేయో వ్యంజనం త్వర్ధ-మాత్రకమ్** " అను శాస్త్రము ప్రమాణము.

ఈకార ఏకారములు దీర్ఘాక్షరములగుటచే ఒక్కొక్కటి రెండు మాత్రల కాలమున నుచ్చరింపబడవలెను. బిందువు లేని, హ్రీ అనునది, (హ్+ర్+ఈ) అను వర్ణములు గలది. హకార రేఫలు హల్ మాత్రములగుటచే ఒక్కొక్కటికి అర్ధమాత్రాకాలము చొప్పున రెండును ఒక మాత్రాకాలమున ఉచ్చరింపబడును. ఏకారము, ఈ కారమున్ను దీర్ఘాక్షర మగుటచే రెండు మాత్రల కాలమున ఉచ్చరింపబడును. ఇట్లు హకార, రేఫ, ఈ కారములు కలిసిన బిందువులేని హ్రీకార ఉచ్చారణకు మూడు మాత్రల కాలము పట్టును.

**శ్లో॥ అన్యేషాం వర్ణానాం మాత్రాకాలోఽర్ధమాత్రయా సహితః ।**

అన్యేషామ్ = ఇతరములైన పదియగు, వర్ణానామ్ = అక్షరములకు, అర్ధమాత్రయా = అర్ధమాత్రతో, సహితః = కూడిన, మాత్రాకాలః = మాత్రాకాలము.

**తా :** మంత్రమున మిగిలిన పది అక్షరములకు ఒక్కొక్క అక్షరము యొక్క ఉచ్చారణకు ఒకటిన్నర మాత్ర కాలము పట్టును. వ్యంజనము నకు అర్ధమాత్రాకాలము. అచ్చునకు మాత్రా కాలము. ఉచ్చారణమున నగు కాల మిట్లు పది అక్షరములయొక్క ఉచ్చారణమునకు పదునైదు మాత్రల కాలము పట్టును.

**అవ :** మిగిలిన బింద్వాది నవకమునకు ఉచ్చారణ కాలమును చెప్పుచున్నాడు.

**బిందోరర్ధం మాత్రా పరే పరే చాపి పూర్వపూర్వార్ధాః ॥ 16**

బిందోః = బిందువునకు, అర్ధం మాత్రా = మాత్రాకాలములో సగము, పరే పరే చ = మున్ముందుగలవి, అనగా అర్ధచంద్ర, రోధిని, మున్నగునవి, పూర్వపూర్వార్ధాః = మొదటివాని యొక్క ఉచ్చారణ కాలమున సగము కలవి.

**తా :** బిందువు హల్ అగుటచే అర్ధమాత్రా కాలమున ఉచ్చరింపబడును. తరువాత తరువాత నున్న అర్ధచంద్ర, రోధిని మున్నగునవి మొదటి మొదటి వాని ఉచ్చారణ కాలము యొక్క సగము కాలమున ఉచ్చరింపబడును. అనగా బిందూచ్చారణ కాలము యొక్క సగము కాలమున అర్ధచంద్రము, అర్ధచంద్రోచ్చారణ కాలము యొక్క సగము కాలము రోధిని, రోధిన్యుచ్చారణ కాలము యొక్క సగము కాలము నాదము, నాదోచ్చారణ కాలము యొక్క సగము కాలము నాదాంతము, నాదాంతోచ్చారణ కాలము యొక్క సగము కాలమున శక్తి, శక్త్యుచ్చారణ కాలము యొక్క సగము కాలమున వ్యాపిక, వ్యాపికోచ్చారణ కాలము యొక్క సగము కాలమున సమన, ఉన్మని యొక్క యుచ్చారణమునకు కాలపరిచ్ఛేదము లేదు.

**"నలినీపత్రసంహత్యాః సూక్ష్మసూచ్యభివేధనే ।**
**దళే దళే తు యః కాలః స కాలో లవసంజ్ఞితః ॥**
**అతః సూక్ష్మతమః కాలో నోపలభ్యో భృగూద్వహ ॥ "**

అను వచనము ననుసరించి కాల పరమాణువునకు లవమని పేరు. తామరేకుల బొత్తియందు సన్నని సూది గ్రుచ్చి నపుడు ఒక దళమునుండి క్రింది దళములకు సూది గుంటకగు కాలమునకు లవమని పేరు. ఇంతకంటే సూక్ష్మతమమైన కాలము లేదు. ఈ కాలమునకే కాలపరమాణువనియు, లవమనియు సంజ్ఞ. రెండు వందల ఏబది యారు లవములు కలిసిన కాలము మాత్ర యనబడును. బిందువు అర్ధమాత్ర యగుటచే నూటయిరువది ఎనిమిది లవముల కాలము. అర్ధచంద్రమునకు అరువది నాలుగు లవముల కాలము. రోధినికి ముప్పదిరెండు, నాదమునకు పదునాఱు, నాదాంతమునకు ఎనిమిది, శక్తికి నాలుగు, వ్యాపికకు రెండు, సమనకు ఒక్క లవకాలము, ఉన్మనకు కాలమేలేదు. అమనస్కమైన దానికి కాలపరిచ్ఛేదము లేదు.

**అవ :** ఇట్లు కాగా బిందువు మొదలు సమన వరకు గల నాదము యొక్క ఉచ్చారణకు, లవలయొక్క కూడిక వలననైన కాలమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ సంహత్యైకలవోనో మాత్రాకాలోఽస్య నాదస్య ।**

అస్య నాదస్య = ఈ నాదముయొక్క, సంహత్యా = లవల యొక్క కూడికచేత, ఏకలవోనః = ఒక లవము తక్కువగల, మాత్రాకాలః = మాత్రాకాలము.

**తా :** బిందువు మొదలు ఉన్మనీవరకు గల నాదముయొక్క ఉచ్చారణకైన లవముల యొక్క కూడికచే నైన కాలము ఒక లవము తక్కువగల యొకమాత్ర.

**అవ :** ఇక ప్రతికూటమునకు ఈ ప్రకారముగ లెక్కించుట వలన కాలమును విభజించి చూపుచున్నాడు.

**ఏకాదశ వాక్కూటే సార్ధా ఏకాదశోదితా మధ్యే ॥ 17**

**శ్లో॥ సార్ధా అష్టౌ శక్తావేకైకలవోనితా మాత్రాః ।**
**సంహత్యైకత్రింశన్మాత్రా మంత్రే లవత్రయన్యూనాః ॥ 18**

వాక్కూటే = మొదటిదియగు వాగ్భవకూటమున, ఏకాదశ = పదకొండు, మధ్యే = మధ్యదియగు రెండవకూటమున, సార్ధైకాదశ = పదకొండున్నర, శక్తౌ = శక్తియందు, సార్ధాః అష్టౌ = ఎనిమిదిన్నర, మాత్రాః = మాత్రలు, ఏకైకలవోనితాః = ఒక్కొక్క లవము తక్కువయైనవి, ఉదితాః = చెప్పబడినవి. సంహత్య= కలసి, మంత్రే = మంత్రమునందు, లవత్రయన్యూనాః = మూడులవములు తక్కువగల, ఏకత్రింశన్మాత్రాః = ముప్పది యొక్క మాత్రలు, సంతి = కలవు.

**తా :** ఏకలవోనితాః = ఒకలవతక్కువగలది అను విషయమును ప్రతికూటమునకు అన్వయింపవలెను. కాగా మొదటిదియగు, వాగ్భవకూటముయొక్క ఉచ్చారణమునకు ఒక లవము తక్కువగా పదునొకండు మాత్రల కాలము పట్టును. మధ్యదియగు రెండవ కూటము యొక్క ఉచ్చారణకు నొకలవము తక్కువగా పదునొకండున్నర మాత్రల కాలమగును. శక్తి కూటమనబడు మూడవ కూటముయొక్క ఉచ్చారణమునకు ఒక లవము తక్కువగా ఎనిమిదిన్నర మాత్రల కాలమగును. ఈ విధముగా పంచదశాక్షరీ మంత్రము యొక్క ఉచ్చారణకు మూడు లవములు తక్కువగల ముప్పది యొక్క మాత్రల కాలమగును.

**అవ :** ఇక మంత్రాక్షరముల యొక్క ఉత్పత్తి స్థానములను ప్రయత్నములను చెప్పుచున్నాడు.

**శ్లో॥ కణ్ఠే చ కణ్ఠతాలుని తాలుని దంతేషు మూర్ధ్ని నాసాయామ్ ।**
**స్పృష్టవివారాభ్యంతరబాహ్యైర్యత్నైస్తదక్షరోత్పత్తిః ॥ 19**

కంఠే చ = కంఠమునందును, కంఠతాలుని = కంఠతాలు స్థానమునందును, తాలుని తాలుస్థానమునందును, దంతేషు = దంతములయందును, మూర్ధ్ని = శిరస్సునందును,

నాసాయామ్ = ముక్కునందును, స్పృష్ట, వివార+అభ్యంతర, బాహ్యైః యత్నైః = స్పృష్టము, వివారము అనెడి అభ్యంతర బాహ్య ప్రయత్నములచే, తదక్షరోత్పత్తిః = ఈ మంత్రాక్షరముల యొక్క ఉత్పత్తి, భవతి = అగుచున్నది.

**తా :** శ్రీపంచదశీ మహావిద్యయందలి 58 అక్షరములలో మూడు కకారములు, ఐదు హకారములు కంఠముననుత్పన్నమగుచున్నవి. కనుక దాని స్థానము కంఠము, ఏకారముయొక్క స్థానము కంఠతాలువు. నాలుగు ఈకారములయొక్క స్థానము తాలువు; మూడు లకారములు, రెండు సకారములు దంతములయందు, మూడు రేఫలు శిరస్సునందు, బింద్వాది నవకమైన నాదత్రయము నాసికయందు నుత్పన్నమగుచున్నది.

కకారములు స్పృష్ట ప్రయత్నముగలవి. అకార, ఈకార, ఏకారములు, నాదత్రయమున్ను వివృత ప్రయత్నము గలవి. మూడు రేఫలు, లకారము, ఈషత్ స్పృష్ట ప్రయత్నముగలవి. వివృతమునకు ఈషద్ వివృతములకు అభ్యంతర ప్రయత్నము, సకార హకారములు ఈషద్ వివృతములు. స్పృష్టములకు, ఈషద్ స్పృష్టలకు బాహ్యాయత్నము, ఈ విధములైన ప్రయత్నములచే మంత్రాక్షరములు, ఉత్పన్నములైనవి. ఈ ప్రయత్నముల వివరము, **మాతృకా చక్రవివేకమున** చూడవలయును.

**అవ :** ఇక వర్ణములయొక్క స్థానమును రూపమును ఆకారమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ ప్రలయాగ్నినిభం ప్రథమం మూలాధారాదనాహతం స్పృశతి ।**
**తస్మాదాజ్ఞాచక్రం ద్వితీయకూటం తు కోటిసూర్యాభమ్ ॥ 20**

ప్రళయాగ్నినిభమ్ = కాలాగ్నితో సమానమైన, ప్రథమమ్ = మొదటిది అయిన, వాగ్భవకూటము, మూలాధారాత్ = మూలాధారచక్రము మొదలుకొని, అనాహతమ్ = అనాహత చక్రమును, స్పృశతి = తాకుచున్నది. కోటిసూర్యాభమ్ = కోటిసూర్యకాంతితో సమానమైన, ద్వితీయకూటం తు = రెండవదియైన కామరాజ కూటము, తస్మాత్ = ఆ యనాహత చక్రము మొదలు, ఆజ్ఞాచక్రమ్ = ఆజ్ఞాచక్రమును, స్పృశతి = స్పృశించుచున్నది.

**తా :** ప్రళయకాలము నందలి అగ్నియొక్క కాంతివంటి కాంతి కలదిగా మొదటిదియైన వాగ్భవకూటమును భావింపవలెను. అది గుద ప్రదేశమునకు రెండంగుళములకు పైనన్న మూలాధారమను చక్రము మొదలు హృదయ ప్రదేశముననున్న అనాహత చక్రము వఱకు వ్యాపించి యున్నది. అనగా ఒక వర్ణముపై మఱియొక వర్ణమును భావించుచు ఈ ప్రథమ కూటమును అగ్నిమండలస్థితముగా భావింపవలెను. కోటి సూర్యకాంతిగల రెండవది యైన కామరాజ కూటమును అనాహతచక్రము మొదలు భ్రూమధ్య ప్రదేశమునున్న ఆజ్ఞాచక్రము

వరకు పూర్వమువలె నొక అక్షరముపై మరియొక అక్షరమున్నట్లు భావించి వ్యాపించియున్నట్లు సూర్యమండలస్థితముగ భావింపవలెను.

**శ్లో॥ తస్మాల్లలాటమధ్యం తార్తీయం కోటిచంద్రాభమ్ ।**
**మాలామణివద్వర్ణాః క్రమేణ భావ్యా ఉపర్యుపరి ॥ 21**

కోటి చంద్రాభమ్ = కోటి చంద్రులకాంతివంటి కాంతిగల, తార్తీయమ్ = మూడవది యైన శక్తికూటము, తస్మాత్ = ఆ యాజ్ఞా చక్రమునుండి, లలాట మధ్యమ్ = ఫాలప్రదేశము యొక్క మధ్య భాగమును, స్పృశతి = స్పృశించుచున్నది, వర్ణాః = కకారాది అక్షరములు, మాలామణివత్ = మాలయందు మణులవలె, క్రమేణ, క్రమముగా, ఉపర్యుపరి = పైపైన, భావ్యాః = భావింపదగినది.

**తా :** మూలాధారము మొదలు లలాట మధ్య పర్యంతము, కకారములు మొదలుగా గల పదునైదు వర్ణములు నొకదానిపై నొకటి పూర్వము చెప్పినవిధమున ఆయా స్థానముల యందు భావింపదగునని భావము. ఈ భావనము బింద్వాది మూడు నాద నవకములు చేరని మంత్రమున కని ఎరుంగునది. బింద్వాది మూడు నవకముల యొక్క భావన మున్ముందు వివరింపబడును.

**శ్లో॥ ఆధారోత్థితనాదో గుణ ఇవ పరిభాతి వర్ణమధ్యగతః ।**

ఆధారోత్థినాదః = మూలాధారమున పుట్టిన నాదము, వర్ణమధ్యగతః = మూలాధారము మొదలు లలాట మధ్యమువరకు, ఆయా స్థానముల యందు, మూడు కూటములుగ నున్న కకారాద్యక్షరములయొక్క మధ్యను పొందినదై గుణ ఇవ = దారమువలె, పరిభాతి = ప్రకాశించుచున్నది.

**తా :** మాలయందు మణులకంటె దారము వేరు, అట్లే మంత్రాక్షరములయందు రెండు రెండు అక్షరముల మధ్యన శుద్ధమైన నాదము ప్రకాశించును. వర్ణములయందు నాదము ఆ వర్ణరూపమునే పొందును. వర్ణములమధ్య శుద్ధనాదము గోచరించును. కాన మంత్రము కంటే నాదము వేరుగ నున్నదని తాత్పర్యము.

ఇచ్చట ఈ క్రింది విశేషవిషయము తెలిసి కొనదగినది.

సృష్టి ప్రక్రియ యిట్లున్నది. నామరూపాత్మకమైన ప్రపంచమంతయు బీజమునందు వృక్షమువలె పరావాక్కునందున్నది.

ఆ పరావాక్కు ప్రకాశ, విమర్శ స్వరూపమైనది. త్రిపురసుందరి యని వ్యవహరింప

బడుచున్నది. ఆ పరావాక్కు జీవరూపమున మూలాధారమందలి త్రికోణమున ప్రవేశించి యున్నది. అదియె మాతృకాస్వరూపమున్ను, మంత్రస్వరూపమున్ను. ఇది ప్రతిదినము ఆ దినమున ననుభవింపదగు ప్రారబ్ధకర్మము పరిసమాప్తి నొందిన పిదప ప్రపంచవిముక్తమై బిందు రూపమున స్వస్వరూపస్థితి యందుండును. అప్పుడు ప్రకాశరూపమైన ఆత్మ సుషుప్తిని పొందినదని వ్యవహరింపబడును.

తరువాత మఱల ప్రారబ్ధానుభవకాలము సమీపించినప్పుడు "**తదైక్షత బహు స్యాం ప్రజాయేయ**" ఈ మొదలైన వేదార్థముననుసరించును. ఈ క్షతి ధాతువునకు అర్థమైన పశ్యంతీ పదముచే వ్యవహరింపబడును. అట్టి స్థితియందు స్వాధిష్ఠానచక్రము నతిక్రమించి మణిపూరకచక్రము వరకు, బహిర్ముఖతను పొందియుండును. నాదవృత్తులు విభక్తములు కాక యున్న, ఆ పశ్యంతి యే మణిపూరకము నుండి బయల్వెడలి ఊర్ధ్వ ప్రసారము నొంది నాదరూపమునను, వృత్తి రూపమునను రెండుగా విభాగమును పొందినదై అంతరమైన శ్రోత్రముచేతను, మనస్సుచేతను, నాదరూపమున గ్రహింపబడుచున్నదై, విసర్గస్థితినొందును. అనగా అవిచ్ఛిన్నమైన బిందుస్థితి తొలగి భేదస్థితిని పొందినదని భావము. ఈ స్థితి పరావాక్కువలె అతిసూక్ష్మము కాదు. వైఖరివలె స్థూలము కాదు. అందువలన మధ్యమావాక్కని వ్యవహరింపబడుచున్నది. ఆ విధమున జాగ్రత్ సుషుప్తుల యొక్క సంధి స్థానమైన స్వప్నావస్థా స్థితిని పొందుచున్నది. తరువాత ఆ మధ్యమావాక్కే అనాహతమునుండి బయల్వెడలి విశుద్ధము వరకు, అనాహత నాద రూపముననే యుండును. విశుద్ధములైన ఆజ్ఞాచక్రమునకు క్రిందనున్న ఏడుద్వారముల యందు బయటకు వచ్చి నామ రూపాత్మకమైన ప్రపంచముగా పరిణమించు చున్నది. అట్టి నామరూపాత్మక ప్రపంచమున గల నాదాంశమే కంఠము, తాలువు, ఓష్ఠము, మొదలగు స్థానములయొక్క సంయోగముచేత ఏబది వర్ణములయొక్క స్వరూప మైనది. ఆ యా అక్షరముల యొక్క కలయిక వలన వేదములు, శాస్త్రములు, భౌతిక శబ్దములు మున్నగు శబ్దప్రపంచము కలిగినది. వృత్త్యంశము వాక్కున కంటె నితరములైన యింద్రియముల నుండి వెలువడి అర్థాకారమును పొందినది. అప్పుడు ఆత్మ జాగరితము, అని వ్యవహరింప బడుచున్నది. మఱల ప్రారబ్ధము పూర్తియైనపుడు సుషుప్తమై (నిద్రించి) యున్నది. ఈ విధముగా జాగ్రత్స్వప్నసుషుప్తులనెడి అవస్థలను మాటిమాటికిని పొందుచుండును. తరువాత నొకప్పుడు జాగ్రత్ స్థితిలో నున్నవానికి పూర్వజన్మ పుణ్యకర్మ పరిపాకము వలన, సద్గురువు లభింపగా అట్టి గురూత్తముని వలన నాదవృత్తి విలయన యోగమును పొంది, అభ్యసించి, ఆజ్ఞాచక్రమున మఱల నాదముయొక్క విసర్గస్థితిని పొందును. ఆజ్ఞాచక్రము మొదలు బ్రహ్మరంధ్రము వరకు క్రమముగా నాదవృత్తుల కలయిక నభ్యసించి బ్రహ్మరంధ్రమున నాదవృత్తుల ఏక స్వరూపమగు బిందుస్థితిని పొందించి, ముక్తుడగును. ఇట్లు మూలాధారము మొదలు బ్రహ్మరంధ్రము

వరకు నాదము యొక్క, అనువృత్తి చూపబడినది. ఈ నాదమే మూలాధారము మొదలు ఆ యా స్థానముల యందు మంత్రాక్షరములుగ విశేషరూపమునను, వర్ణముల మధ్య శుద్ధనాద-రూపమునను భాసించును.

ఇట్లు **పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ** రూపమున నాదము నాల్గు విధములైన పరిణామమును పొందినది. ఈ విషయమే "**చత్వారి వాక్పరిమితా పదాని తాని విదుర్ బ్రాహ్మణా యే మనీషిణః ॥ గుహా త్రీణి నిహితా నేంగయంతి తురీయం వాచో మనుష్యా వదంతి॥**" అను మంత్రమున చెప్పబడినది.

**అవ :** మిగిలిన మూడవ కూటమునందలి బింద్వాది నవకమునకు లలాటము మొదలు స్థానమును, నాదనవకముయొక్క రూపమును, ఆకారమును చెప్పుచున్నాడు.

**మధ్యే ఫాలం బిందుర్దీప ఇవాభాతి వర్తులాకారః ॥ 22**

బిందుః = బిందువు, మధ్యే ఫాలమ్ = లలాటముయొక్క మధ్య ప్రదేశమున, దీపః+ఇవ = దీపకాంతివలె, వర్తులాకారః = కొంచెము పొడవైన గుండ్రని ఆకారముగలదై, ఆభాతి = ప్రకాశించుచున్నది.

**అవ :** ఇక అర్ధచంద్ర, రోధినుల స్వభావము చెప్పుచున్నారు.

**శ్లో॥ తదుపరి మతోఽర్ధచంద్రోఽన్వర్థః కాంత్యా తథాఽఽకృత్యా ।**
**అథ రోధినీ తదూర్ధ్వం త్రికోణరూపా చ చన్ద్రికాకాన్తిః ॥ 23**

తదుపరి = బిందువునకు ఊర్ధ్వ ప్రదేశమున, అర్ధచంద్రః = అర్ధచంద్రము, కాంత్యా = కాంతిచేతను, తథా = మఱియు, ఆకృత్యా = ఆకారముచేతను, అన్వర్థః = సార్థకమైనది, అర్ధచంద్ర సమానకాన్తియు, ఆకారమును గలదిగ, అది ఊర్ధ్వాగ్రమై, మతః = మనమున భావింపబడినది, అథ = తరువాత, తదూర్ధ్వమ్ = అర్ధచంద్రమునకు పైన, రోధినీ = రోధినీ, త్రికోణరూపా = ఊర్ధ్వాగ్రకోణముగల త్రికోణరూపమైనది. చంద్రికాకాన్తిః = వెన్నెల వంటి కాంతిగలదై, భాతి = ప్రకాశించుచున్నది.

**తా :** బిందువుపైన అర్ధచంద్రము, అర్ధచంద్రునివలె ఆకారమునను, కాంతిచేతను, అర్ధచంద్రుడను పేరును, సార్థకమై ఊర్ధ్వాగ్రముకలదై మనమున భావింపవలయును. అర్ధచంద్రముపైన రోధిని అనుదానిని ఊర్ధ్వాగ్రకోణముగల త్రికోణరూపమున వెన్నెల వంటి కాంతితో ప్రకాశించుచుండును.

**అవ :** ఇక నాదనాదాంతములయొక్క స్వరూపమును చెప్పుచున్నాడు.

శ్లో॥ నాదస్తు పద్మరాగవదణ్డద్వయమధ్యవర్తినీవ సిరా ।
నాదాంతస్తటిదాభస్సవ్యస్థితబిందుయుక్తలాంగలవత్ ॥ 24

నాదస్తు = నాదమైతే, పద్మరాగవత్ = పద్మరాగముతో సమానమైన కాన్తిగలదై, అండద్వయ మధ్యవర్తినీ = రెండు అండముల మధ్యనున్న,సిరా ఇవ = నాడివలె, ఆభాతి = ప్రకాశించు చున్నది. నాదాంతః = నాదాంతము, తటిదాభః = మెరుపుతో సమానమైన కాంతిగలదై, సవ్యస్థిత బిందుయుక్త లాంగలవత్ = ఎడమవైపున నున్న బిందువుతో కూడిన నాగలివలె, భాతి = ప్రకాశించుచున్నది.

**తా :** నాదము పద్మరాగమణివలె ఎఱ్ఱనికాంతి గలది రెండు అండముల మధ్యనున్న నాడి వలె నుండును. అనగా అండములవలే అండముగా నున్న రెండు బిందువుల మధ్యనాడివలె యొక ఊర్ధ్వరేఖయు కలిగి నాదము యొక్క ఆకారముండును.

నాదాంతము మెరుపువంటి కాంతి గలది. ఎడమ వైపునున్న బిందువుతో కూడిన నాగలివలె ప్రకాశించును. ఊర్ధ్వమున నాగలి కఱ్ఱ కుడివైపున నాగటిదుంప, ఎడమవైపు బిందువును కలిగి నాదాంతము యొక్క రూపమగును.

| बिन्दु | अर्द्धचन्द्र | रोधिनी | नाद | नादान्त | शक्ति | व्यापिका | समना | उन्मना |
|---|---|---|---|---|---|---|---|---|

**అవ :** ఇక శక్తి వ్యాపకముల స్వరూపమును చెప్పుచున్నాడు.

శ్లో॥ తిర్యగ్బిన్దుద్వితయే వామోద్గచ్ఛత్సిరాకృతిశ్శక్తిః ।
బిందూర్ధ్వగచ్ఛత్త్ర్యశ్రాకారధరా వ్యాపికా ప్రోక్తా ॥ 25

తిర్యగ్బిందుద్వితయే = అడ్డముగా నున్న రెండు బిందువులలో, వామోద్గచ్ఛత్సిరాకృతిః = ఎడమబిందువు మధ్యనుండి పైకి వ్యాపించిన నాడితో సమానమైన ఆకారముగలది, శక్తిః = శక్తి, బిందూర్ధ్వగచ్ఛత్త్ర్యశ్రాకారధరా = పైనున్న బిందువుతో కూడిన త్రికోణము, వ్యాపికా = వ్యాపికయని, ప్రోక్తా = చెప్పబడినది.

**తా :** అడ్డముగా నున్న రెండు బిందువులలో ఎడమబిందువుయొక్క మధ్యనుండి పైకి వ్యాపించిన రేఖ గలది శక్తి అనగా అడ్డముగా రెండు బిందువులందు ఎడమ బిందువుయొక్క మధ్యనుండి

పైకి వ్యాపించిన రేఖ గలది శక్తి. అనగా అడ్డముగా రెండు బిందువులు, అందు నెడమ బిందువు నుండి పైకి రేఖయు శక్తియొక్క ఆకారము త్రికోణముపైనున్న అగ్రకోణమున బిందువు కలసియున్న రూపము వ్యాపిక.

**అవ :** ఇక సమనోన్మల యొక్క స్వరూపము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఊర్ధ్వాధోబిందుద్వయసంయుతరేఖాకృతిస్సమనా ।**
**సైవోర్ధ్వబిందుహీనోన్మనా తదూర్ధ్వం మహాబిందుః ॥ 26**

ఊర్ధ్వాధోబిందుద్వయసంయుతరేఖాకృతిః = పైన, క్రింద గల రెండు బిందువులతో కూడిన రేఖాకారముగలది. సమనా = సమన, సైవ = ఆ సమనయే, ఊర్ధ్వబిందుహీనా = పైన బిందువు లేనిది, ఉన్మనా = ఉన్మన, తదూర్ధ్వమ్ = ఆ ఉన్మనకుపైన, మహాబిందుః = మహాబిందువు.

**తా :** ఒక ఊర్ధ్వరేఖ యొక్క అధోభాగమునను, ఊర్ధ్వభాగమునను బిందువుల కలసి యున్నచో సమన యొక్క యాకారమేర్పడును. అనగా క్రిందనొక బిందువు. మధ్యనొక రేఖ, పైన బిందువు కలసి యున్నచో సమన యొక్క ఆకారమగును. ఈ సమన బ్రహ్మరంధ్రముతో సమానమైన స్థానము గలది. ఇంతవరకు మనస్సు రూపము గ్రహించుచు వృత్తితో గూడి సుగమముగా ఈ స్థానము చేరినది. మనోవృత్తితో కూడుటచే దీనికి **సమన**యను పేరు సార్థకమైనది.

ఆ సమనయే పైన బిందువులేక క్రింద బిందువు నుండి ఊర్ధ్వరేఖయునున్న **ఉన్మన యగును**. ఉన్మన, రూపాంతరమును పొందిన మనస్సుయొక్క గతియని ఆ పేరే సూచించు చున్నది.

ఆ ఉన్మనకు పైన మహాబిందువు సహస్రదళకమలముయొక్క స్థానమున నున్నది. సహస్రదళకమలము యొక్క నాళమే **ఉన్మన** యని రహస్యము.

**అవ :** బిందువు మొదలు నాదాంతమువరకు నున్న వానియొక్క రూపము చెప్పబడినది. ఇప్పుడు శక్తి మున్నగు వాని రూపము చెప్పుచున్నాడు.

**శ్లో॥ శక్త్యాదీనాం తు వపుర్ద్వాదశరవికాంతిపుంజాభమ్ ।**
**ఇత్యేవం వర్ణానాం స్థానం జ్ఞాత్వోచ్చరేద్యత్నాత్ ॥ 27**

శక్త్యాదీనామ్ = శక్తి వ్యాపిక సమనలయొక్క, వపుః తు = శరీరమైతే, ద్వాదశ రవికాంతి పుంజాభమ్ = పండ్రెండు సూర్యుల కాంతితో సమానమైనది. ఇత్యేవమ్ = ఈ విధముగా,

వర్ణానామ్ = కకారాది సమనాంత వర్ణముల యొక్క, స్థానమ్ = స్థానమును, జ్ఞాత్వా = తెలిసికొని, యత్నాత్ = ప్రయత్నపూర్వకముగా, ఉచ్చరేత్ = ఉచ్చరింపవలయును.

**తా :** శక్తి, వ్యాపిక, సమనల యొక్క రూపము. పంద్రెండు సూర్యుల కాంతితో సమానమైనది. ఉన్మనకు రూపమే లేదు. ఈ విధముగా కకారము మొదలుకొని ఉన్మన వరకు గల అక్షరముల యొక్క స్థానములను మూలాధారము మొదలు బ్రహ్మరంధ్రము వరకు గల ఆ యా స్థానములను వర్ణములయొక్క ఉత్పత్తి స్థానములగు కంఠాది స్థానములను తెలిసి కొనవలయును. బాహ్యాభ్యంతరపూర్వకముగా ఉచ్చరింపవలయును. ఈ ఉచ్చారణము వాచిక జప విషయముననే యని ఎరుంగునది. మానసిక జపమునకు ఈ నియమము లేదు.

**అవ :** మూడవ కూటము నందలి బింద్వాది నవకమునకు మాత్రమే స్థానము, ఆకారము, రూపములు చెప్పబడినవి. ప్రథమ, ద్వితీయ కూటము లందలి బింద్వాది నవకము యొక్క స్థితి ఏమి అను శంకను పరిహరించుచున్నాడు.

**శ్లో॥ నాదః ప్రాథమికస్తు ద్వితీయకూటేన సాకముచ్చార్యః ।**
**ద్వైతీయాకం నాదం తార్తీయేనోచ్చరేన్న పృథక్ ॥ 28**

ప్రాథమికః = మొదటి కూట సంబంధమైన, నాదః తు = నాదమైతే, ద్వితీయ కూటేన సాకమ్ = రెండవకూటముతో కూడా, ఉచ్చార్యః = ఉచ్చరింపదగినది. ద్వైతీయాకమ్ = రెండవకూట సంబంధమైన, నాదమ్ = నాదమును, తార్తీయేన = తృతీయకూటముతో, ఉచ్చరేత్ = ఉచ్చరింపవలయును, పృథక్ = వేరుగా, న = లేదు.

**తా :** ప్రథమ కూట నాదము ద్వితీయ కూటముతో కలపి ఉచ్చరింపవలయును గాని ప్రథమ ద్వితీయ కూటముల సంబంధమైన నాదముయొక్క ఉచ్చారణకు వేరు కాలము, స్థానము అవసరము లేదు.

**అవ :** ప్రథమ ద్వితీయ కూట నాదములకు కాల స్థానములు లేకున్నను, రూపాకారము లుండుటవలన, వానినెట్లు భావింపవలయును, అను సందేహమునకు సమాధానము నిచ్చుచున్నాడు.

**శ్లో॥ బింద్వాదినవకయోస్తు ప్రాక్తనకూటద్వయస్థయోరనయోః ।**
**సమ్మేలనేన శబలం తార్తీయాకం విభావయేత్కూటమ్ ॥ 29**

ప్రాక్తనకూటద్వయస్థయోః = ప్రథమ ద్వితీయ కూటముల యందున్న, అనయోః బింద్వాది నవకయోః తు = ఈ బింద్వాదినవకములయొక్క, సమ్మేలనేన = కలయికచేత, తార్తీయాకమ్

= మూడవదియైన, కూటమ్ = కూటమును, శబలమ్ = చిత్రవర్ణముగల దానినిగ, విభావయేత్ = భావింపవలయును.

**తా :** ప్రథమ ద్వితీయ కూటముల యందున్న బిన్ద్వాది నవకములు, తృతీయ కూటబిన్ద్వాది నవకముతో సమానమైన రూపాకారములు గలవి, ఈ రూపాకారములతో కలసిన మూడవ కూటము యొక్క బిన్ద్వాది నవకమును శబల వర్ణము కలదిగా భావింపవలయును. అనేక రూపములతో కలిసినప్పుడు శబల వర్ణమందురు. అనగా చిత్రం వర్ణమని భావము. మూడవ కూట సంబంధినియైన బిన్ద్వాది నవకము యొక్క రూపాకారములతోడనే ప్రథమ ద్వితీయ కూటనాదముల యొక్క రూపాకారస్థితియు కలదని తాత్పర్యము.

**అవ :** ఉచ్చారణ స్వరూపమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ బిన్ద్వాదికసమనాంతం క్రమేణ తార్తీయముచ్చరేన్నాదమ్ ।**
**ఉన్మన్యంతర్లీనం విభావయేదేతదుచ్చరణమ్ ॥** **30**

తార్తీయమ్ = తృతీయ కూటసంబంధమైన నాదమును, బిన్ద్వాదిక సమనాంతమ్ = బిందువుమొదలు సమన వరకు, క్రమేణ = క్రమముగా, ఉచ్చరేత్ = ఉచ్చరింప వలసినది. ఏతదుచ్చరణమ్ = ఈ ఉచ్చారణమును, ఉన్మన్యన్తర్లీనమ్ = ఉన్మనీలో కలసిన దానినిగా, విభావయేత్ = భావింపవలయును.

**తా :** తృతీయ కూటసంబంధమైన బిన్ద్వాది సమనాంతమైన నాదమును క్రమముగా, ఉచ్చరింపవలయును. ఈ ఉచ్చారణను ఉన్మనిలో లీనమైనట్లు భావింపవలయును.

**అవ :** ఈ ప్రకారము ప్రథమ ద్వితీయ కూటముల యొక్క నాదములకు వేరుగా ఉచ్చారణ కాలము, రూపము, ఆకారము లేని యెడల, "**సంహత్యైకత్రింశన్మాత్రా మంత్రే లవత్రయన్యూనాః**" అని పూర్వము చెప్పిన కాల పరిమాణమునకు భంగము కలిగినదని సందేహించి, పూర్వము చెప్పినది స్వరూపనిరూపణవరకు మాత్రమే ఉపయోగించుననియు, జపమున ప్రథమ ద్వితీయ కూటనాదోచ్చారణ కాలము లోపించుననియు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఆద్యే దశ మధ్యే తాస్సార్ధాస్తృతీయకూటేఽష్టౌ ।**
**ఏకలవోనా ఊనత్రింశన్మాత్రా మనోర్జపే కాలః ॥** **31**

ఆద్యే = ప్రథమకూటమునందు, దశ = పది (మాత్రలు), మధ్యే = ద్వితీయ కూటమునందు, తాః = మాత్రలు, సార్ధాః = సగముతో కూడినట్లు, అనగా పదిన్నర మాత్రలు, తృతీయ కూటే = మూడవ కూటమునందు, అష్టౌ సార్ధాః = ఎనిమిదిన్నర మాత్రలు, మనోః = మంత్రము

యొక్క, జపే = జపమునందు, కాలః = సమయము, ఏకలవోనా ఊనత్రింశన్మాత్రాః (ఏకలవ+ ఊనా ఊనత్రింశాన్మాత్రాః) = అని విభాగము. ఒక లవ తక్కువగా నిరువది తొమ్మిది మాత్రలు.

**తా :** ప్రథమ కూటోచ్చారణకు పదిమాత్రల కాలము, మధ్యకూటోచ్చారణకు పదిన్నర మాత్రల కాలము, తృతీయ కూటోచ్చారణకు ఎనిమిదిన్నర మాత్రల కాలము కలసి మొత్తము, ఒక లవము తక్కువగా నిరువది తొమ్మిది మాత్రల కాలము. పంచదశాక్షరీ మంత్రముయొక్క వాచిక జపమునకగును. మానస జపమున నియమములేక పోవుట వలన ఈ విషయము అన్వయింపదు. కాగా మూడు లవములు తక్కువగా ముప్పది యొక్క మాత్రల కాలమని పూర్వము చెప్పినదానిలో రెండు లవములు తక్కువగల రెండు మాత్రల కాలముగల ప్రథమ ద్వితీయ కూటముల నాదమున తీసివేసిన ఒక లవము తక్కువగా నిరువది తొమ్మిది మాత్రల కాలము సంభవించునని భావము.

**అవ :** ఇక వ్యష్టి సమష్టి భేదముచే నాలుగుగా విభక్తమైన మంత్రము యొక్క భావనారీతిని చెప్పుచున్నాడు.

**శ్లో॥ వ్యష్టిసమష్టివిభేదాదస్యాం చత్వారి బీజాని ।**
**సృష్టిస్థితిసంహారానాఖ్యారూపాణి భావనీయాని ॥** 32

వ్యష్టి సమష్టి విభేదాత్ = వ్యష్టి సమష్టిభేదము వలన, అస్యామ్ = ఈ పంచదశీ విద్యయందు, చత్వారి = నాలుగు, బీజాని = బీజములు, సంతి = ఉన్నవి. సృష్టి-స్థితి-సంహరానాఖ్యా-రూపాణి = సృష్టి, స్థితి, సంహారము, అనాఖ్యా రూపములుగా, భావనీయాని = భావింపదగినది.

**తా :** మంత్రము మూడు కూటములుగనున్నది. ప్రత్యేకముగా మంత్రమంతయు మూడు భాగములు గనుక వ్యష్టిగా మూడు బీజములు, మంత్రమంతయు నొక్కటిగా భావించుట సమష్టి యనబడును. సమష్టి యొక బీజము కాగా మంత్రమున వ్యష్టి, సమష్టి భేదముచే నాలుగు బీజములున్నవి. ఈ నాలుగు బీజములను, సృష్టి, స్థితి, సంహార, అనాఖ్యా రూపములుగా భావన చేయవలయును. ఎట్లన = ప్రథమ కూటము సృష్టి రూపము, ద్వితీయ కూటము స్థితిరూపము, తృతీయ కూటము సంహార రూపము, సమష్టి కూటము అనాఖ్యారూపము, ఇట్లు నాలుగు బీజములు నాలుగు రూపములుగ భావింపవలయును. ఈ భావనచే పరదేవత యొక్క పంచకృత్యములు భావింప బడినట్లైనవి.

**అనాఖ్య**యనగా **తురీయ**, **తురీయాతీతము**లని యర్థము. ఈ రెండు దశలును కలిసి సృష్టి, స్థితి, సంహార, తురీయ, తురీయాతీతములనే దశలు. పంచ = ఐదు. ఈ కృత్యములకు అధిపతులు ఐదుగురు. బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులు. "**పంచకృత్యపరాయణా**",

"**పంచబ్రహ్మస్వరూపిణీ**" నామములచే పరదేవత ఏతద్రూపమున చెప్పబడినది. అనాఖ్య అని తురీయ తురీయాతీత అవస్థలను ఏక రూపమున చెప్పుట యెందుకనగా అవి రెండును విద్యారూపములు. సిద్ధుని దశలు అగుటచేనట్లు చెప్పబడినవి. తిరోధాన, అనుగ్రహములు క్రమముగ ఈశ్వర, సదాశివుల కృత్యములు.

**అవ :** లోకమున గల నాలుగు నాలుగు భాగములుగ నున్న వస్తు విశేషములను వ్యష్టి, సమష్టి భేదముచే మంత్రమున భావింపవలసినదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ పుటధామతత్త్వపీఠాన్వయలింగకమాతృతత్సమష్టీనామ్ ।**
**రూపాంతరాణి బీజాన్యమూని చత్వారి చింతనీయాని ॥** **33**

అమూని చత్వారి బీజాని = ఈ నాలుగు బీజములును, పుట, ధామ, తత్త్వ, పీఠ, అన్వయ, లింగక మాతృ, తత్సమష్టీనామ్ = మూడు విధములుగ నున్న, పుటములు, ధామములు, తత్త్వములు, పీఠములు, అన్వయములు, లింగములు, మాతలు (మాతృదేవతలు) అనువాని వ్యష్టి రూపములయొక్కయు, సమష్టి రూపముల యొక్కయు, రూపాంతరాణి = మఱియొక రూపములుగా, చింతనీయాని = భావింపదగినవి.

**తా :** మంత్రము యొక్క వ్యష్టి, సమష్టి రూపములుగా నున్న నాలుగు బీజములే మూడు మూడు విధములుగ నున్న పుటములు, ధామములు, మొదలగువాని వ్యష్టి, రూపముల యొక్కయు, సమష్టి రూపములయొక్కయు, నాలుగు భేదముల యొక్క రూపాంతరములుగా భావింపవలయును. ఎట్లనగా పుటములు, **జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయములు** మూడు, దాని సామరస్యము నాలుగవది. మంత్రముయొక్క నాలుగు బీజములను ఈ నాల్గింటి యొక్క రూపాంతరములుగా భావింపవలయునని భావము.

1. పుట – త్రిపుటులు

2. ధామములు ఐదు విధములుగా నున్నవి.

1. చక్రములు, 2. నాథలు, 3. దశలు, 4. శక్తులు, 5. ఆత్మలుగ. ఐదు విధములు–

1. అందు చక్రములు = అగ్నిచక్రము, సూర్యచక్రము, సోమచక్రము, బ్రహ్మచక్రములు.

2. నాథలు = మిత్రేశనాథ, షష్టీశనాథ, ఉడ్డీశనాథ, చర్యానందనాథలు.

3. దశలు = జాగ్రత్స్వప్నసుషుప్తులు, తురీయమున్ను.

4. శక్తులు మఱియు (తిరిగి) మూడు విధములుగ నున్నవి.

– వామ, జ్యేష్ఠ, రౌద్రి, అంబికలు ఒక విధము.

– ఇచ్ఛ, జ్ఞాన, క్రియ, శాంతలు రెండవ విధము.

– కామేశ్వరీ, వజ్రేశ్వరీ, భగమాలినీ, మహాత్రిపురసుందరీ అనునవి మూడు విధములు.

5. ఆత్మలు = ఆత్మ, అంతరాత్మ, పరమాత్మ, జ్ఞానాత్మ అనునవి. ఈ విధము ధామ – ఐదు విధములైనవి – ఒక్కొక్క విధమున గల నాల్గింటిని వ్యష్టి, సమష్ట్యాత్మకమైన మంత్రము యొక్క నాలుగు బీజములయొక్క రూపాంతరములుగ భావింపవలయును.

3. తత్త్వములు : అత్మతత్వ(ము), విద్యాతత్వ(ము), శివతత్వ(ము), సర్వతత్త్వములు నాలుగు.

4. పీఠములు – కామరూప, పూర్ణగిరి, జాలంధర, ఓడ్యాణ పీఠములు **నాలుగు**.

5. అన్వయములు : అనగా ఆమ్నాయములనియు వీనికి పేరు. పూర్వ, దక్షిణ, పశ్చిమ, ఉత్తరామ్నాయములు **నాలుగు**.

6. లింగములు : స్వయంభు, బాణ, తారక, పరారూపములు.

7. మాతలు (మాతృకలు) – పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరులు.

ఇట్లు (ప్రత్యేకముగా నాలుగు విధములైన) పుట మున్నగు వానియొక్క భావన మంత్రము యొక్క వ్యష్టి, సమష్టి భేదమున నున్న నాలుగు బీజముల యందును చేయవలయునని, ఇది యొక మహోపదేశము.

**అవ :** ఇక ప్రత్యేకమైన అక్షరముల స్వరూపమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఏకైకస్మిన్ కర్మణి సృష్ట్యాదివిభేదతస్త్రివిధే ।**
**బ్రహ్మాద్యా అధిపతయో భారత్యాదిస్వశక్తిభిస్సహితాః ॥ 34**

సృష్ట్యాది–విభేదతః = సృష్టి, స్థితి, సంహారము, అను భేదమువలన, త్రివిధే = మూడు విధములైన, ఏకైకస్మిన్ = ఒక్కొక్క, కర్మణి = సృష్టి, స్థితి, సంహార రూపమైన కర్మలయందు, భారత్యాది స్వశక్తిభిః = భారతీ, పృథివీ, రుద్రాణి అనెడి తమ శక్తులతో, సహితాః = కూడిన, బ్రహ్మాద్యాః = బ్రహ్మ, విష్ణు, రుద్రులు, అధిపతయః = అధికారులు, భవంతి = అగుచున్నారు.

**తా :** మంత్రముయొక్క మూడు కూటములు క్రమముగా సృష్టి, స్థితి, సంహారరూపములు. ఈ మూడును సృష్టి, స్థితి, సంహారములచే ఒక్కొక్కటి మూడు విధములై యున్నది. అనగా

సృష్టి–సృష్టి, సృష్టి–స్థితి, సృష్టి–సంహారము, అని యిట్లే స్థితికర్మయు సృష్ట్యాది భేదముచే 3 విధములు.

స్థితి–సృష్టి, స్థితి–స్థితి, స్థితి–సంహారము, అని ఈ విధమున సంహారకర్మయు సంహార–సృష్టి, సంహార–స్థితి, సంహార–సంహారములని మూడు విధములు.

ఈ సృష్టి, స్థితి, సంహార కర్మలలో **సృష్టి సృష్టి** కర్మయే **భారతీశక్తి**తో కూడిన బ్రహ్మ; స్థితి కర్మకు పృథివీ శక్తితో కూడిన విష్ణువు; సంహారకర్మకు రుద్రాణి శక్తితో కూడిన రుద్రుడు అధికారులు.

శక్తిశూన్యులగు వారికి ఆ యా కర్మలయందు సామర్థ్యము లేనందున శక్తిసహితులగు వానిగనే భావింపవలయును. కాగా, ఒక్కొక్క కర్మయందు ఆర్గురార్గురు ఉన్నారు.

**అవ :** మంత్రమున వారియొక్క భావనావిధానమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ బ్రహ్మాదయస్త్రయోఽమీ భారత్యాద్యాశ్చ శక్తయస్తిస్రః ।**
**ప్రత్యక్షరస్వరూపాశ్శాక్తార్థే వక్ష్యమాణయా రీత్యా ॥** 35

బ్రహ్మాదయః = బ్రహ్మ మొదలగు, అమీ త్రయః = ఈ ముగ్గురును, భారత్యాద్యాః = భారతీ మొదలగు, తిస్రః = ముగ్గురైన, శక్తయః చ = శక్తులున్నూ, శాక్తార్థే = ద్వితీయాంశమున చెప్పబడు శాక్తార్థమునందు, వక్ష్యమాణయా రీత్యా = చెప్పబోవు పద్ధతిలో, ప్రత్యక్షర స్వరూపాః = ప్రతి అక్షరము యొక్క స్వరూపములు.

**తా :** ప్రథమ కూటమున, కకారము బ్రహ్మ; ఏకారము భారతి; ఈకారము విష్ణువు, లకారము పృథివీ; హ్రీంకారము నందున్న హకారము రుద్రుడు, రేఫ రుద్రాణి (పార్వతి).

ద్వితీయ కూటమున శాక్తార్థమున చెప్పబోవు ప్రకారము, రెండవ హకారమును విడచి భావన సమన్వయించు కొనవలయును. హకారము బ్రహ్మ సకారము భారతి; కకారము విష్ణువు, లకారము పృథివీ; హృల్లేఖ యందలి హకారము రుద్రుడు, రేఫ రుద్రాణి. తృతీయ కూటమున ద్వితీయ కూటమున విడచిన రెండవ హకారము ముందు చేర్చుకొని భావన సమన్వయించుకొనవలయును.

ఎట్లనగా – హకారము బ్రహ్మ, సకారము భారతి, కకారము విష్ణువు, లకారము పృథివీ, హృల్లేఖ యందలి హకారము రుద్రుడు, రేఫ రుద్రాణి రూపములుగా భావింపవలయును.

మూడు కూటములందును "హ్రీం" కారముయొక్క చివరనున్న **ఈ** కారము **శాంత, అంబిక** అనెడి సమష్టి మిథునముగా భావింపవలయును.

**అవ :** ఇక కూటత్రయమునందును చివరనున్న బింద్వాది నవకము యొక్క భావనా ప్రకారము చెప్పుచున్నాడు.

**శ్లో॥ హృల్లేఖాకామకలాసపరార్ధకలాఖ్యకుణ్డలిన్యుత్థాః ।**
**నాదాశ్చక్రత్రితయత్రితయాత్మనో విభావనీయాస్స్యుః ॥ 36**

హృల్లేఖా = హృల్లేఖ యందలి, కామకలా = ఈ కారము నందున్న, సపరార్ధ కలాఖ్య = సపరార్ధ కలయను పేరుగల, కుండలిన్యుత్థాః = కుండలినుల యందు పుట్టిన, నాదాః = నాదములు, చక్రత్రితయ త్రితయాత్మనః = శ్రీచక్రమునందున్న తొమ్మిది చక్రములలో ఒక్కొక్క నాదమును, మూడు మూడు, చక్ర స్వరూపములుగా, విభావనీయాః = భావింపదగినవి, స్యుః = అగును.

**తా :** మూడు కూటములయందు గల సమష్టిమిథునస్వరూపమైన **ఈ** కారమునందు గురుముఖైకవేద్యమైన (గురుముఖమున తెలుసు కొనదగిన) సపరార్ధకలగలదు. ఆ కల ప్రథమ కూటమున **వహ్నికుండలి**యని, ద్వితీయకూటమున **సూర్యకుండలి**యని, అదియే తృతీయ-కూటమున **చంద్రకుండలి**యని చెప్పబడుచున్నది. ఈ కుండలినుల యందు పుట్టిన నాదములు అనగా బింద్వాది నవకత్రయ స్వరూపములైన వానిని శ్రీచక్రమునందున్న తొమ్మిది చక్రములలో ఒక్కొక్క నాదమును మూడు మూడు చక్రముల యందు భావింపవలయును.

ఎట్లన ప్రథమకూటనాదము **భూపుర, షోడశదళ, అష్టదళ** రూపమైనది. ఈ చక్రము త్రివిధసృష్టి స్వరూపము.

ద్వితీయకూటనాదము **చతుర్దశార, బహిర్దశార, అంతర్దశార** స్వరూపమైనది. ఇది త్రివిధ స్థితి స్వరూపము.

తృతీయకూటనాదము **అష్టకోణ, త్రికోణ, బిందు** స్వరూపము. ఇది త్రివిధ సంహారస్వరూపము అని ఈ విధముగా భావింపవలయునని తాత్పర్యము.

**అవ :** ఇక అవస్థాపంచకముయొక్క భావనను చెప్పదలచి ముందు జాగ్రదవస్థా భావనా రీతిని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఇంద్రియదశకవ్యవహృతిరూపా యా జాగరావస్థా ।**
**తత్ర ప్రకాశరూపో హేతుర్భావ్యస్తృతీయగే రేఫే ॥ 37**

ఇంద్రియ-దశక-వ్యవహృతి-రూపా = జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల యొక్క ప్రపంచ పరిణామాత్మక వ్యవహారరూపమైన, యా = ఏ, జాగరావస్థా = జాగ్రదవస్థ, అస్తి = కలదో, తత్ర = ఆ జాగ్రదవస్థయందు, ప్రకాశరూపః = ప్రకాశస్వరూపమైన, హేతుః = కారణభూతమైన సాక్షి, ప్రకాశము, తృతీయగే = మూడవ కూటమునందున్న, రేఫే = రేఫయందు, భావ్యః = భావింపదగినది.

**తా :** జ్ఞాన-కర్మేంద్రియములనెడి పది యింద్రియములచే నా యా విషయరూపమున పరిణమించిన ప్రపంచము ననుసంధించుట జాగ్రదవస్థ. ఆ జాగ్రదవస్థను ప్రకాశింపజేయు సాక్షి చైతన్యము, తృతీయకూటముననున్న హ్రీంకారము నందలి రేఫాక్షరమునందు, ఆ అక్షరస్థానము నందును భావింపవలయును.

**అవ :** ఇక స్వప్నావస్థా భావనారీతిని చెప్పుచున్నాడు.

**శ్లో॥ అంతఃకరణచతుష్కవ్యవహారస్స్వాప్నికావస్థా ।**
**సా తార్తీయేకారాద్బోధ్యాపి గలస్థలే చింత్యా ॥** **38**

అంతఃకరణచతుష్కవ్యవహారః = మనోబుద్ధి, చిత్తాహంకారములనెడి భేదముగల, అంతఃకరణముయొక్క వ్యవహారము, స్వాప్నికావస్థా = స్వప్నదశ, సా = ఆ స్వప్నదశ; తార్తీయేకారాత్ = తృతీయ కూటమునందలి హ్రీంకారమునందున్న ఈకారము వలన, బోధ్యా అపి = బోధింపదగినదైనను, గలస్థలే = కంఠప్రదేశముననున్న లకారమునందు, చింత్యా = భావింపదగినది.

**తా :** జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, తమతమ పనులను మానియుండ మనోబుద్ధి, చిత్తాహంకారములనెడి నాలుగు భేదములుగల, అంతఃకరణము యొక్క ప్రపంచ రూపమున పరిణమించిన వ్యవహారమే, **స్వప్నావస్థ** యనబడును. ఆ అవస్థా సాక్షి తృతీయ కూటమున నున్న హ్రీంకారము యొక్క ఈ కారమువలన బోధింపదగినదైనను, కంఠస్థానమున నున్న ద్వితీయకూట లకారమున, లకారస్థానమున భావింపవలసినది.

**అవ :** ఇక సుషుప్త్యవస్థా భావనా ప్రకారము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఆంతరవృత్తేర్లయతో లీనప్రాయస్య జీవస్య ।**
**వేదనమేవ సుషుప్తిశ్చింత్యా తార్తీయబిందౌ సా ॥** **39**

ఆన్తరవృత్తేః = మనోబుద్ధి చిత్తాహంకార రూపమైన అంతఃకరణవృత్తియొక్క, లయతః = ఉపరమము వలన (పనిలేకుండుట వలన), లీన ప్రాయస్య = మృతునివలెనున్న, జీవస్య = అంతఃకరణమున ప్రతిబింబించిన జీవాత్మయొక్క, వేదనమేవ = తెలిసికొనుటయే, అనగా, సుఖ, అజ్ఞానములను, అనుసంధించుటయే, సుషుప్తిః = సుషుప్త్యవస్థ, నిద్రావస్థ, లక్షణావృత్తిచే సుప్త్యవస్థా సాక్షియని అర్థము. సా = సుషుప్త్యవస్థా, సాక్షి, తార్తీయబిందౌ = తృతీయ కూటాంతముననున్న బిందువున, బిందుస్థానమగు ఫాలప్రదేశమున, చింత్యా = భావింపదగినది.

**అవ :** ఇక తురీయావస్థా భావనాప్రకారమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ తుర్యావస్థా చిదభివ్యంజకనాదస్య వేదనం ప్రోక్తమ్ ।**
**తద్భావనార్ధచంద్రాదికం త్రయం వ్యాప్య కర్తవ్యా ॥ 40**

చిదభివ్యంజకనాదస్య = ఆత్మసాక్షాత్కారము కలిగించునట్టి నాదముయొక్క, వేదనమ్ = అనుసంధానము, తుర్యావస్థా = నాలుగవది యైన తురీయావస్థయని, ప్రోక్తమ్ = చెప్పబడినది. తద్భావనా = అట్టి తురీయావస్థయొక్క భావన అనగా లక్షణావృత్తిచే తురీయావస్థా సాక్షి భావన అనియు అర్థము, అర్ధచంద్రాదికమ్ = అర్ధచంద్రరోధినినాదాత్మకమైన, త్రయమ్ = స్థాన త్రయమును, వ్యాప్య = వ్యాపించి, కర్తవ్యా = చేయదగినది.

**తా :** అర్ధచంద్ర, రోధినీ, నాదముల యందు ఆ స్థానముల యందును, తురీయావస్థా సాక్షిని భావింప వలయునని భావము.

**అవ :** ఇక తుర్యాతీతావస్థా భావనా ప్రకారమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఆనందైకఘనత్వం యద్వాచామపి న గోచరం నృణామ్ ।**
**తుర్యాతీతావస్థా సా నాదాంతాదిపంచకే భావ్యా ॥ 41**

నృణామ్ = జీవులకు, వాచామపి = వాక్కునకు, మనస్సునకున్ను, న గోచరమ్ = తెలియని, యత్ = ఏ (ఎటువంటి), ఆనందైక ఘనత్వమ్ = ఆనందముయొక్క ఘనీభావము, అస్తి = కలదో అది, తుర్యాతీతావస్థా = తుర్యాతీతావస్థ అనగా అవస్థా సాక్షియైన ప్రకాశము, నాదాంతాది పంచకే = నాదాంతము మొదలు ఐదింటియందు, అనగా నాదాంత-శక్తి-వ్యాపిక-సమన-ఉన్మనల యందు, భావ్యా = భావింపదగినది.

**తా :** ఈ పైన చెప్పబడిన అవస్థా భావనల యందతటను, అవస్థా సాక్షిని భావింపవలయును. అవస్థ జడరూపమగుట వలన అది ప్రపంచరూపము. అది పురుషార్థము కాదు. అనగా పురుషుడు కోరదగినది కాదు. అనాత్మ యగుట వలన, అజ్ఞులకు తెలిసిన దగుట వలన జీవ స్వభావమైనది. జ్ఞానాభ్యాసము కంటే పూర్వమే (ముందే) సిద్ధమై యుండుట వలన నిత్యమూ జీవునిచే అనుభవింపబడుచునే యున్నది. దానిని భావింపవలయునని ప్రత్యేకముగా శాస్త్రము చెప్పవలసిన అవసరము లేదు. కాన ఈ అవస్థా భావనల యందంతటను, అవస్థా సాక్షి యైన ప్రకాశరూపమగు ఆత్మనే భావింపవలయును.

మంత్రముననున్న వర్ణములయందు బిందువు మొదలు నాదనవకమును గల ఆ యా అంశముల యందు చెప్పబడిన అవస్థా సాక్షి భావనను, మంత్రమున నున్న ఆ యా అంశముల యందును, వర్ణముల యందును, ఆ యంశములకు చెప్పబడిన దేహము నందున్న స్థానముల యందును భావింపవలయును.

**అవ :** ఈ విధముగ అవస్థాపంచకమును – నిరూపించి శూన్యషట్కభావనారీతిని నిరూపించు చున్నాడు.

**శ్లో॥ తార్తీయాకే రేఫస్థానే బిందౌ చ రోధిన్యామ్ ।**
**నాదాంతవ్యాపికయోశ్చంద్రకతుల్యాని పంచ శూన్యాని ॥ 42**

తార్తీయాకే = తృతీయకూట సంబంధమైన, రేఫస్థానే = రేఫస్థానమునందును, బిందౌ చ = బిందు స్థానము నందును, రోధిన్యామ్ = రోధినీ స్థానమునందును, నాదాంత వ్యాపికయోః = నాదాంతమునందును, వ్యాపికయందును, చంద్రక తుల్యాని = నెమలి పింఛము కొననున్న చంద్రాకారముతో సమానమైన, పంచ శూన్యాని = ఐదు సంఖ్యగల శూన్యములు, భావనీయాని = భావింపదగినవి.

**తా :** శూన్యషట్కమును నిరూపింపదలచి ఈ శ్లోకమున, ఐదు విధములైన శూన్యములను చెప్పెను. శూన్యమనగా బింద్వాకారముననున్న రేఫయని భావము. నెమలి పింఛమువలె నానావర్ణములుగల బింద్వాకారములైన శూన్యములను ఆ యా స్థానముల యందు భావింప వలయునని తాత్పర్యము. ఈ శూన్యషట్కము, హ్రీంకారగత రేఫము మొదలు మధ్యనుగల ఒక్కొక్క స్థానమును విడచి ఉన్మని వరకు చెప్పబడినది. మధ్యస్థానములను విడచుట, మండుకప్లుతి వలె నాదము యొక్క వేగమును సూచించును.

**శ్లో॥ ఉన్మన్యాం నీరూపం షష్ఠం చింత్యం మహాశూన్యమ్ ।**

ఉన్మన్యామ్ = ఉన్మనీస్థానము నందు, నీరూపమ్ = రూపములేని, షట్కమ్ = ఆరవది యైన, మహాశూన్యమ్ = మహాశూన్యము, చింత్యమ్ = భావింపదగినది.

**తా :** ఈ శ్లోకమున ఆరవదియగు శూన్యమును **మహాశూన్యము** అను సంజ్ఞతో చెప్పుచున్నాడు. దీనిని **ఉన్మనీస్థానము**న భావింప వలయును. ఉన్మనీ స్థానము మనఃస్థాయిని దాటిన దగుట వలన ఈ మహాశూన్యము రూపము లేనిదని చెప్పబడును. **శూన్యషట్క భావన పరమరహస్య** మైనదని మహోపదేశముగా గ్రహింప వలయును.

**అవ :** ఇక విషువత్సప్తక భావనా పద్ధతిని ప్రతిపాదింపదలచి ముందు ప్రాణ విషువ భావనను చెప్పుచున్నాడు.

**ప్రాణాత్మమానసానాం సంయోగః ప్రాణవిషువాఖ్యః ॥ 43**

ప్రాణాత్మమానసానామ్ = ప్రాణము, ఆత్మ, మనస్సు అను మూడిటియొక్క, సంయోగః = కలయిక, ప్రాణవిషువాఖ్యః= ప్రాణవిషువ మను పేరుగలది.

**తా :** మూలాధారమున నాదోత్పత్తి పర్యంతము ప్రాణాత్మ, మనస్సులకు ఐక్యమును భావించుట **ప్రాణవిషువ** మని చెప్పబడును.

లేక శ్రీవిద్యా ప్రథమాక్షరమగు కకారము, వాయుబీజము. దానిని మూలాధారమున తప్పక అనుసంధానము చేయవలయును. ఇచ్చట ప్రాణశబ్దముచేత కకారమును గ్రహింప వచ్చును. వాయు బీజమగు కకారమునకు, ఆత్మకు, మనస్సునకు, ఈ మూడింటికి మూలాధారమున నాదోత్పత్తి యగు వరకు ఐక్యమును భావించుట **ప్రాణవిషువ**మని పేరు.
**అవ :** ఇక **మంత్రవిషువ**మును చెప్పుచున్నాడు.

**శ్లో॥ ప్రాథమికకూటనాదే త్వనాహతాద్బ్రహ్మరంధ్రాంతే ।**
**వ్యష్టిసమష్టివిభేదాద్బీజచతుష్కస్య చ స్వస్య ॥ 44**

**శ్లో॥ ఐక్యేన నాదమయతావిభావనం మంత్రవిషువాఖ్యమ్ ।**

ప్రాథమిక కూటనాదే = ప్రాణవిషువముచే ఉత్పన్నమైన ప్రథమకూట నాదము నందు, వ్యష్టి, సమష్టివిభేదాత్ = వ్యష్టి, సమష్టి భేదమువలన, బీజచతుష్కస్య = మంత్రముయొక్క నాలుగు బీజములకు, అనాహతాద్బ్రహ్మరంధ్రాన్తే = అనాహతము మొదలు బ్రహ్మరంధ్రము వరకు నున్న నాదము నందు, స్వస్య = ఆత్మకున్నూ, ఐక్యేన నాదమయతావిభావనమ్ = అభేదముచే నాదాత్మకముగా భావించుట, మంత్రవిషువాఖ్యమ్ = మంత్ర విషువమను పేరుగలది, భవతి = అగుచున్నది.

**తా :** ప్రాణవిషువమున చెప్పిన ప్రకారము, మూలాధారమున పుట్టిన నాదమునందు, మంత్రము నందు వ్యష్టి, సమష్టి భేదముచే నున్న నాలుగు బీజములకు ఐక్యమును భావించుట, అనాహతము మొదలు బ్రహ్మరంధ్రము వరకు నున్న నాదము నందు ఆత్మకు అభేదము భావించుట **మంత్రవిషువ**మని చెప్పబడును.

**ఆధారోత్థితనాదస్యోచ్చారాద్బ్రహ్మరంధ్రాంతమ్ ॥ 45**

**శ్లో॥ షట్చక్రాణాం గ్రంథీన్ ద్వాదశ భిన్దన్ సుషుమ్ణయైవ పథా ।**
**నాడీనాదార్ణానాం సంయోగో నాడివిషువాఖ్యః ॥ 46**

షట్చక్రాణామ్ = ఆరు చక్రములయొక్క, ద్వాదశ = పండ్రెండైన, గ్రంథీన్ = గ్రంథులను, భిందన్ = భేదించుచు, సుషుమ్ణయా, పథా ఏవ = సుషుమ్నా మార్గముననే, బ్రహ్మరంధ్రాన్తమ్ = బ్రహ్మరంధ్రమువరకు, ఆధారోత్థితనాదస్య = మూలాధారమున పుట్టిన నాదము యొక్క, ఉచ్చారాత్ = ఉచ్చరించుటవలన, నాడీనాదార్ణానామ్ = సుషుమ్ణా నాడికి, నాదమునకు

మంత్రాక్షరములకు, సంయోగః = కలయికచే, భావన, నాడివిషువాఖ్యః = నాడి విషువ మను పేరుగలది, భవతి = అగుచున్నది.

**తా :** సుషుమ్ణ నాడిని ఆధారము చేసికొని, గుదస్థానమునకు రెండంగుళములు పైన, లింగస్థానమున, నాభిస్థానమున, హృదయమున, కంఠమునందు, భ్రూమధ్యమున క్రమముగా మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞ అను పేరుగల చక్రములున్నవి. సుషుమ్ణనాడి ఈ చక్రముల మధ్యమున మాలయందు దారమువలె ప్రకాశించు చుండును. అందు ప్రతి చక్రమునకు ఊర్ధ్వభాగమున నొక గ్రంథియు, అధోభాగమున నొక గ్రంథియు నుండును. ఇట్లు ఆరుచక్రములకు పండ్రెండు గ్రంథులు గలవు.

మూలాధారమున బయలుదేరిన నాదము బ్రహ్మరంధ్రము వరకు ప్రాణవిషువ భావనచే ఉచ్చరింపబడుట వలన సుషుమ్ణనాడికి, నాదమునకు మంత్రాక్షరములకు సంయోగమును భావించుట **నాడివిషువ** మనబడును.

**అవ :** ఇక ప్రశాంతవిషువమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ రేఫే కామకలార్ణే హార్దకలాయాఞ్చ బిన్ద్వాదౌ ।**
**నాదాంతావధి నాదస్సూక్ష్మతరో జాయతే తత్ర ॥ 47**

**శ్లో॥ శక్తేర్మధ్యే తల్లయచింతనముదితం ప్రశాంతవిషువాఖ్యమ్ ।**

రేఫే = రేఫయందు, కామకలార్ణే = ఈకారమునందు, హార్దకలాయామ్ = సపరార్థ కళయందు, బింద్వాదౌ = బిందువు మొదలు, నాదాన్తావధి = నాదాంతము వరకు, నాదః = నాదము, సూక్ష్మతరః = మిక్కిలి సూక్ష్మమైనదై, జాయతే = కలుగుచున్నది. తత్ర = అచ్చట, శక్తేః = శక్తియొక్క, మధ్యే = మధ్యయందు, తల్లయచింతనమ్ = రేఫ మొదలు క్రమముగా సూక్ష్మత్వమును బొందిన నాదము యొక్క లయమును భావించుట, ప్రశాంతవిషువాఖ్యమ్ = **ప్రశాంతవిషువ** మను పేరుగలదిగా, ఉదితమ్ = చెప్పబడినది.

**తా :** మూలాధారము నందు పుట్టిన నాదము మంత్రాక్షరములగు కకారము మొదలు తృతీయకూటము యొక్క హ్రీంకారమునందున్న హకారము వరకు ఒకే రూపమున క్రమముగా వృద్ధిబొంది హకారము నుండి రేఫయందు, రేఫనుండి ఈకారమునందు, ఈకారము నుండి హార్దకలయందు, హార్దకలనుండి బిందువునందు, బిందువు మొదలు నాదాంతము వరకు క్రమముగా సూక్ష్మతరమై వెలుగొందును. అనగా హ్రస్వత్వమును బొందును. తరువాత శక్తియందు ఆ నాదము లయమగును. సూక్ష్మతరమైన ఆ నాదముయొక్క లయమును శక్తియందు భావనచేయుట **ప్రశాంతవిషువ** మనబడును.

**అవ :** ఇక శక్తివిషువమును, కాలవిషువమును చెప్పుచున్నాడు.

**శక్త్యంతర్గతనాదం సమనాయాం భావయేల్లీనమ్ ॥ 48**

**శ్లో॥ సమనాగతమున్మన్యామేతే ద్వే శక్తికాలవిషువాఖ్యే ।**

శక్త్యన్తర్గతనాదమ్ = శక్తిలో లీనమైన నాదమును, సమనాయామ్ = సమనయందు, లీనమ్ = లీనమైన దానినిగా, భావయేత్ = భావింపవలయును, సమనాగతమ్ = సమనాస్థానము నుండి మఱల లేచిన నాదము, ఉన్మన్యామ్ = ఉన్మనియందు, లీనం భావయేత్, ఏతే ద్వే = ఈ రెండు, శక్తికాలవిషువాఖ్యే = శక్తివిషువము, కాలవిషువము అను పేర్లు గలవి.

**తా :** పై శ్లోకమున శక్తియందు నాదలయము చెప్పబడినది. బంతి భూమిని తాకి మఱల పైకి ఎగిరినట్లు శక్తిలో లీనమైన నాదము మరల సూక్ష్మతమముగా లేచి వ్యాపికను దాటి సమనయందు లీనమైనట్లు భావింపవలయును. ఇట్టి భావనకు శక్తివిషువమని పేరు.

సమనయందు బయలుదేరిన నాదము అత్యంతము సూక్ష్మతమమైన దగుట వలన దానికి అతిక్రమించు సామర్థ్యము లేదు.

కాన సమనయందు మఱల పుట్టిన నాదమును ఉన్మనియందు లీనమైనట్లు భావింపవలయును. **ఉన్మనీలయ**భావనకు **కాలవిషువ**మని పేరు.

**అవ :** ఇక తత్త్వ విషువమును చెప్పుచున్నాడు.

**శ్రీవిద్యాకూటావయవేషు కకారాదిషూన్మనాంతేషు ॥ 49**

**శ్లో॥ అకులాదికోన్మనాంతప్రదేశసంస్థేషు సకలేషు ।**
**అధ్యుష్ఠనిమేషోత్తరసప్తదశాధికశతత్రయం త్రుటిభిః ॥ 50**

**శ్లో॥ ఉచ్చరితే నాదే సతి తస్యాన్తే తత్త్వవేదనం భవతి ।**
**తదిదం చైతన్యాభివ్యక్తినిదానం తు తత్త్వవిషువాఖ్యమ్ ॥ 51**

అకులాదికోన్మనాన్తప్రదేశసంస్థేషు = అకుల పద్మ మనెడి అధఃసహస్రారము మొదలు ఉన్మన వరకు నున్న, సకలేషు = శ్రీవిద్యా మంత్రముయొక్క కూటములకు అవయవములైన, కకారాదిషు = కకారము మొదలుకొనిన, ఉన్మనాన్తేషు = ఉన్మనవరకు గల అక్షరముల యందు, అధ్యుష్ట–నిమేషోత్తర–సప్తదశాధిక–శతత్రయం త్రుటిభిః : అధ్యుష్టనిమేషోత్తర = మూడున్నర నిమిషములెక్కువ కలిగిన, సప్తదశాధిక శతత్రయం త్రుటిభిః = మూడు వందల పదునేడు త్రుటులచేత(317), నాదే = నాదము, ఉచ్చరితే సతి = ఉచ్చరింపబడగా, తస్య =

ఆ నాదము యొక్క, అంతే = అంతమునందు, తత్త్వవేదనమ్ = తత్త్వమును తెలియుట, భవతి = కలుగుచున్నది. తత్ = అటువంటి, చైతన్యాభివ్యక్తి-నిదానమ్ = ఆత్మసాక్షాత్కారమునకు కారణమైన, ఇదం తు = ఈ తత్త్వవేదనమైతే, తత్త్వవిషువాఖ్యమ్ = తత్త్వవిషువమను పేరు గలది, భవతి = అగుచున్నది.

**తా :** మూలాధారమునకు అధోభాగమున సర్వాధారమై అధఃసహస్రారమొకటి గలదు. దానికి అకుల పద్మమని పేరు - ఆ అకుల పద్మము మొదలు ఉన్మనీ ప్రదేశమువరకు నున్న శ్రీవిద్యావయవములైన కకారాది అక్షరములన్నిటి యందు, నాదముచ్చరింపబడగా, నాదాంతము నందు తత్త్వము తెలియబడును. అనగా జీవబ్రహ్మైక్యము యొక్క సాక్షాత్కారము కలుగును. ఈ నాదోచ్చారణ మూడున్నర నిమిషములు. మూడువందల పదునేడు త్రుటుల కాలమున కలుగును. నిమేషమనగా కంటి రెప్పపాటు కాలము. ఆ నిమేషము యొక్క (3000) మూడువేల భాగమునకు అటి అనగా త్రుటి యని పేరు. ఈ విధమున మూడున్నర నిమిషములు మూడువందల పదునేడు త్రుటులు కలిసి పదివేల ఎనిమిది వందల పదునేడు (10817) త్రుటులగును. ఈ విభాగమునకు ప్రమాణమైన వచనమిది.

**శ్లో॥ స్వస్థే నరే సమాసీనే యావత్ స్పందతి లోచనమ్ ।**
**తస్య త్రింశత్తమో భాగః తత్పరః పరికీర్తితః ।**
**తత్పరస్య శతాంశస్తు త్రుటిరిత్యభిధీయతే ॥** అని,

ఇట్లు ఆత్మసాక్షాత్కారమునకు, కారణమైన తత్త్వవేదనమునకు, తత్వవిషువమని పేరు.

**అవ : జపలక్షణము**ను చెప్పుచూ గ్రంథమును, ఉపసంహరించుచున్నాడు.

**శ్లో॥ ఏవమవస్థాశూన్యవిషువంతి చక్రాణి పంచ షట్సప్త ।**
**నవ చ మనోరర్థాంశ్చ స్మరతోఽర్ణోచ్చారణం తు జపః ॥ 52**

ఏవమ్ = ఈ విధముగా, అవస్థాపంచక = సృష్టి, స్థితి, సంహార, తిరోధాన, అనుగ్రహము లనెడు - ఐదు అవస్థలను, లేక, జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయ, తురీయాతీతములనెడి జీవ పర్యాయమైన ఐదు అవస్థలను, శూన్యషట్క = శూన్యషట్కమును, విషువంతి సప్త = విషువత్సప్తకమును, చక్రాణి నవ = తొమ్మిది చక్రములను, మనోః = మంత్రముయొక్క, అర్థాన్ చ = అర్థములున్ను, స్మరతః = స్మరించుచున్నవానియొక్క, అర్ణోచ్చారణమ్ = మంత్రాక్షరములయొక్క ఉచ్చారణ, జపః = జపము, భవతి = అగును.

**తా :** పైన చెప్పిన విధముగా, ఈశ్వర పర్యాయమైన సృష్టి, స్థితి, సంహార, తిరోధాన, అనుగ్రహము లనెడి, ఐదు అవస్థలను; జీవపర్యాయమైన జాగ్రత్స్వప్నసుషుప్తి, తురీయ, తురీయాతీతము లనెడి ఐదు అవస్థలను; శూన్యషట్కమును; శ్రీచక్రమున గల తొమ్మిది

చక్రములను; ద్వితీయాంశమున చెప్పబోవు మంత్రార్థములను స్మరించుచూ, మంత్రాక్షరముల నుచ్చరించుటను **జప** మనబడును.

ఈ మంత్రమున గల అక్షరములు ఏబది ఎనిమిది (58) లో ప్రథమ, ద్వితీయ, కూట సంబంధమైన రెండు బింద్వాది నవకములను విడచుట చే పదునెనిమిది అక్షరములు తగ్గును. కాగా, మిగిలిన నలుబది అక్షరముల ఉచ్చారణను జపమను పేరుచే చెప్పబడినది.

ప్రథమ, ద్వితీయ కూటముల బింద్వాది నవకముల ఉచ్చారణకు కాలము లేకపోవుట వలన, రెండు మూడు కూటముల యొక్క ఉచ్చారణచే బింద్వాది నవకముల ఉచ్చారణ సిద్ధించిన దని తెలియదగును.

చక్రభావన సకల, సకలనిష్కల, నిష్కల అను రూపములచే మూడు విధములుగా యోగినీ హృదయమున చక్రసంకేతమున చెప్పబడినది. దానిని కూడ చక్రభావనలో చేర్చుకొనవలసినదే. ఆ విధానము నా గ్రంథమునందే చూడవలయును

**శ్లో॥ భాస్కరరాయేణ గురోః కరుణావశతస్సమున్మిషితే ।**
**వరివస్యాతిరహస్యే పూర్వాంశః పూర్ణతామగమత్ (పూర్ణతామాపత) ॥53**

గురోః = గురువుయొక్క, కరుణావశతః = దయవలన, భాస్కరరాయేణ = భాస్కరరాయలు చేత, సమున్మిషితే = ప్రకటింపబడిన, వరివస్యాతిరహస్యే = వరివస్యా రహస్యమను గ్రంథమునందు, పూర్వాంశః = మొదటి భాగము, పూర్ణతామ్ = సమాప్తిని, ఆపత = పొందెను.

**ఇతి**

**శ్రీ నృసింహానందనాథ చరణారాధకేన, భాస్కరరాయాపరనామ్నా**
**భాసురానందనాథేనోమ్మీన్నితే వరివస్యా-రహస్యే ప్రథమోఽంశః**

**శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ**





प्रथमोऽशः

पञ्चदशी मन्त्र में वर्ण-संघटन

वाग्भवकूट :
(१८ वर्ण)
क(१) + अ(१) +
ए(१) + ई(१) +
ल(१) + अ(१) +
ह्रीं(१२)

६ + १२ = १८

कामराजकूट :
(२२ वर्ण)
ह(१) + अ(१) +
स(१) + अ(१) +
क(१) + अ(१) +
ह(१) + अ(१) +
ल(१) + अ(१) +
ह्रीं(१२)

१० + १२ = २२

शक्तिकूट :
(१८ वर्ण)
स(१) + अ(१) +
क(१) + अ(१) +
ल(१) + अ(१) +
ह्रीं(१२)

६ + १२ = १८

१८ + २२ + १८ = ५८

ह्रींकार में निहित
१२ वर्ण



'प्रणव' = ओंकार । ओंकार जीवों का प्राण है ।'

ఔఃమ్

శ్రీ శివాయ గురవే నమః

శ్రీ సౌభాగ్యవిద్యా పంచదశాక్షరీ మహాత్రిపురసుందర్యై నమః

# శ్రీ వరివస్యారహస్యే - ఉత్తరాంశః

## ప్రారంభః

**అవ :** ప్రథమాంశమున **మనోరర్థాంశ్చ** అని జపమునకు అంగముగా మంత్రార్థమవసరమని సూచింపబడినది. దాని ఆవశ్యకతను దృష్టాంతపూర్వముగా వివరింపబడుచున్నది.

**శ్లో॥ నార్థజ్ఞానవిహీనం శబ్దస్యోచ్చారణం ఫలతి ।**
**భస్మని వహ్నివిహీనే న ప్రక్షిప్తం హవిర్జ్వలతి ॥** 1

అర్థజ్ఞానవిహీనమ్ = అర్థజ్ఞానములేని, శబ్దస్య = శబ్దముయొక్క, ఉచ్చారణమ్ = ఉచ్చరించుట, న ఫలతి = ఫలింపదు, వహ్నివిహీనే = నిప్పులేని, భస్మని = బూడిదె యందు, ప్రక్షిప్తమ్ = ఉంచబడిన, హవిః = ఆజ్యము మొదలగు హోమద్రవ్యము, న జ్వలతి = ప్రజ్వలింపదు.

**తా :** బూడిదలో చేయబడిన హోమమువలె, అర్థజ్ఞానములేని జపము వ్యర్థమని భావము.

**అవ :** ఈ విషయమున **యథా ఖరశ్చందనభారవాహీ** మంచి గంధపు కట్టెల మోపును మోయు గాడిదవలె, అర్థజ్ఞానము లేని శబ్దము వ్యర్థమని వివరింపబడుచున్నది.

**శ్లో॥ అర్థమజానానాం నానావిధశబ్దమాత్రపాఠవతామ్ ।**
**ఉపమేయశ్చక్రీవాన్ మలయజభారస్య వోఢైవ ॥** 2

అర్థమజానానామ్ = అర్థము తెలియనట్టి, నానావిధశబ్దమాత్రపాఠవతామ్ = అనేక విధములైన శబ్దములను మాత్రము చదువునట్టి వారలకు, మలయజ భారస్య వోఢా = చందనపు కట్టెల మోపును మోయునట్టి, చక్రీవాన్ ఏవ = గాడిదయే, ఉపమేయః = ఉపమేయము.

**తా :** అర్థము తెలియక శబ్దములను మాత్రము పఠించువారలు మంచి గంధపు కఱ్ఱల మోపును మోయు గాడిదకు ఉపమానముగా నుండ దగిన వారలు – గాడిద ఉపమేయము అనగా ఉపమేయము కంటే ఉపమానము గుణమున గొప్పదియై యుండును. అర్థజ్ఞానము

లేనివారలు ఉపమానము, గాడిద ఉపమేయము అనుటవలన గాడిదకంటే వీరు మూర్ఖులని భావము.

**అవ :** అర్థజ్ఞానమే పురుషార్థములకు ముఖ్యసాధనమని చెప్పబడుచున్నది.

**శ్లో॥ పురుషార్థానిచ్ఛద్భిః పురుషైరర్థాః పరిజ్ఞేయాః ।**
**అర్థానాదరభాజాం నైవార్థః ప్రత్యుతానర్థః ॥ 3**

పురుషార్థాన్ = ధర్మ, అర్థ, కామ, మోక్షములను, ఇచ్ఛద్భిః = కోరినట్టి, పురుషైః = పురుషులచేత, అర్థాః = అర్థములు, పరిజ్ఞేయాః = తెలిసి కొనదగినవి, అర్థానాదరభాజామ్ = అర్థమును ఆదరింపక, మంత్రమును మాత్రము అనుష్ఠానము చేయువారికి, అర్థః = ప్రయోజనము, న + ఏవ = లేరు, ప్రత్యుత = మఱియు వ్యతిరేకముగా, అనర్థః = అనర్థము, (సిద్ధ్యంతి = సిద్ధించును.)

**తా :** ఏ పురుషార్థమునైనను కోరువాడు శాస్త్రము వలన ఆ యా మంత్రార్థములను తెలిసికొని అనుష్ఠించినచో పురుషార్థములు సిద్ధించును. అట్లుగాక అర్థమును ఆదరింపక నిరసించి కేవలము మంత్రమును మాత్రము పఠించిన వారికి పురుషార్థములు సిద్ధింపక పోవుటయే గాక, అందుకు వ్యతిరేకముగా అనర్థములున్ను సంభవించును.

**అవ :** అర్థజ్ఞానము ముఖ్యమగుట వలన ప్రకృతమైన **శ్రీవిద్యామంత్రము**నకు ముందు చెప్పబోవు అర్థముల పేర్లు ఈ క్రింద చెప్పబడుచున్నవి.

**శ్లో॥ అథాతః పూర్ణగాయత్ర్యాః ప్రతిపాద్యోఽర్థ ఆదిమః ।**
**భావార్థస్సంప్రదాయార్థో నిగర్భార్థస్తురీయకః ॥ 4**

**శ్లో॥ కౌలికార్థో రహస్యార్థో మహాతత్త్వార్థ ఏవ చ ।**
**నామార్థశ్శబ్దరూపార్థశ్చార్థో నామైకదేశగః ॥ 5**

**శ్లో॥ శాక్తార్థస్సామరస్యార్థస్సమస్తసగుణార్థకౌ ।**
**మహావాక్యార్థ ఇత్యర్థాః పంచదశ్యాస్స్వసంమితాః ॥ 6**

అర్థాః = అర్థములు, స్వసమ్మితాః = పంచదశీమంత్రముయొక్క అక్షరములతో సమానమైన సంఖ్యగలవి. అనగా పదునైదు, ఆ పదునైదు నామములు ఈ శ్లోకములందు చెప్పబడినవి.

**అవ :** నాల్గవ పాదముతో గూడిన **గాయత్రీమహామంత్రముయొక్క అర్థము** పంచదశీ మంత్రము యొక్క ప్రతికూటమునకు కలదు. అందు పంచదశీ ప్రథమకూటముయొక్క మొదటి రెండు అక్షరములు గాయత్రీ ప్రథమ పాదము యొక్క అర్థమును బోధించుచున్నవని చెప్పబడుచున్నది.

**శ్లో॥ కామయతే స కకారః కామో బ్రహ్మైవ తత్పదస్యార్థః ।**
**సవితుర్వరేణ్యమితి వై సవితృశ్రేష్ఠం ద్వితీయవర్ణార్థః ॥ 7**

కకారః = **కకారము**, కామయతే = కోరునది, సః = ఆ, కామః = కామము, బ్రహ్మైవ = బ్రహ్మయే, తత్పదస్య = గాయత్రీ మంత్రము నందలి **తత్** అను పదమునకు, అర్థః = అర్థము, సవితుః వరేణ్యం ఇతి = సవితుః, వరేణ్యం అని, వరేణ్యమ్ = శ్రేష్ఠమైన, సవితృ = ప్రసవకారణము, ఇతి = అని, ద్వితీయవర్ణార్థః = పంచదశీ మంత్రము నందలి రెండవ అక్షరమునకు అర్థము అనగా ఏకారము.

**తా :** శ్రీవిద్యా మంత్రముయొక్క ప్రథమాక్షరము **కకారము**. దానియొక్క వ్యుత్పత్త్యర్థము కోరునది, కోరికగలది అని అర్థము. "**సోఽకామయత బహు స్యాం ప్రజాయేయ**" అను శ్రుతి ప్రకారము సమస్తజగత్సృష్టిని గురించిన కామము గలవాడని అర్థము. అట్టి కామము కామేశ్వరుడు. ఆ కామేశ్వరుడు బ్రహ్మయే. బ్రహ్మవలన సృష్టి పుట్టినట్లు శాస్త్రము చెప్పుచున్నది. ఆ కామేశ్వరుడే కకారమునకు అర్థము. గాయత్రీ మంత్రముననున్న మొదటి పదమగు తత్ అనుపదమునకు గూడా యిదియే అర్థము.

**ఓం, తత్, సత్** అను మూడు పదములు బ్రహ్మను బోధించును. ఇందువలన శ్రీవిద్య యందలి కకారము గాయత్రీ ప్రథమపాదముననున్న **తత్** అను పదమునకు అర్థమైన కామేశ్వరుడని చెప్పబడు బ్రహ్మను బోధించుచున్నదని తాత్పర్యము.

1. సవితుః, వరేణ్యం అను రెండు పదములకు, సవితృ = శ్రేష్ఠం అని క్రమముగా అర్థమని మూలమే బోధించుచున్నది. వరేణ్యమ్ = శ్రేష్టము, సవితృ = ప్రాణి ప్రసవ కారణము. యోని అని అర్థము. సవితృ శబ్దమునకు, వరేణ్యం అను విశేషణ ముండుటవలన, లోకమున ప్రాణి ప్రసవ కారణమైన అండజ, జరాయుజ, స్వేదజ, ఉద్భిజ్జములనెడి నాలుగు విధములైన స్త్రీలున్నను వారికి శ్రేష్ఠత్వము లేకపోవుటవలన, సవితుః వరేణ్యం అను రెండు పదములకు కామేశ్వరి అను పేరుగల **మహాత్రిపురసుందరి** యే అర్థము. ఈ అర్థమే శ్రీవిద్యామంత్రము నందలి రెండవ అక్షరమునకున్ను కలదు. "**యదేకాదశమాధారం బీజం కోణ త్రయాత్మ-కమ్ । బ్రహ్మాండాది కటాహాంతం జగద్వ్యాపి దృశ్యతే**" అను స్మృతి వలన, **కామో యోనిః** ఈ మొదలగు శ్రుతి వలన ఈ అర్థము తెలియగలదు.

**అవ :** ఇట్లు ప్రథమకూటమునందలి రెండక్షరములు, గాయత్రీప్రథమపాదమున్ను జగత్కారకులగు కామేశ్వరీ కామేశ్వరులను బోధించుచున్నవని చెప్పెను. అట్టి కామకామేశ్వరుల యొక్క సామరస్యమే పరమార్థము. వారి పరిణామమే జగత్తు. ఆ పరమశివుడే అందరి

బుద్ధులను ప్రేరేపించువాడు. ఆ తత్త్వమే గుణత్రయాతీతము, ప్రణవస్వరూపమున్ను అని, మిగిలిన గాయత్రీ మూడు పాదములు శ్రీవిద్యా ప్రథమకూటముయొక్క శేషించిన మూడు అక్షరములును బోధించుచున్నవని చెప్పబడుచున్నవి.

**శ్లో॥ సర్వాంతర్యామి దధద్భర్గో దేవస్య ధీతి తుర్యార్థః ।**
**పృథ్వీ మహీ లకారస్తృతీయతుర్యాంఘ్రిబోధికా మాయా ॥ 8**

దేవస్య = అను షష్ఠీవిభక్తిని ప్రథమావిభక్తిగా గ్రహింపవలయును.

దేవస్య = స్వయంప్రకాశమానము అనగా సర్వాంతర్యామి వాని తత్త్వము, ధీ = ధరించునది. అనగా సర్వాధారమైనది అయిన, భర్గః = పరశివుడు, ఇతి = అని, తురీయార్థః = మాతృకలో నాల్గవ అక్షర మైనది. మంత్రమున మూడవ యక్షరమున గల **ఈ** కారము యొక్క అర్థము. మహీ = గాయత్రీ మంత్రము నందలి మహీ యను పదమునకు పృథివియను నర్థము, లకారః = మంత్రమునందలి లకారము పృథివీ బీజమగుట వలన లకారమునకు పృథివీ యని అర్థము, ఉపలక్షణచే గాయత్రి యందలి మహీయను పదము, శ్రీవిద్యామంత్రము నందలి లకారము పాంచభౌతికమైన ప్రపంచమును బోధించును, మాయా = మాయా బీజమైన హ్రీం కారము, తృతీయతురీయాంఘ్రిబోధికా = మూడు నాలుగు పాదముల యొక్క అర్థమును బోధించును.

**తా :** ప్రకాశ, విమర్శలు జగత్కారణత్వధర్మమును పొందినప్పుడు కామకామేశ్వరీ స్వరూపమును పొందినవని పూర్వము చెప్పబడినది. ప్రకాశ, విమర్శల స్వభావమును కొంచెము పరిశీలింప వలయును.

ప్రళయకాలమున విమర్శ పరిణామమైన జగత్తు ప్రకాశతత్త్వమున అంతర్లీనమై యుండును. సృష్టికాలమున ప్రకాశరూపమైన బ్రహ్మ విమర్శ పరిణామ రూపమైన జగత్తున అంతర్లీనమై యుండును. ప్రకాశ విమర్శలు అవినాభావమై కార్యముచే రెండు రూపములుగా భాసించుచు వేరు, వేరు వస్తువులని గ్రహించుటకు అనువై యుండును. కాని ప్రకాశ విమర్శలు వస్తుతత్త్వమున నొక్కటియే. అది అద్వితీయమైన స్థితి. వస్తువు అది బహు రూపమున భాసించుట ఏకరూపమున నుండుటయు దానియొక్క స్వభావము. బహురూపమైనప్పుడు తంత్ర పరిభాషయందు **విమర్శ**యని వ్యవహరింపబడును. దానినే **ప్రకృతి** యనియు అందురు. ఏకరూపస్థితి తంత్ర పరిభాష యందు **ప్రకాశ**మని వ్యవహరింపబడును. ఆ స్థితి **పురుషు**డని యందురు. ప్రకాశస్థితియందు విమర్శ ప్రకాశాంతర్లీనమై యుండు ప్రకాశమని వ్యవహరింపబడునట్టి అఖండానందరూపమే యై **ప్రకాశవిమర్శలు** ఏకరూపమై యుండును.

సృష్టికాలమున ప్రకాశాత్మకమైన బ్రహ్మ విమర్శ పరిణామ రూపమైన జగత్తున లీనమైనపుడు విమర్శయొక్క బహురూపము బహిర్గతమై అనేక రూపములు భాసించును. ఇట్టి బహుస్థితి యందును భిన్నరూపములయందు సామ్యము గుర్తింపబడుచు, సమరూపమైన బ్రహ్మతత్త్వము అనగా ప్రకాశము తత్త్వవేత్తలకు గోచరించుచుండును.

అట్లే ప్రకాశతత్వమున విమర్శమంతర్లీనమై యున్నపుడు ప్రకాశము కంటే వేరుగా విమర్శతత్త్వము గోచరింపదు. ప్రకాశస్వరూపమే అనుభవరూపమై యుండును.

ప్రళయము అంతమై సృష్టింపబడుటకు పూర్వము నందు అనగా సంహార మధ్య భూమియందు ప్రకాశవిమర్శల యొక్క ఉభయసామరస్యరూపమైన స్థితి యొకటి గలదు. ఆ స్థితికి పరమశివుడని పేరు. అది ప్రకాశవిమర్శల యొక్క సమప్రధానమై, సమరసమైన స్థితి అనగా దిశ.

ప్రళయకాలమున ప్రకాశాత్మకమైన ఈ పరశివతత్వము సర్వాధారమని చెప్పబడును. అది విమర్శకు ఆధారమై విమర్శ పరిణామరూపమైన జగత్తునకు ఆధారమైనది. అందువలననే జగద్భావము నందును సుఖరూపమై పరశివతత్వము సర్వజీవులకు గోచరించుచున్నది. తత్వవేత్తలు అనేకత్వమున ఏకత్వమును గ్రహించి బ్రహ్మానందము ననుభవించుదురు. దాని ఆధారముననే విమర్శయు భూత భౌతిక ప్రపంచమును సృష్టించుకొని తనకు అట్టి జగత్తునకు స్థితి కలిగియున్నది. అందువలన ప్రకాశస్థితి సర్వాధారమైన బ్రహ్మ, ఆ ప్రకారమే సృష్టికాలమున విమర్శాత్మకమై సర్వాంతర్యామియని చెప్పబడును. సర్వప్రపంచము నందు చైతన్యరూపమున ప్రవేశించి ఉండుటవలన నిట్టి వ్యవహారము కలిగినది. విమర్శకు సర్వవ్యవహారము స్వభావము. అనగా క్షేత్రరూపముగను, క్షేత్రజ్ఞరూపమైన చైతన్యరూపమునను విమర్శింపబడును. నిర్విమర్శమైన స్థితి ప్రకాశమే. విమర్శ చిద్రూపమైనను జడరూపమైనను అది విమర్శయనియే వ్యవహరింపబడును. అందువలన ఆత్మతత్వవిమర్శయు విమర్శ స్థితియే. అది సర్వవిధ విమర్శలకు మూలము. చరాచర సర్వజీవులయందంతర్యామియై ప్రేరేపకమై యుండును. వస్తుతత్వమున ప్రకాశవిమర్శలొక్కటియే యగుట వలన బ్రహ్మ సర్వాధారము, సర్వాంతర్యామియని వ్యవహారము కలిగినది. ఈ సర్వాధారత్వము ప్రళయకాలమున ప్రకాశ తత్వానుభవమున గుర్తింపబడును. సర్వాంతర్యామిత్వము విమర్శయొక్క జగద్భావమున గోచరించును. ఉభయసామరస్యాత్మకమైన పరశివతత్వమున **ప్రకాశవిమర్శల** రెంటికి సమప్రాధాన్యముండుట వలన బ్రహ్మ సర్వాధారము, సర్వాంతర్యామి యను వ్యవహారము పూర్ణమై యుండును. సృష్టి ప్రళయకాలములందువలె, సర్వాధారత్వ, సర్వాంతర్యామిత్వముల అనుభవము గోచరింపబడదు. అయినను ఉభయ ప్రధాన మగుట వలన రెండు ప్రవాహములు

ఎదురై కలసినపుడు నిస్తరంగ స్థితి ఏర్పడినట్లు ఈ పరశివస్థితి నిరతిశయమైన సుఖస్వరూపము. ఇదియే పరమపురుషార్థమై మోక్షమని వ్యవహరింపబడుచు సర్వాభిలషణీయమైన తత్త్వమై వెలయుచున్నది. ఈ తత్త్వస్వరూపము కామేశ్వరీకామేశ్వరుల ఏకాంతరూపమగుటవలన స్త్రీ, పురుషుల ఏకాంతమువలె ప్రకాశవిమర్శల ఏకాంతస్వరూపమైన పరశివతత్త్వము గురు ముఖముననే తెలుసుకొనదగినది.

వరివస్యా ప్రథమాంశము నాల్గవ శ్లోకము **నైసర్గికీ స్ఫురత్తా** అను శ్లోక తాత్పర్య వివరణము నందు జగద్బ్రహ్మల సమస్థితి యగు **సమాధి** స్ఫురణశక్తివలన కలుగుచున్నదను సందర్భమున ఈ తత్త్వమును గూర్చిన విషయము చెప్పబడినది.

ఇట్టి పరశివతత్త్వమే ఉపాసకులచే **మహాత్రిపురసుందరీ**, **బిందుచక్రేశ్వరీ** అను నామములచే పూజింపబడుచున్నది.

ఈ పరశివతత్త్వము గాయత్రీ మంత్రముయొక్క **భర్గో దేవస్య ధీ** అను అక్షరములచేతను, శ్రీవిద్యామంత్రమున **ఈ** కారముచేతను చెప్పబడినది. **భర్గో దేవస్య ధీ** అను ఆ రక్షరముల యొక్క అర్థము వివరింపబడినది. ఇక ఈ కారమునందు ఈ తత్త్వమునిట్లు సమన్వయించు కొనవలయును.

ఈ కారమును వ్రాయునపుడు ముందుగా బిందువును వ్రాయుదుము. అది సర్వాధారమైన ప్రకాశతత్వము. తరువాత ఆ బిందు మధ్యమున రేఖను వ్రాయుదుము. ఈ రేఖ బిందువును రెండుగా ఖండించును. అప్పుడది విసర్గయని చెప్పబడును. ఆ విసర్గము బహుభవనరూపమైన విమర్శరూపమును గుర్తింపజేయును.

ఆ భిన్నరూపమునందు అంతర్యామిత్వమును గూడ గుర్తింపజేయును. అందువలన బ్రహ్మయొక్క సర్వాంతర్యామిత్వము, సర్వాధారత్వము ఈ కారము చెప్పుచున్నది. ఇందు సర్వాంతర్యామిత్వ, సర్వాధారత్వములు ప్రకాశవిమర్శల ధర్మములు. ఇది ప్రకాశ, విమర్శల యొక్క సమప్రధానస్థితిని గుర్తింపజేయును. అందువలన **భర్గో దేవస్య ధీ** అను అక్షరములచే చెప్పబడిన పరశివతత్త్వము ఈ ఈకారము చేతను చెప్పబడుచున్నదని భావము.

ఇంతకంటే వలసిన వివరములను గురుముఖమున తెలుసుకొనవలయును.

**శ్లో॥ తత్సవితుర్వరేణ్యం । భర్గో దేవస్య ధీ మహి ।**
**ధియో యో నః ప్రచోదయాత్ । పరో రజసే సాఽవదోమ్ ॥** ఇది పూర్ణగాయత్రీ మంత్రము.

గాయత్రి యొక్క మూడు నాలుగు పాదముల యొక్క అర్థమును శ్రీవిద్యయందలి మాయా

బీజమగు హ్రీం కారమును బోధించుచున్నది. ఎట్లన **ధియో యోనః ప్రచోదయాత్** అని మూడవ పాదము, యః = ఏ పరశివుడు, సర్వాంతర్యామియై, నః = మన యొక్క, ధియః = బుద్ధివృత్తులను, ప్రచోదయాత్ = ప్రేరేపించునో, (సః = ఆ పరశివుడు), **పరో రజసే సావదోమ్** ( యిది గాయత్రీ నాల్గవ పాదము) **రజసే పరః** = త్రిగుణాతీతుడైనవాడు, ఇచ్చట రజశ్శబ్దము త్రిగుణముల కుపలక్షణము, సావదోమ్ = స, అ, వద, ఓం (అను పదములకు సమానము) స, అ, అను రెండు పదములు వద అను దానితో ప్రత్యేకముగా సంబంధించును. కాగా సవదః అవదః ఓం అను పదములేర్పడినవి. సవదః = చెప్పనలవియైనవాడు, అవదః = చెప్పనలవికానివాడు అనగా శ్రుతులచే లక్ష్యార్థరూపముగా చెప్పబడినవాడు. వాచ్యార్థమున చెప్పనలవి కానివాడు. ఇట్టి పరశివుడు, ఓమ్ = ప్రణవమునకు అర్థమైనవాడు. ఇందుకు "**తస్య వాచకః ప్రణవః**" అను శ్రుతి ప్రమాణము. ఈ అర్థమే హృల్లేఖకును (హ్రీం) కలదు. **హృది లేఖేవ వర్తతే హృదయాగారనివాసినీ హృల్లేఖా** అను శ్రుతి యీ యర్థమునకు ప్రమాణము. హృల్లేఖకు ఇట్టి అర్థము కలిగియుండుటకు, ప్రణవము పరశివాత్మక మహాత్రిపురసుందరీ స్వరూపము అగుటయు, గురుముఖమున తెలిసి కొనవలయును.

కాగా కామేశ్వరకామేశ్వరీ సమరసాత్మకమైన పరశివుని పరిణామభూతమే జగత్తు. పరశివుడు సర్వప్రాణుల బుద్ధి వృత్తులను కలిగించువాడు. త్రిగుణాతీతుడు, వేదాంత వాక్యములచే లక్షణావృత్తిచే బోధింపబడువాడు. ప్రణవస్వరూపుడున్ను అని పూర్ణగాయత్రికి శ్రీవిద్యా మంత్ర ప్రథమ కూటమునకు అర్థమని తేలిన పర్యవసానము.

**అవ :** రెండు మూడు కూటములకున్ను ప్రత్యేకముగ నిదియే అర్థమని బోధింపబడుచున్నది.

**శ్లో॥ త్రిపదీ త్రివర్ణబోధ్యా తుర్యస్తదుపరిషడక్షరీగమకః ।**
**అథ తార్తీయే వర్ణద్వితయం త్రిపదీషడక్షరీగమకమ్ ॥** 9

త్రిపదీ = మూడుపదములు, త్రివర్ణబోధ్యా = మూడక్షరములచే బోధింపదగినది, తదుపరి = తరువాత, తుర్యః = నాల్గవ అక్షరమైన హకారము, షడక్షరీగమకః = భర్గో దేవస్య ధీ అను ఆరు అక్షరములయర్థమును బోధించును. అథ = మఱియు, తార్తీయే = మూడవ కూటమందలి, వర్ణద్వితయమ్ = రెండక్షరములును, త్రిపదీషడక్షరీగమకమ్ = మూడు పదముల యొక్క, ఆరు అక్షరముల యొక్క అర్థమును బోధించును.

**తా :** ద్వితీయ కూటమందలి ప్రథమాక్షరమైన **హకారము** గాయత్రీమంత్రమునందున్న **తత్** అను పదముయొక్క అర్థమును బోధించును. సకారము సవితృ అను పదముయొక్క అర్థమును బోధించును. కకారము వరేణ్యం అను పదముయొక్క అర్థమును బోధించును. తరువాత

నాల్గవయక్షరమైన హ కారము **భర్గో దేవస్య ధీ** అను ఆరు అక్షరముల యొక్క అర్థమును బోధించును.

తరువాత మూడవకూటమున ప్రథమాక్షరమైన **స** కారము **తత్సవితుర్వరేణ్యం** అను మూడు పదముల యొక్క అర్థమును బోధించును. **క** కారము **భర్గో దేవస్య ధీ** అను ఆరు అక్షరముల యొక్క అర్థమును బోధించును.

**అవ :** రెండు మూడు కూటముల యందు శేషించిన ల కారము హ్రీం కారములు ప్రథమ కూటము నందు వలెనే అర్థబోధకమని చెప్పబడుచున్నది.

**శ్లో॥ కూటద్వితయే శేషం పూర్వవదున్నేయమితి తు విద్యాయాః ।**
**గాయత్ర్యర్థస్త్రిపురోపనిషది కథితస్తథైవ భాగవతే ॥** **10**

కూటద్వితయే = రెండు మూడు కూటములైన రెంటియందు, శేషమ్ = మిగిలిన లకార హ్రీంకారములనెడి రెండు వర్ణములు, పూర్వవత్ = ప్రథమ కూటమువలె, ఉన్నేయమ్ = తెలిసికొనదగినది. ఇతి, తు = ఈ విధముగనైతే, విద్యాయాః = పంచదశీ విద్యయొక్క, గాయత్ర్యర్థః = గాయత్రీ మంత్రము యొక్క అర్థము, త్రిపురోపనిషది = త్రిపురాతాపిన్యుపనిషత్తు నందు, కథితః = చెప్పబడినది. భాగవతే = భాగవతమునందు, తథైవ = ఆ విధముగానే, కథితః= చెప్పబడినది.

**తా :** పంచదశీ మంత్రము యొక్క రెండు కూటముల యందున్న **ల హ్రీం** అను రెండు అక్షరములకు మొదటి కూటమునందు వలెనే అర్థము చెప్పుకొనవలయును. అనగా ల కారమునకు మహి అను పదార్థమును, హ్రీం కారమునకు **ధియో యో నః ప్రచోదయాత్ పరో రజసే సావదోమ్** అను రెండు పాదముల యొక్క అర్థమును బోధించునని తాత్పర్యము. దీని తాత్పర్యము ప్రథమకూటార్థమున వివరింపబడినది. ఈ విధముగా పంచదశీ మహా- మంత్రమునకు గాయత్రీ మహామంత్రార్థము త్రిపురాతాపిన్యుపనిషత్తునందు, దేవీభాగవతము నందును చెప్పబడినది. అందువలన ఈ యర్థము శ్రుతిస్మృతి ప్రతిపాదితమైనది.

## 2. భావార్థము

**అవ :** ఇక **భావార్థము** చెప్పబడుచున్నది. (1)

**శ్లో॥ వామేచ్ఛే బ్రహ్మభారత్యౌ జ్యేష్ఠాజ్ఞానే హరిక్షితీ ।**
**రౌద్రీక్రియే శివాపర్ణే ఇత్యేతన్మిథునత్రయమ్ ॥** **11**

వామేచ్ఛే = వామ - ఇచ్ఛ అను శక్తులు, బ్రహ్మాభారత్యౌ = బ్రహ్మ సరస్వతులు అనెడు మిథునము, జ్యేష్ఠాజ్ఞానే = జ్యేష్ఠ - జ్ఞాన అను శక్తులు, హరిక్షితీ = విష్ణువు భూమి అనెడి మిథునము, రౌద్రీక్రియే = రౌద్రీ-క్రియ అను శక్తులు, శివాపర్ణే = శివుడు-పార్వతీ అనెడి మిథునము, ఇత్యేత్ (ఇతి + ఏతత్) = ఈ విధమైన ఈ, మిథునత్రయమ్ = మూడు మిథునములు

**తా :** ప్రకాశవిమర్శలు రెండు కలసి **మిథున** భావము పొంది జగత్కారణమగునని సిద్ధాంతము. శ్రుతులయందు బ్రహ్మలక్షణము జగత్కారణమైన తత్త్వముగా చెప్పబడినది. బ్రహ్మ సమష్టి ప్రపంచమునకు కారణము. వ్యష్టి సృష్టిని బట్టి ఆ అనుభవముననుసరించి సమష్టి సృష్టి శాస్త్రమున వివరింపబడినది. ప్రకాశ, విమర్శలు సామరస్యమును పొంది పరశివరూప మేర్పడునని గాయత్రీ అర్థమున వివరింపడినది. అందు ప్రకాశము పుంరూపము. విమర్శ స్త్రీరూపము. ప్రకాశసమష్టి **అంబిక** యని చెప్పబడినది. వ్యష్ఠి భావమున వామా, జ్యేష్ఠా, రౌద్రీ అని మూడు విధములగును. వామాయనునది బ్రహ్మకు మఱియొక పేరు. జ్యేష్ఠా అనునది విష్ణుపర్యాయమైన పదము. రౌద్రీ అనునది రుద్రునకు నామాంతరము. విమర్శయొక్క సమష్టి **శాంత** యని చెప్పబడును. వ్యష్టిభావమున ఇచ్ఛా, జ్ఞానా, క్రియా యని ముత్తెరుగులగును. అందు ఇచ్ఛాయను నది సరస్వతి యొక్క నామాంతరము, జ్ఞానా యనునది పృథివియొక్క పర్యాయ పదము, క్రియా యనునది పార్వతికి పర్యాయపదము. వీరందరు కలసి నాల్గు మిథునములగును. ఎట్లన ప్రకాశ సమష్టియైన అంబిక, విమర్శ సమష్టియగు శాంతయు కలసి యొక మిథునము. ఇది సమష్టి మిథునము.

ప్రకాశవ్యష్టి శక్తులలో వామా, విమర్శ వ్యష్టి శక్తులలో ఇచ్ఛా కలసి యొక మిథునము. రౌద్రీ క్రియలు కలసి యొక మిథునము. ఇట్లు నాలుగు మిథునములగు చున్నది. అందు వ్యష్టి మిథునములు మూడు శ్లోకమున చెప్పబడినవి.

**అవ :** ఈ మిథునత్రయము ఈం కారములేని కూటత్రయముచే చెప్పబడుచున్నవి. మూడు కూటముల యందున్న ఈం కారములకు సమష్టిమిథునం అర్థమనియు చెప్పబడుచున్నది.

**శ్లో॥ త్రిభిః కూటైః క్రమాద్వాచ్యమీంకారత్రితయేన తు ।**
**ఏతత్త్రయసమష్ట్యాత్మ వాచ్యం శాంతాంబికాత్మకమ్ ॥ 12**

పూర్వశ్లోకమున ఉన్న మిథునత్రయం అనుపదము నిచ్చట చేర్చుకొనవలయును. మిథునత్రయమ్ = వ్యష్టిమిథునములు మూడు, త్రిభిః కూటైః = మూడు కూటములచేత, క్రమాత్ = క్రమముగా, వాచ్యమ్ = చెప్పదగినది. ఈంకార త్రితయేన తు = మూడు

కూటములందున్న **ఈం** కారముచేత, ఏతత్త్రయ-సమష్ట్యాత్మ = ఈ మూడు కూటముల సమష్టియైన **శాంత+అంబిక** యనెడి మిథునము, వాచ్యా = చెప్పదగినది.

**తా :** పూర్వశ్లోకమున చెప్పబడిన వ్యష్టి మిథునములు మూడు క్రమముగా మూడు కూటములచే చెప్పబడును. అనగా వాగ్భవకూటమగు మొదటి కూటమునకు బ్రహ్మ-సరస్వతులర్థము. కామరాజకూటమగు రెండవ కూటమునకు విష్ణువు-పృథివి అర్థము. శక్తికూటమగు మూడవ కూటమునకు రుద్రుడు-గౌరియు అర్థము. మూడు కూటములందున్న హ్రీం కారాంతమున గల ఈం కారముల మూటికి వ్యష్టి మిథునములగు మిథునత్రయమునకు సమష్టియైన శాంతాంబికాత్మకమైన చతుర్థమిథునమర్థము. అనగా ఈం కారము లేని కూటత్రయమునకు క్రమముగా వ్యష్టి మిథునత్రయమర్థము. ఈం కారముల మూటికి సమష్టి మిథునమర్థము. కాగా ప్రతికూటముచే నొకవ్యష్టి మిథునము సమష్టి మిథునముతో కలసి యర్థముగా భావింపబడును.

**అవ :** మఱియొక విధమున **భావార్థము** చెప్పబడుచున్నది. **(2)**

> **శ్లో॥ యద్వా గీస్సకలబ్రహ్మప్రభృతీనాం త్రయం త్రయమ్ ।**
> **త్రికూటవాచ్యం మాయాయాస్తురీయం మిథునం మతమ్ ॥ 13**

యద్వా = లేక, గీస్సకల బ్రహ్మ ప్రభృతీనామ్ = గీస్సకల బ్రహ్మ అనుపదముల మూటి ద్వంద్వ సమాసము, ద్వంద్వాంతమున నున్న ప్రభృతి శబ్దము ఈ మూటితో సంబంధించును. కాగా, గీః ప్రభృతీ = సరస్వతీ మున్నగు, సరస్వతీ, పృథివీ, పార్వతి అను మూటియొక్కయు, సకల ప్రభృతీనామ్ = సకల ప్రళయాకల విజ్ఞానకేవల అను ఉపాసకుల యొక్కయు, బ్రహ్మ ప్రభృతీనామ్ = బ్రహ్మ విష్ణు రుద్రుల యొక్కయు, త్రయం త్రయమ్ = మూడు మూడు, త్రికూటవాచ్యమ్ = హ్రీంకారము విడిచిన మూడు కూటముల కర్థము, మాయాయాః = హ్రీంకారమునకు, తురీయం మిథునమ్ = శాంతాంబికాత్మక సమష్టి మిథునమగు, నాల్గవ మిథునము, మతమ్ = అర్థమని సమ్మతము ఇష్టము.

**తా :** మరియొక విధముగ భావార్థమిందు చెప్పబడినది. ప్రథమ కూటమునకు విమర్శ వ్యష్టి స్వరూపమగు సరస్వతీ, పృథివీ, గౌరి అనెడి మూడు శక్తులు అర్థము, సకల, ప్రళయాకల, విజ్ఞాన కేవల అను ఉపాసక త్రయము మధ్య కూటమునకర్థము. బ్రహ్మ విష్ణు రుద్రులనెడి ప్రకాశ పర్యాయమైన మూడు తృతీయ కూటమున కర్థము. స్త్రీ పర్యాయమగు శక్తిత్రయమునకు, పుంపర్యాయమగు శక్తి త్రయమునకు మధ్యన, మధ్యకూటముచే ఉపాసక త్రయము చెప్పబడుట గమనింప దగిన విశేషము. ఉపాసకులు పుత్రీకరణ సంస్కారము పొంది యుండవలయును.

పుత్త్రులకు దంపతులకు మధ్యన ప్రవేశమర్హము, పుత్త్రీకరణ సంస్కారమే ఉపాసకత్వము మోక్షమని సూచింప బడినది. పుత్త్రీకరణ సంస్కారమునకు సంబంధించి విశేషము గురు ముఖముననే తెలిసికొనవలయును.

**నాపుత్త్రాయ ప్రదాతవ్యం, నాశిష్యాయ కదాచన** అను శాస్త్రవాక్యములయందు పుత్త్రీకరణ సంస్కారములేని శిష్యునకు విద్యనీయరాదని చెప్పబడినది.

**అవ :** మఱియొక విధమగు **భావార్థము** చెప్పబడుచున్నది. (3)

**శ్లో॥ వామేచ్ఛాద్యాః షడీంకార ఇతి సప్తభిరక్షరైః ।**
**త్రిరావృత్తైరియం విద్యా సంజాతా తేన తన్మయీ ॥** **14**

వామేచ్ఛాద్యాః = వామా–ఇచ్ఛా మొదలగునవి, షట్ = ఆరు, ఈంకారః = హ్రీం అను బీజమునందున్న ఈం కారము, ఇతి = అని, త్రిరావృత్తైః = మూడు మారులు ఉన్న, సప్తభిః అక్షరైః = ఏడు అక్షరములచేత, ఇయం విద్యా = ఈ పంచదశాక్షరీ, సంజాతా = పుట్టినది, తేన = ఆ కారణముచేత, తన్మయీ = మూడు మారులు ఆవృత్తములైన వామాది సప్తశక్తి స్వరూపమైనది, **వామా ఇచ్ఛా జ్యేష్ఠా జ్ఞానా రౌద్రీ క్రియా** అనునవి ఆరుశక్తులు. ఈ యారు ప్రథమకూటమునందు కకారాది రేఫ వరకున్ను ఆరు అక్షరముల స్వరూపములైనవి. ఈంకారము సమష్టి మిథున స్వరూపమైనది.

రెండవ కూటమున రెండవ హకారమును విడచి, మూడవ కూటము ముందు చేర్చుకొనవలయును. కాగా రెండవ కూటమున హకారాది రేఫాంతముగల అక్షరములు ఆరు శక్తి స్వరూపములైనవి. ఈంకారము సమష్టి మిథునస్వరూపము, మూడవ కూటమున రెండవ కూటము నందలి రెండవ హకారమును ముందు చేర్చుట వలన రేఫాంతము ఆరు వర్ణములేర్పడినవి. ఈ ఆరు వర్ణములు వామాది షట్కస్వరూపము. ఈం కారము సమష్టి శక్తి స్వరూపము. ఈ విధముగ మూడు మారులు ఆవర్తింపబడిన ఏడు అక్షరములచేతనే పంచదశి పుట్టినది. అందువలన ఈ విద్యామంత్రము మూడు మారులు ఆవృత్తములైన వామాది సప్తశక్తి స్వరూపము. మంత్రాక్షరములకు శక్తులకు అభేదము. ఉపాసనా శాస్త్రమున సిద్ధిని సంపాదించిన సిద్ధుల అనుభవమున ప్రసిద్ధమై యున్నది. మంత్ర, మంత్రార్థములకు అవినాభావమైన సంబంధమున్నది. "**అస్తి, భాతి, ప్రియం, రూపం, నామ చేత్యంశ–పంచకమ్ । ఆద్య త్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయమ్**" అని శాస్త్ర ప్రమాణము. అస్తి, భాతి, ప్రియం అను ఈ మూడు బ్రహ్మరూపమునకు లక్షణము, సత్ + చిత్ + ఆనందము = సచ్చిదానందము బ్రహ్మమని లోకమున ప్రసిద్ధవ్యవహారము కలదు. అస్తి = అనుటచే సత్తు, భాతి అనుటచే చిత్తు, ప్రియము అనుటచే ఆనందమని గ్రహింపవలయును.

మంత్రశాస్త్రమున సత్ = ప్రకాశమని, చిత్ = విమర్శ, ఆనందము = ఉభయసామరస్యము కలిగిన పరశివతత్త్వమని వ్యవహరింపబడుచున్నది. సద్రూపమైన ప్రకాశము **రూపము**గను, చిద్రూపమైన విమర్శ **నామము**గను, జగద్రూపమున పరిణమించినది. అనగా ప్రకాశము యొక్క స్థూలమైన జాడ్యరూపము అర్థము. అదియే యిచ్చట **రూప**మని చెప్పబడినది. విమర్శ యొక్క జాడ్యరూపము **నామము**. ఈ **నామరూపము**లే జగత్తుయొక్క రూపము. దీనివలన ప్రకాశ విమర్శల స్థూలపరిణామమే జగత్తని తేలిన సారాంశము.

**నామరూపములు** సమానాకారములు. నామమే శబ్దము. రూపమే అర్థము. ఎట్టి నామమో అట్టి అర్థము. నామము వినినపుడు అర్థము స్ఫురించును. వస్తువు చూచినపుడు నామము స్ఫురించును. ఈ రెండును అవినాభావములై తత్త్వమున గల ప్రకాశవిమర్శల అవినాభావమును సూచించును.

నామరూపములు సమానాకారములనుటకు ఉదాహరణ "దేవదత్తః తండులం పచతి" ఇందు ఆరవయవములు గలవు. దేవదత్త అను శబ్దము, ప్రథమావిభక్తి, తండుల శబ్దము ద్వితీయా విభక్తి, పచ్ అను ధాతువు, ఆఖ్యాతము అనునవి వాక్యమున గల ఆరవయవములు. ఈ వాక్యార్థమున్ను వాక్యముతో సమానాకారమగుటచే ఆరవయవములు కలిగి యున్నది. ఎట్లన దేవదత్త – కర్త, తండుల – కర్మ, తేజస్సంయోగ ప్రయత్న ఆరవయవములు అర్థమునందు గలవు. పదప్రయోగమువలన పదార్థజ్ఞానము, వాక్యప్రయోగము వలన వాక్యార్థజ్ఞానము వినువానికి కలుగుచుండును. ఇందువలన శబ్దార్థముల కభేదమనెడి మంత్ర శాస్త్ర ప్రసిద్ధి. లౌకికోదాహరణముల యందు సరిపోవుచున్నది. ఇట్లే పంచదశాక్షరీ మంత్రము పూర్వము ప్రతిపాదింపబడిన విధమున సప్తశక్తి స్వరూపముగ నిరూపితమగుచున్నది.

**శ్లో॥ వామాదిసప్తశక్తీనాం సమష్టిః పరదేవతా ।**
**షట్త్రింశత్తత్త్వరూపాఽస్మాన్మాత్రయాఽపి న భిద్యతే ॥** **15**

వామాది సప్తశక్తీనామ్ = వామ మున్నగు సప్తశక్తుల యొక్క, సమష్టి = సమష్టియే, పరదేవతా = పరదేవత, షట్త్రింశత్తత్త్వరూపా = ముప్పదియారు తత్త్వముల స్వరూపమైనది. సా = ఆమె, అస్మాత్ = ఈ మంత్రముకంటే, మాత్రయా + అపి = కొద్దియున్ను, న భిద్యతే = వేరుకాదు.

**తా :** దేవతకు, మంత్రమునకు, లేశమాత్రమైనను భేదములేదు. ఎందువలననగా శ్రీవిద్యా మంత్రము షట్త్రింశత్తత్త్వ రూపమైనది. ప్రపంచము షట్త్రింశత్తత్త్వరూపమైనది. అందువలన వామాది సప్తశక్తి స్వరూపమైన **పరదేవతకు, ప్రపంచమునకు, శ్రీవిద్యకు**, మూటికి అభేద భావన భావార్థమని నిష్కృష్ట విషయము.

శ్రీవిద్యామంత్రము షట్త్రింశత్తత్త్వ రూపమను విషయము సంప్రదాయార్థమున చెప్పబడును. మంత్రార్థమైన పరదేవతయు షట్త్రింశత్తత్త్వరూపమై వెలయును. వాచ్యవాచకముల కభేదము నిరూపింపబడినది గదా!

**అవ :** మరొక విధమున **భావార్థము** చెప్పబడుచున్నది. (4)

**శ్లో॥ అహకారౌ శివశక్తీ శూన్యాకారౌ పరస్పరాశ్లిష్టౌ ।**
**స్ఫురణప్రకాశరూపావుపనిషదుక్తం పరం బ్రహ్మ ॥ 16**

అహకారౌ = అకార, హకారములు, శివశక్తీ = అకారము శివస్వరూపము, హకారము శక్తి స్వరూపము, శూన్యాకారౌ = శూన్యస్వరూపములైనవి, పరస్పరాశ్లిష్టౌ = ఒండొరులు మిళితమైన స్వరూపములు కలవి. స్ఫురణ ప్రకాశరూపౌ = పాఠక్రమము కంటే అర్థక్రమము బలీయమగుటవలన, అకారము, ప్రకాశస్వరూపము, హకారము స్ఫురణ స్వరూపమని చెప్పుకొనవలయును. ఉపనిషదుక్తమ్ = ఉపనిషత్తులయందు చెప్పబడిన, పరం బ్రహ్మ = పరమైన ఆత్మతత్త్వము.

**తా :** మంత్రము నందు మూడవ కూటమునందలి స కారముపై నున్న అకారము నందు శివస్వరూపమును, రెండవ కూటమునందలి నాల్గవ అక్షరమైన హ కారమును శక్తిస్వరూపముగను భావించవలసినదిగా మరొకవిధమైన భావార్థమును చెప్పదలచి అహ కారముల స్వరూపము ముందు వివరింపబడుచున్నది. **అ** కారము శివస్వరూపము. ప్రకాశమనియు వ్యవహరింపబడును. **హ** కారము శక్తి స్వరూపము, స్ఫురణమనియు చెప్పబడును. ఈ స్ఫురణ ప్రకాశములు రెండు కలిసి ఏక రూపమగుట వలన ఈ రెంటిలో నొక్కదానిని విడదీయవీలులేదు. రూపాంతరమును పొందినపుడు కార్యరూపముల భేదమును బట్టి వస్తువుల వేరు భావమును గుర్తించుదురు. సృష్టికి పూర్వము, సంహారమధ్య స్థితి యందు, ఏ స్వరూపము గ్రహింపబడక పోవుట వలన శూన్యరూపములై ఏకాకారము అనుభవసిద్ధము లగును. అట్టి స్ఫురణ ప్రకాశరూపమైనది. కూటస్థతత్త్వము, అన్యథా భావములేని శాశ్వతమైన స్వరూపము, ఈ స్వరూపమునే మంత్రశాస్త్రజ్ఞులు తురీయబిందువని వ్యవహరింతురు. కూటస్థమగు ఈ తత్త్వమునుద్దేశించియే శ్రుతులట్లు పలికినవి.

"అశబ్దమస్పర్శమరూపమవ్యయం తథాఽరసం, నిత్యమగంధవచ్చ యత్ ।
అనాద్యనంతం మహతః పరం ధ్రువం నిచాయ్యతం మృత్యుముఖాత్ ప్రముచ్యతే॥"
"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ॥"

ఇత్యాది శ్రుతులు ఆ స్వరూపమును శబ్దాది గుణములు లేనిదని, అనాది, అనంతమని

మహత్తత్త్వముకంటే పరమైనదని దాని నిదిధ్యాసమువలన మృత్యువును తరింపవచ్చునని, అది వాక్కులచే చెప్పనలవి కానిదని, మనస్సుచే నూహింప నలవి కానిదని ప్రతిపాదించుచున్నవి. ఇట్టి అద్వైతతత్త్వము నందు ప్రకాశముకంటే వేరుగాక తత్స్వరూపమే యై ప్రపంచకారణమైన స్ఫురణశక్తియున్నదని యొప్పుకొనవలయును. అట్టి కారణశక్తిలేనిచో ప్రపంచోత్పత్తి కలుగనేరదు. మఱియు అది స్ఫురింపనందున శూన్యము, జడమునై యుండును. అట్టి పదార్థము పురుషార్థము కానేరదు. ఈ స్ఫురణశక్తియే సత్పదార్థమైన ప్రకాశముయొక్క అస్తిత్వమును గుర్తింపచేయుచున్నది. ఆ శక్తియే ప్రపంచరూపమైనది. స్వస్ఫురణము స్వస్వరూపమే యగుటవలన వేరు చేయ నలవి కాదు. రూపాంతరము, వస్త్వంతరము కాదు. అందువలన అద్వైతము సిద్ధించినది. ప్రకాశస్వభావముగా ఆ స్ఫురణశక్తి యున్నను, ఆ సంహారభూమియందు ఉపలభ్యము, కానందున వైశిష్ట్యము సిద్ధింపదు. అందువలన నే వాఙ్మనస్సులకు అచ్చట ప్రవృత్తి లేకపోయినది.

**"అద్వైతం కేచిదిచ్ఛంతి ద్వైతమిచ్ఛంతి చాపరే ।**
**సమం తత్త్వం న జానన్తి ద్వైతాద్వైతవిలక్షణమ్ ॥** " అను మొదలగు స్మృతులు చెప్పినవి. అట్టి ఈ స్వరూపమును గూర్చిన వివరములను గురుముఖముననే తెలిసికొని అనుభవింపవలయును, చెప్పుటకుకాని ఊహించుటకు కాని అలవి కాదు.

**అవ :** కూటస్థమగు ప్రకాశవిమర్శాత్మకమైన, అద్వైతతత్త్వమునుండి ప్రపంచకారణమైన కామకలాస్వరూపమగు మహాత్రిపురసుందరియొక్క ఉత్పత్తిని చెప్పుటకు స్ఫురణ ప్రకాశములు కారణ స్వరూపము లెట్లు పొందినది చెప్పబడుచున్నది.

**శ్లో॥ విశ్వసిసృక్షావశతస్స్వార్ధాం శక్తిం విలోకయద్బ్రహ్మ ।**
**బిందూభవతి తమిందుం ప్రవిశతి శక్తిస్తు రక్తబిందుతయా ॥ 17**

విశ్వసి-సృక్షావశతః = ప్రపంచమును సృష్టింపవలయునను కోరికవలన, స్వార్ధామ్ = తనలో భాగమైన, శక్తిమ్ = స్ఫురణశక్తిని, విలోకయత్ = అభిముఖమై, లోపల ప్రవేశించినదై, బ్రహ్మ = బ్రహ్మ, బిందూ = సోమాత్మక శుక్ల బిందు స్వరూపము, భవతి = అగుచున్నది. తం ఇందుమ్ = ఆ శుక్ల బిందువును, శక్తిః తు = శక్తియైతే, రక్తబిందుతయా = అగ్న్యాత్మక రక్తబిందు స్వరూపముతో, ప్రవిశతి = ప్రవేశించుచున్నది.

**తా :** వ్యష్టి, సమష్టులనగా, కార్యకారణములు, సమష్టి కారణరూపము, వ్యష్టికార్యరూపము, కార్యకారణములకు పోలికలుండును. వ్యష్టిస్వభావమును బట్టి సమష్టి స్వభావమును గుర్తించుదుము. శిష్యునకు విషయము సులభముగా తెలియుటకై ప్రకాశమునందు పురుషత్వమును, విమర్శయందు స్త్రీత్వమును ఆరోపించి మిథునముగా స్వీకరించి, మనబోంట్ల

సృష్టివలెనే ప్రపంచసృష్టికలుగునని ప్రపంచకారణమైన కామకలాస్వరూపము ప్రకాశ విమర్శరూపమైన సమష్టి మిథునము వలన పుట్టినట్లు చెప్పబడుచున్నది. స్ఫురణ ప్రకాశ మిథునాత్మకమైన తురీయబిందుస్వరూపమగు బ్రహ్మ ప్రపంచమును సృష్టింపవలయునను కోరికచే తనయందున్న స్ఫురణశక్తికి నభిముఖమై బిందుస్వరూపము ప్రవేశించెను. అది సోమాత్మకమైన శుక్లబిందుస్వరూపము. ఇది శుక్లబిందుస్వరూపము. ఇది ప్రకాశము యొక్క అంశము. పూర్ణస్వరూపమునకు ప్రవేశము అసంభవమగుటవలన **అ** కారరూపమైన ప్రకాశముయొక్క ఏకదేశమునకే **ప్రవేశ**మని చెప్పవలయును. **హ** కారాత్మికయైన స్ఫురణశక్తి అగ్నిరూపమైన రక్తబిందుస్వరూపముచే తనకభిముఖమై ప్రవేశించిన శుక్లబిందువునందు తాను ప్రవేశించెను. స్ఫురణశక్తి కిన్ని పూర్ణరూపమున ప్రవేశమసంభవమగుటవలన అంశరూపముననే ప్రవేశించినదని చెప్పవలయును. స్ఫురణ ప్రకాశములు కూటస్థరూపములు శాశ్వతములగుట వలన వాని స్వరూపమునకు భంగముకాని పూర్ణప్రవేశముగాని లేదు.

ఇచ్చట ప్రకాశమునకు ప్రపంచము సృష్టించవలయునను కోరిక తనయందు సంపూతమై యుండి సృష్టింప బడబోవు జీవుల ప్రారబ్దమువలన కలుగుచున్నది. అనగా సృజ్యమానమగు ప్రపంచప్రారబ్ధకర్మవశమున నిస్పందమగు ప్రకాశవిమర్శ ఆత్మకు కూటస్థతత్వమున ప్రథమ స్పందమేర్పడినదని భావము. ఇది ప్రపంచకారణబీజమైన బ్రహ్మయొక్క పరిచ్ఛిన్నరూపము. ఇట్టి సంకల్పమునే శ్రుతులు, "**సోఽకామయత బహు స్యాం ప్రజాయేయేతి । స ఈక్షత**" ఈ మున్నగు వాక్యములచే చెప్పినవి.

ఇచ్చట కలిగిన బిందుభావము **సోమబిందు** రూపమని శాస్త్రములు చెప్పుచున్నవి. ఇది బ్రహ్మయొక్క సర్వాధారత్వరూపము. ఇట్టి సోమబిందువును స్ఫురణశక్తి అగ్ని బిందురూపమున ప్రవేశించుట యనగా ప్రకాశముయొక్క అస్తిత్వమును స్ఫురింపజేయుటయే, జగద్రూపమున స్ఫురించునది బ్రహ్మగతమైన స్ఫురణశక్తియే, జగద్రూపమున బహుభవనమై స్ఫురించుట శక్తిగతమైన కర్తృత్వ స్వభావము. ఈ స్వభావము బ్రహ్మ కంటె వేరుగానందున జగత్ కర్తృత్వము బ్రహ్మకును చెప్పబడినది. జగత్తునిట్లు సృష్టించి ప్రకాశింపచేయుటవలన, సర్వాంతర్యామిత్వము, శక్తిగతమైన ధర్మము ఏకరూపమైన ప్రకాశవిమర్శలు రూపాంతరము నందు ధర్మభేదమున, భిన్నరూపములుగా గోచరించుచున్నవి. ఈ విమర్శను బట్టి సర్వాధారము బ్రహ్మ, సర్వాంతర్యామి, శక్తియని తేలినది. ప్రథమస్ఫురణము శక్తిది. శక్తిద్వారా ప్రకాశము గుర్తింపబడుటవలన, ద్వితీయస్ఫూర్తి బ్రహ్మది. అందువలన ప్రపంచము **అగ్నీషోమాత్మక**మని చెప్పబడుచున్నది.

ఈ విధమున అవ్యక్త **అ** కార **హ** కారాత్మకమైన, కూటస్థపరబ్రహ్మమునందు సృష్టి

సంకల్పవశమున పరస్పరము, అభిముఖము, అనురాగము కలుగగా రక్త శుక్ల బిందు-స్వరూపమున పరిచ్ఛిన్నమైన ప్రసరణము కలిగి మిశ్రమై అవ్యక్తమున వ్యవహరింప బడుచున్నది. ఇంతవరకు చెప్పబడిన క్రియ అంతయు అనిర్వచనీయమైన స్వరూపమున గలుగుట వలన, అనిర్వచనీయమైనది. అనుభవైకవేద్యమునై యున్నది. ఈ మిశ్రబిందువున్న **అ** కార **హ**కారముల అంశమగుటవలన **అ** కార **హ** కారాత్మకమే కాని యిందున్న **అ** కార **హ** కారములు కూటస్థ స్వరూపమువలె అవ్యక్తములు గావు. ఇవి సృష్టికి ఉన్ముఖములై యున్నందు వలన మున్ముందు సృష్టికాలమునందువలె వ్యక్తములు కావు. స్ఫుటము కానందున నిందువలన మిశ్రబిందు స్వరూపము వ్యక్తాఽవ్యక్తమైనది. ఇందు అ కారమునకు ప్రాధాన్యము. హ కారాత్మక ప్రపంచమునకు స్ఫూర్తిలేకపోవుట వలన, ఈ వ్యక్తాఽవ్యక్త **అ** కార **హ** కారాత్మక మిశ్రబిందువే **పరా**వాక్కనియు చెప్పబడుచున్నది. సామాన్యముగా బిందువని వ్యవహరింప బడుచున్నది.

**అవ :** ఇక, ఈ మిశ్రబిందు స్వరూపము, దాని నుండి విసర్గోత్పత్తియు చెప్పబడును.

**శ్లో॥ ఏతద్బిందుద్వితయం విసర్గసంజ్ఞం హకారచైతన్యమ్ ।**
**మిశ్రస్తు తత్సమష్టిః కామాఖ్యో రవిరకారచైతన్యమ్ ॥ 18**

ఏతత్ = ఈ, పూర్వశ్లోకమున చెప్పబడిన, అగ్నీషోమాత్మకమైన, (పిండ) బిందుద్వితయమ్ = రెండు బిందువులు, విసర్గ సంజ్ఞమ్ = విసర్గ అను పేరుగలవి, హకార చైతన్యమ్ = హకార ప్రాధాన్యమైనది. అనగా శక్తి ప్రధానమైనది, తత్సమష్టిః = అగ్నీషోమాత్మక బిందుద్వయమునకు సమష్టియైన, మిశ్రస్తు = మిశ్రబిందువైతే, కామాఖ్యః = కామబిందువని, రవిః = సూర్యబిందువని, అకారచైతన్యమ్ = అకార ప్రధానమైనది.

**తా :** లోకమున మొలక మొలచుటకు ముందు నేలలో ఉంచబడిన బీజము విభాగములేక ఏకరూపమై యుండును. అది నీటిచేత తడపబడి యుబ్బును. క్రమముగా రెండు సమ-భాగములుగా విభాగమగును. మధ్యన మొలక మొలచును. ఇట్లే పూర్వశ్లోకమున చెప్పబడిన మిశ్రబిందు స్వరూపమైన తత్త్వము తనలో సంహారకాలమున స్వరూపమై యున్న సృజింపబడబోవు జీవుల ప్రారబ్ధకర్మమనెడి నీటిచేత తడిసి ఉబ్బును. అనగా బహిర్ముఖమగును. అది రెండు సమభాగములుగా విభాగమగును. అందొకటి సోమబిందు ప్రధానము. మరొకటి అగ్నిబిందుప్రధానమై యుండును. విభాగమైన రెండు బిందువులు కన్పించుట వలన విసర్గమని వ్యవహరింపదగియుండును. మిశ్ర స్వరూపమే అగ్నీ, షోమబిందు స్వరూపముచే విభక్తము పొందుటవలన విసర్గమని చెప్పబడుచున్నది. ఆ రెండు బిందువుల మధ్య నుండి **హార్దకల**యనెడి పదార్థము సంభవించుచున్నది. అదియే జగదంకురము. దాని నుండి త్రిపుటి మున్నగు

జగత్తు కలుగును. ఈ హార్దకలాస్వరూపమే పరమరహస్యమగుట వలన గుర్వనుగ్రహమునకు పాత్రులై తెలిసి కొనవలయును.

ఈ విసర్గస్థితి యందు హకారాత్మకమైన ప్రపంచము అకారము కంటె బహిర్భూతమగుట వలన విసర్గ హ కార ప్రధానమై హ కారమని వ్యవహరింపబడుచున్నది.

మిశ్రబిందువు, అగ్నీషోమాత్మక బిందుద్వయము యొక్క సమష్టి, అగ్ని సోముడు అను వీరిద్దరి యొక్క ప్రకాశము సూర్యప్రకాశాధీనమని శాస్త్రము లోకానుభవమున్ను చాటుచున్నది. ఈ మిశ్రబిందువు ప్రాణికర్మవశమున తురీయ బిందురూపమైన పరబ్రహ్మమునందు ప్రథమ స్పందనమువలన ఏర్పడిన దగుటచే శివశక్తులకు విభాగమేర్పడక పోవుటచేతను, బహిర్ముఖ మైనను అంతఃస్థితమైన శివశక్తుల సామరస్యమగుటచే అ కార ప్రధానమై అకారమనియే వ్యవహరింపబడుచున్నది.

అనగా **కూటస్థమైన తురీయ బిందు స్వరూపమైన పరబ్రహ్మ నుండి మిశ్రబిందువు, విసర్గ, హార్దకళ, అను మూడవయవములు గల ప్రపంచకారణమైన అహంపదవాచ్యమైన తత్త్వవిశేషము పుట్టినదని తాత్పర్యము.**

ఈ స్వరూపవిశేషము శిష్యపరంపరాప్రాప్తమై స్వాత్మ గౌణాత్మ సర్వస్వ ప్రధాన సంపాదిత గుర్వనుగ్రహమాత్రలభ్యమై వెలుగొందుచున్నది.

**శ్లో॥ ఏషాఽహంపదతుర్యస్వరకామకలాదిశబ్దనిర్దేశ్యా।**
**వాగర్థసృష్టిబీజం తేనాహంతామయం విశ్వమ్ ॥ 19**

ఏషా = బిందు, విసర్గాత్మకమైన ఈ త్రిపురసుందరి, అహంపద = అహం అను పదముచేత, తురీయ-స్వర = ఈకారముచేత, కామకలా = కామకలా అనెడి, ఆది = మొదలగు, శబ్ద = శబ్దములచేత, నిర్దేశ్యా = చెప్పతగినది. వాగర్థ సృష్టి బీజమ్ = నామరూపాత్మక ప్రపంచమునకు కారణమైనది, తేన = ఆ కారణముచేత, విశ్వమ్ = ప్రపంచము, అహంతామయమ్ = అహం పదస్వరూపమే.

**తా :** అకారము వర్ణసమామ్నాయమునందు ప్రథమాక్షరము. **హ**కారము తుది అక్షరము. ఈ రెంటిని ప్రత్యాహారన్యాయమున కలిపినచో, అహం అను పదమేర్పడినది. ఈ పదముచే అకార హకారముల మధ్య నున్న వర్ణములన్నియు గ్రహింపబడును. సృష్టికి ముందుగ నేర్పడిన **అ** కార **హ** కారాత్మకమైన మిశ్రబిందువు **అహం పద వాచ్యము**. దాని అవయవములు అకార హకారములు. ఆ రెంటి మధ్య వర్ణములకు విసర్గ రూపమున విభాగమేర్పడగా, ఆ రెంటి మధ్య హార్దకలారూపమైన మాతృకయొక్క ఉత్పత్తి కలిగినది. బిందు విసర్గ

హార్దకలాత్మకమైన ఈ పరాశక్తి అహమ్ పదవాచ్యమై జగత్కారణమైనది. ఆ మాతృకయందలి వర్ణముల పరస్పర మేళనముచే శబ్ద అర్థ సృష్టులేర్పడినవి. అందువలన అహం పదవాచ్యమైన పరాశక్తియే వాగర్థరూపమైన సృష్టికి కారణము. అందువలన శబ్దార్థరూపమైన ప్రపంచము అహం పద స్వరూపమే. అనగా అహంతామయము. కార్యకారణము లభేదములగుటవలన ఈ సమన్వయమిట్లు చెప్పబడినది. ళకారము ల కారస్వరూపమే యగుట వలన క్ష కారము క కార ష కార సంయుక్తాక్షరమగుటవలన దానిని మాతృకలో వేరుగా గ్రహింపలేదు. ఈ కారము బిందు విసర్గ హార్దకలాస్వరూపమగుటచే ఈ కారణము చేతను జగత్కారణమైన ఈ తత్త్వము చెప్పబడును. సృష్టి కామనచే ఏర్పడిన **కామబిందువు, విసర్గ, హార్దకల**, అను మూడు పదములలోని కామకలా అను పదములను ప్రత్యాహార న్యాయమున నుచ్చరింపగా **కామకలా** అనుపదమేర్పడినది. పూర్వమున చెప్పబడిన విషయ విమర్శననుసరించి ఈ కామకలా స్వరూపమంతయు జగత్కారణమై వెలుగొందుచున్నదని స్పష్టము. అందువలన కామకలాశబ్దము చేతను జగద్బీజమగుతత్త్వము చెప్పబడుచున్నది.

**అవ :** శబ్దసృష్టి యంతయు **పంచదశీమంత్రస్వరూపమే**. మంత్రము కంటే వేరుకాదు. అర్థసృష్టి యంతయు శివాది పృథివ్యంతషట్త్రింశత్తత్త్వాత్మకమైనది. మిశ్రబింద్వాత్మక అహంపదము దీనికి బీజము. విసర్గ రూపమున విభక్తమైన అహంపదము రెండు దళములు గలది. మాతృక ఆ రెండు దళములమధ్య నుండి పుట్టినది అంకురము. ఆ అంకురము నుండి శబ్దార్థ సమూహరూపమైన శాఖా, పత్ర, పుష్ప, ఫలాది భేదముచే గొప్ప ప్రపంచ వృక్షము పుట్టినది. వృక్షము నంతట బీజము అనువర్తించి యుండుట అనుభవసిద్ధమైన విషయమై యున్నది. అట్లే నామరూపాత్మకమైన ప్రపంచమనెడి వృక్షమున బీజగతమైన అకార హకార వృత్తి భావింపబడినది. అదెట్లనగా అర్థ ప్రపంచమున అకార, హకార, భావనము, గురుముఖవేద్యము. శబ్దప్రపంచసారమైన పంచదశీ మంత్రమున అకార, హకార భావనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ అంత్యప్రథమే మధ్యచతుర్థే మంత్రేఽపి తౌ వ్యక్తౌ ।**
**తేనాంబామనుజగతామభేద ఏవాత్ర భావార్థః ॥ 20**

మంత్రే అపి = పంచదశీమంత్రమునందును, అన్త్యప్రథమే = తృతీయకూట ప్రథమాక్షరమైన స కారమునందు, మధ్యచతుర్థే = మధ్యకూటముయొక్క నాల్గవ యక్షరమైన హ కారము నందు, తౌ = ఆ అకార హకారములు, వ్యక్తౌ = స్పష్టమై యున్నవి. తేన = ఆ కారణముచేత, అంబామనుజగతామ్ = పరదేవతకు, మంత్రమునకు, ప్రపంచమునకు, అభేదః ఏవ = అభేదమే, అత్ర = ఈ పంచదశీమంత్రమునందు, భావార్థః = భావార్థమనుపేరుగలది.

**తా :** ఈ పంచదశీమంత్రముయొక్క మూడవకూటముయొక్క ప్రథమాక్షరమైన సకారము నందు, అకార చైతన్యమును భావింపవలసినది. రెండవ కూటము నాల్గవ అక్షరమైన హకారమునందు హకార చైతన్యము భావింపవలసినది. అనగా ఈ హకారము మూడవ కూటము యొక్క మొదట చేర్చుట పూర్వము చెప్పబడినది. ఈ హకార సకారముల యందు శివశక్తి భావము భావార్థమని తాత్పర్యము. కామబింద్వాది హార్ధకలాంత స్వరూపమునకు ప్రత్యాహార న్యాయమున **కామకల** యని పేరు కలిగినదని పూర్వము చెప్పబడినది. అట్టి **కామకలాస్వరూపమైన పరదేవతకు, పంచదశీమంత్రమునకు, జగత్తునకు, అభేదభావము భావార్థమని** తేలిన సారాంశము. మూటికి అభేదమనుటలో సందేహము లేదు. ఈ భావార్థ విషయమున శ్రుతి, స్మృతి, యుక్తి, అనుభవముల విస్తారము భాస్కరరాయ వ్యాఖ్యానమున చూడదగినది

## 3. సంప్రదాయార్థము

**అవ :** ఇక సంప్రదాయార్థము చెప్పుచున్నాడు.

**శ్లో॥ వ్యోమాదిజనకహకరసలార్ణైర్ఘటనేన పంచభూతమయీ ।**
**పంచచతుస్త్రిద్వ్యేకగశబ్దాదిగుణాత్మపంచదశవర్ణా ॥ 21**

వ్యోమాది జనక = ఆకాశము మున్నగు వాటిని పుట్టించిన, హకరసలార్ణైః = హకార, కకార, రేఫ, సకార, లకారములనెడి అక్షరములచేత, ఘటనేన = కూడియుండుటచే, పంచభూతమయీ = పంచభూతముల స్వరూపమైనది, పంచ = ఐదు, చతుః = నాలుగు, త్రి = మూడు, ద్వి = రెండు, ఏక = ఒక్కొక్క, శబ్దాది గుణాత్మ = శబ్దము, మొదలగు గుణస్వరూపమైన, పంచదశవర్ణా = పదునైదు అక్షరములు గలది.

**తా :** పంచదశీమంత్రమునందున్న హకార, కకార, రేఫ, సకార, లకారములు ఆకాశ, వాయు, అగ్ని, జల, భూములనెడి పంచభూతములకు జనకములు. అట్టి పాంచభౌతిక అక్షరములచే కూడియుండుటచే ఈ పంచదశీ మంత్రము, పంచభూతాత్మకమైనది.

"శ్లో॥ హకారాద్వ్యోమ సంభూతం కకారాత్తు ప్రభంజనః ।
రేఫాదగ్నిస్సకారాచ్చ జలతత్త్వసముద్భవః ।
లకారాత్పృథివీ జాతా తస్మాద్విశ్వమయీ చ సా ॥"

అను మంత్ర వచన ప్రమాణముననుసరించి హకారము నుండి ఆకాశము, క కారమునుండి వాయువు, రేఫ నుండి అగ్ని, స కారమునుండి జలము, ల కారమునుండి పృథివీ పుట్టినదని

అందువలన ఈ అక్షరములుగల పంచదశీమంత్రము విశ్వమయమనియు తెలియుచున్నది. ఇందు గమనింపదగిన విషయము, అక్షరముల నుండి భూతములు పుట్టుట యనునది. ఈ ప్రకారము, ఐదు అక్షరములచే మంత్రము పంచభూతమయమని తేలినది. కాగా మిగిలిన అక్షరముల గతి ఏమని సందేహము కలుగుచున్నది. అందులకు సమాధానము "పంచచతు–స్త్రిద్వ్యేకగః" అను శ్లోకార్థముచే చెప్పబడుచన్నది. ఈ పంచభూతముల వరుస ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి యని ఆకాశగుణమైన శబ్దము కారణగుణము కార్యమున సంక్రమించుననుట లోకశాస్త్రప్రసిద్ధము. ఇందువలన ఆకాశగుణము దాని కార్యములైన వాయు అగ్ని జల భూతములందును కలదు. కాగా శబ్దము, ఐదు విధములైనవి. అట్లే వాయువుయొక్క గుణమైన స్పర్శము వాయువునందు, తత్కార్యములైన అగ్నిజల–భూములందును కలదు. ఇట్లు స్పర్శము నాల్గు విధములు, అట్లే రూపము అగ్నియందు తత్కార్యములైన జలభూములందు మూడు విధములై యున్నది. జలగుణమైన రసము జలమునందు తత్కార్యమైన పృథివియందు రెండు విధములై యున్నది. గంధము పృథివి యందొకటియే. ఈ గుణములు కారణమందు స్థూలముగను, కార్యమునందు సూక్ష్మముగను నున్నవి. ఈ స్థూల సూక్ష్మ భేదములుగ నున్న గుణములన్నియు కలసి పదునైదు గనైనవి. ఈ విధముగ పదునైదక్షరములు భూతగుణములైన పదునైదింటిని చెప్పును. ఇందువలన పంచదశీమంత్రము పంచభూతగుణాత్మకమైన పంచదశాక్షర స్వరూపమైనది.

**అవ :** ప్రథమాంశమున ఏబది ఎనిమిది అక్షరములు మంత్రమున గలవని ప్రతిపాదింప బడినది. ఇచ్చట ముప్పది ఏడక్షరములలో ఏబది ఎనిమిది, అక్షరములను అంతర్భవింపజేసి ఆ ముప్పదిఏడక్షరములలో పదునైదక్షరములకు పంచదశగుణస్వరూపమును, మిగిలిన అక్షరముల యొక్క అర్థమును విభజించి నిరూపించబడుచున్నది.

**శ్లో॥ తత్తజ్జనకైర్వర్ణైస్తత్తత్సంఖ్యైస్తు తద్గుణా జాతాః ।**
**కామకలాభిశ్చతసృభిరాసీత్స్పర్శశ్చతుర్విధో న తు కైః ॥ 22**

తత్తజ్జనకైః = ఆకాశాది ఆ యా భూతములను పుట్టించిన, తత్తత్సంఖ్యైః = ఆ యా సంఖ్యగల, వర్ణైః = అక్షరములచేత, తద్గుణాః = ఆకాశాది గుణములు, జాతాః = పుట్టినవి, చతసృభిః = నాలుగైన, కామకలాభిః = ఈ కారములచే, చతుర్విధాః = నాలుగు విధములైన, స్పర్శః = స్పర్శ, ఆసీత్ = కలిగినది, తు = కాని, కైః = కకారములచేత, న = పుట్టుట లేదు.

**తా :** మంత్రమున గల ఆకాశమును చెప్పునట్టి "హ" కారములై దింటిచే, ఐదు విధములైన శబ్దములు పుట్టినవి. ఇట్లే పైన చెప్పబడిన విధమున నాయా గుణముల సంఖ్యకు కలిగినట్లున్న అక్షర (వర్ణ)ములచే ఆ యా గుణములు పుట్టినవి. ఎట్లనగా "హ్రీం" కారము లందున్న

మూడు హకారములు, ద్వితీయ కూటమునందున్న హకారములు రెండు కలిసి హకారములు ఐదు, ఈ ఐదు హకారములవలన కారణగుణమైన స్థూలశబ్దము, కార్యగుణములైన సూక్ష్మశబ్దములు నాలుగు మొత్తము ఐదు విధములైన శబ్దగుణములు పుట్టినవి. జన్యజనకములకు అబేధమగుటవలన తజ్జనకమైన అక్షరము తజ్జన్యమైన గుణమునకు వాచకమగును. ఇట్లు వాచ్యవాచకములకబేధము. "**భవేద్గుణవతాం బీజం గుణానామపి వాచకమ్**" అను శాస్త్రము దీనికి ప్రమాణము.

ఈ విధముగ క కారములు నాల్గు విధములైన స్పర్శ గుణమును చెప్పుట సిద్ధింపదు. మంత్రమున మూడే కకారములు ఉండుట కారణము. మూడు "హ్రీం" కారములందుగల "ఈ" కారములు మూడు, మంత్రమున మూడవ యక్షరమైన "ఈ" కారము ఒకటి కలసి నాలుగు "ఈ" కారముల వలన నాలుగు విధములైన స్పర్శము పుట్టినది.

కకారములకు వేరర్థము చెప్పబడును. క కారము వాయు వాచకములనుట సామాన్య శాస్త్ర వచనము. ఈ మంత్రమున ఈ కారములచే వాయుగుణమగు స్పర్శము చెప్పబడుననుట విశేషవచనము. ఇందుకు ప్రమాణము

"**మహామాయాత్రయేణాపి కారణేన చ బిందునా ।**
**వాయ్వగ్నిజలభూమీనాం స్పర్శానాం చ చతుష్టయమ్ ।**
**ఉత్పన్నం భావయేద్దేవి స్థూలసూక్ష్మవిభేదతః**" అని తంత్ర వచనము.

హ్రీం కారములందున్న మూడు రేఫలు అగ్ని, జల, భూములందుగల రూపత్రయమును చెప్పును. రెండు స కారములు జలభూములందు గల రసములకు వాచకములు.

**శ్లో॥ భువనత్రయసమ్బన్ధాదాసీత్త్రేధా లకారోఽపి ।**
**యే యే యద్వ్యఞ్జకాస్తేషాం తేషాం త ఏవార్థాః ॥** 23

భువనత్రయసంబంధాత్ = ముల్లోకములకు సంబంధముండుటవలన, లకారః అపి = లకారమున్ను, త్రేధా = మూడు విధములుగా, ఆసీత్ = ఉండెను. యే యే = ఏయే వర్ణములు, యద్వ్యఞ్జకాః = ఏ వస్తువులు పుట్టుటకు కారణములగునో, తేషాం తేషామ్ = ఆ యా వస్తు జనకములైన వర్ణములకు, తే ఏవ = ఆ జన్యములైన వస్తువులే, అర్థాః= అర్థములు.

**తా :** ముల్లోకములు పృథివీమయములే యగుటవలన, పృథివీ బీజములైన మూడు ల కారములు, మూడు విధములైన పృథివికి వాచకములగును. ఏ యే అక్షరము లేయే భూతములకు గుణములకు జనకములో ఆ యా అక్షరములకు ఆ యా భూతగుణములే

అర్థములు, ఏ యే వర్ణవస్తువులకు జన్యజనకభావముగలదో వానికి వాచ్యవాచకభావమున్ను కలదని తాత్పర్యము.

**అవ :** ఇక మిగిలిన వర్ణముల కర్థము క్రమముగ చెప్పబడుచున్నది.

**శ్లో॥ కకారత్రయవాచ్యాస్తు సకలాః ప్రలయాకలాః ।**
**విజ్ఞానకేవలాశ్చేతి త్రిప్రకారా ఉపాసకాః ॥ 24**

కకారత్రయ–వాచ్యాస్తు = మూడు కకారములచే చెప్పబడువారైతే, సకలాః = సకలలు ప్రారంభకులు, ప్రలయాకలాః = ప్రళయాకలలు సాధకులు, విజ్ఞానకేవలాశ్చ = విజ్ఞాన కేవలులున్ను సిద్ధులు, ఇతి = అని, త్రిప్రకారాః = మూడు విధములైన, ఉపాసకాః = ఉపాసకులు.

**తా :** దేవతయొక్క రూపములు మూడు. స్థూలము, సూక్ష్మము, పరము అనెడివి. అందు ఆ యా ధ్యానశ్లోకము లందు చెప్పబడిన దేవతలయొక్క స్థూలరూపమును భేదదృష్టితో ఉపాసించువారు, అనగా కేవల పూజాదికర్మలయందే ఆసక్తి చూపు వారు **సకలలు** అని చెప్పబడుదురు. మంత్రయంత్రాత్మకమైన సూక్ష్మరూపము నుపాసించువారు అనగా కర్మ, జ్ఞాన కాండముల రెంటియందు ఆసక్తి చూపువారు, భేదాభేదదృష్టిగలవారు **ప్రలయాకలలు** అనబడుదురు. వీరు భేదదృష్టిచే నిర్వహింపదగిన కర్మకాండననుష్ఠించుచున్నను, తత్త్వవిమర్శ యందు ఆసక్తి చూపుచూ అభేదదర్శనమును సాధింప యత్నించుదురు. ఇట్లు విజ్ఞానసంపాదనకై ప్రయత్నించు వీరి దృష్టి భేదాభేదమిశ్రమమై యుండును. ఇక విజ్ఞాన కేవలులు ఉత్తమోపాసకులు. భేదదర్శనమును పరిత్యజించి, పరదేవతయొక్క పరరూపమును తత్త్వమున విమర్శించి, ఆత్మస్వరూపమును గుర్తెరిగి దేవతా పరరూపాత్మకమైన స్వాత్మానంద పరాయణులై సర్వత్ర శివదృష్టి గలిగిన పూర్ణజ్ఞానులు, **విజ్ఞానకేవలులు** అనబడుదురు. ఇట్టి యుపాసకులు క్రమముగా మూడు కూటములందు గల కకారములచే చెప్పబడుదురు.

**శ్లో॥ అకారైర్దశసంఖ్యాకైరుచ్యంతే జీవరాశయః ।**
**విద్యాయాః ప్రాణభూతస్సంస్తద్వాచ్యేకాదశస్స్వరః ॥ 25**

దశసంఖ్యాకైః = పది సంఖ్యలుగల, అకారైః = అకారములచేత, జీవరాశయః = జీవసమూహములు, ఉచ్యన్తే = చెప్పబడుచున్నవి. ఏకాదశః = పదకొండవదైన, స్వరః = అచ్చైన ఏ కారము, విద్యాయాః = విద్యకు, ప్రాణభూతస్సన్ = ప్రాణమైనదై, తద్వాచీ = ప్రాణవాచకము, భవతి = అగుచున్నది.

**తా :** పంచదశీ మంత్రమున మూడు హ్రీంకారములు, రెండవ, మూడవ వర్ణములను విడిచి

ఇతరములైన పది వర్ణములయందు అకారములు గలవు. ఆ పదియకారములచే జీవరాసులు చెప్పబడుచున్నవి. దశ శబ్దమునకు అనంతమనియు నర్థముండుటచే అనంతమైన జీవులను చెప్పుట సంభవించినది. అకారములేని కేవల వ్యంజనాక్షరములు మాత్రమే భూత గుణ వాచకములైనవి.

సూత్రాత్మయైన సమష్టి ప్రాణము ప్రపంచమునందంతటను, అనుగతమై యున్నది. వ్యష్టి స్వరూపమైన ప్రాణవాయువు శరీరము నందంతటను, అనుగతమై యున్నది. అయినను సమష్టి ప్రాణమైన సూత్రాత్మ సూర్యుని యందు అభివ్యక్తమగుచున్నది. వ్యష్టియైన ప్రాణవాయువు గూడా హృదయమున విశేషముగా అభివ్యక్తమగుచున్నది. అట్లే ప్రాణవాచకమైన, ఏకారము మంత్రము నందంతట అనుగతమై యుండియు మంత్రముయొక్క రెండవ అక్షరమున విశేషాకారమున అభివ్యక్తమై యుండుట వలన ఏ కారము ప్రాణవాచకము, ఇందుకు

"**శ్రీ కంఠదశకం తద్వదవ్యక్తస్య హి వాచకమ్ ।**

**ప్రాణభూతః స్థితో దేవి తద్వదేకాదశః స్వరః ।**
**ఏకః సన్నేవ పురుషో బహుధా జాయతే హి సః ॥** " అను వచనము ప్రమాణము.

**శ్లో॥ బిందుభిస్త్రిభిరుచ్యంతే రుద్రేశ్వరసదాశివాః ।**
**శాంతిశ్శక్తిశ్చ శమ్భుశ్చ నాదత్రితయబోధనాః ॥** **26**

త్రిభిః బిందుభిః = మూడు బిందువులచే, రుద్రేశ్వరసదాశివాః = రుద్రుడు, ఈశ్వరుడు, సదాశివుడు, ఉచ్యన్తే = చెప్పబడుచున్నారు, శాన్తిః = ప్రకృతి విద్యాత్మకమైన తత్వము, శక్తిః = శక్తి, శంభుః చ = శివుడున్ను, నాదత్రితయబోధనాః = మూడు కూటములందలి నాదములచే చెప్పబడుదురు. మూడూ కూటములందున్న మూడు బిందువులు రుద్ర, ఈశ్వర, సదాశివ తత్త్వములను చెప్పును. రుద్రశబ్దమునకు మాయ, కల, అవిద్య, రాగ, కాల, నియతి, పురుష అనెడి ఏడు తత్త్వములు అర్థము. పురుషాది మాయాంతముగల తత్వసప్తకమునకు తేజస్తత్త్వమని సంజ్ఞ గలదు. "**రుద్రో వా ఏష యదగ్నిః**" అను శ్రుతిచే రుద్రశబ్దము తేజస్తత్త్వమును చెప్పును. అట్టి రుద్రుడు, ఈశ్వరుడు, సదాశివుడు అను ముప్వురు క్రమముగా మూడు బిందువులచే చెప్పబడుదురు. మూడు కూటములందున్న మూడు నాదములచే శాంతి, శక్తి, శంభు తత్వములు చెప్పబడును. **శాంతి**యనగా, ప్రకృతి, శుద్ధవిద్యా యనెడి రెండు తత్వములు కలిసిన సమూహమునకు పేరు. **నాద**మనగా అర్ధచంద్ర, రోధిని, నాద, నాదాంత, శక్తి, వ్యాపిక, సమన, ఉన్మని అను ఎనిమిది కలసిన సమూహతత్వమునకు నాదమని పేరు.

శ్లోకమునందలి వివరణ మఱియు బిందుభిస్త్రిభిః = మాయాబీజమైన హ్రీంకారము

నందుగల మూడు బిందువులచే రుద్ర, ఈశ్వర, సదాశివ అను ముప్వురు చెప్పబడుదురు అని అర్థము. ఇందు రుద్రుడు అనగా అగ్ని "**రుద్రో వా ఏష యదగ్నిః**" అను శ్రుతిచే రుద్రశబ్దమునకు అగ్ని అని అర్థము. అగ్నిమయ ప్రపంచము, స్వప్న ప్రపంచము, "**పురుషాధిక-మాయాంతం తేజస్తత్వం మహేశ్వరి**" అను స్వచ్ఛంద తంత్రవచనము, పురుషుడు మొదలు, ఆరోహక్రమమున మాయాతత్త్వము వరకు గల 7 తత్త్వములను చెప్పినది. ఇందుగల మాయాపురుషతత్త్వములు రెండు, క్రమముగ జ్ఞానస్వప్నముల మధ్యస్థితి – మాయా స్వప్నజాగ్రద్ మధ్యస్థితి కలది. పురుషతత్త్వము – జీవుని భేద ప్రపంచముచే బాధించునది. (ఏడిపించునది) కనుక దీనికి రుద్రుడు అను సార్థక నామము కలిగినది. **రోదయతి ఇతి రుద్రః** అను వ్యుత్పత్తిచే ఈ అర్థము సిద్ధించినది.

"పాంక్తం వా ఇదం సర్వం" అను తైత్తిరీయోపనిషద్ వాక్యమును బట్టి సర్వదశలు – పంక్తిస్వరూపములు అనగా 5 తత్వములు గలవి. సంధి స్థితిగతమైన మాయాపురుషలను, ఇద్దరిని మినహాయించి కలా, అవిద్యా, రాగ, కాల, నియతి అయిదు స్వప్న ప్రపంచము, మానసికమైన ప్రపంచము – అనగా ప్రకృతి ప్రపంచము = ప్రకృతి, అహంకార, బుద్ధి, మనస్సులు, ప్రాకృత ప్రపంచము = 4, ఈ ప్రపంచమున మనస్సు పురుషస్థానమును ఆక్రమించినందున ప్రాకృత ప్రపంచ తత్వములు. స్థూలమున 4 కనిపించును. అనగా, మనస్సే అయిదవ స్థానమునాక్రమించినది. అందువలన నిదియు పాంక్తమే –

మాయను అతిక్రమించిన (దాటిన) మాయోత్తీర్ణమైన తత్త్వములు 5. శుద్ధవిద్య, ఈశ్వర, సదాశివ, శక్తి, పరశివ, తత్త్వములు. ఇవి జ్ఞాన భూమికలు, జ్ఞానమునకు భేదములేదు. అభేదస్థితి యందుండి భేదమును చూచువాడు ఈశ్వరుడు. భేదానుసంధానములేక, ఎల్లప్పుడు తనయొక్క శివతత్వమును భావించువాడు. సదాశివుడు వారియందు రుద్రునియందువలె భేదములు లేవు.

**శాంతి** అనగా, ప్రకృతి శుద్ధవిద్యాతత్వములు. రెంటియొక్క కలయిక అనగా, ప్రాకృత సంబంధమైన భేద ప్రపంచమును, అభిన్నమైన శుద్ధవిద్యగా వ్యవహరించు స్థితి. **శాంతి, శక్తి, శంభులు** (పరశివ) కేవలము అంతర్ముఖమైన జ్ఞానస్థితి అగుటచే అచట భేదము లేదు.

బిందుత్రయముచే, రుద్ర, ఈశ్వర, సదాశివులు క్రమముగా చెప్పబడుదురు. బిందుహీనమైన అష్టాత్మక నాదత్రయముచే క్రమముగా శాంతి, శక్తి, శంభులు చెప్పబడుదురు.

**శ్లో॥ ఏవం సప్తత్రింశత్సంఖ్యాకపదైర్మహావిద్యా ।**
**షట్త్రింశత్తత్త్వానాం తత్త్వాతీతస్య చాభిధాత్రీయమ్ ॥** 27

ఏవమ్ = ఈ విధముగా, ఇయమ్ = మనచే ఉపాసింపబడునట్టి, మహావిద్యా = ఈ పంచదశీ విద్య, సప్తత్రింశత్సంఖ్యాకపదైః = ముప్పదియేడు పదములచే, షట్త్రింశత్తత్త్వానామ్ = ముప్పదియారు తత్వములకును, తత్త్వాతీతస్య చ = తత్త్వములుకంటే వేరై పరమైన బ్రహ్మకు (ను) న్ను, అభిధాత్రీయమ్ = చెప్పునది.

**తా : పంచదశీమంత్రమునందు ముప్పది ఏడక్షరములు గలవు. హకారములైదు, ఈకారములు నాలుగు, రేఫలు మూడు, సకారములు రెండు, లకారములు మూడు, కకారములు మూడు, అకారములు పది, బిందువులు మూడు, నాదములు మూడు, ఏకారమొకటి కలిసి ముప్పదిఏడైనవి. ఇందు ముప్పది యారక్షరములు ముప్పది యారుతత్వములను, ఒకటి తత్త్వాతీతమైన బ్రహ్మను చెప్పును.**

ముప్పదియారువర్ణములు ముప్పదియారుతత్వములను వరుసగా చెప్పవలయునను నియమములేదు. అట్లైన పూర్వము చెప్పిన దానికి విరుద్ధమగును. మరేమన పంచభూతములను చెప్పునట్టి అక్షరములకే పంచభూతాత్మకమైన జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియ పంచకము, విషయపంచకము, భూతపంచకము అనెడి ఇరువది తత్వములు అర్థము. ఈ యిరువది పంచభూతాత్మకములను విషయము వేదాంతశాస్త్రమున స్పష్టముగా నిరూపింపబడినది. వేదాంతశాస్త్రమును చదివిన పిదప సమయదీక్షను పొందినవారికే ఈ శాస్త్రమున అధికార మగుటవలన సంవిచ్ఛాస్త్రవిషయము, (జ్ఞాన శాస్త్రవిషయము) ఇందు ప్రస్తావింపబడలేదు. ఉపాసకులను చెప్పునట్టి మూడు కకారములు, మనస్తత్వమును బోధించును. ఉపాసన మనః ప్రధానమగుటవలన మనస్తత్త్వమును బోధించుట న్యాయమే. ఉపాసన యనగా చిన్మయ దేవతాత్మ భావనావిశేషమున మనోగతవాసనాత్మక మాలిన్యమును తొలగించుటయే, అందువలన ఉపాసన మనఃప్రధానమైనది. జీవవాచకములైన పది అకారములు బుద్ధితత్త్వమును బోధించును. బుద్ధియందు ప్రతిఫలించిన చైతన్యమునకే జీవుడను వ్యవహారముండుటవలన జీవవాచకములైన అకారములు, బుద్ధితత్త్వమును బోధించుట సమ్మతమైన విషయము. ప్రాణవాచకమైన ఏకారము అహంకారతత్త్వమును బోధించును. అహంకారమే శరీరమునంతటను వ్యాపించి ప్రాణపదవాచ్యమైనది. శివ, శక్తి, శుద్ధవిద్య, ప్రకృతులు మూడు నాదములచే బోధింపబడుచున్నవి. మాయాది పురుషాంత తత్త్వసప్తకము, ఈశ్వరతత్త్వము, సదాశితత్త్వము, అను నీ తొమ్మిదియు మూడు బిందువులచే చెప్పబడుచున్నవి. ఈ విధముగ ముప్పది ఏడు పదములు, వ్యష్టిగ ముప్పది యారు తత్త్వములను, సమష్టిగ మంత్రమంతయు తత్త్వాతీతమైన బ్రహ్మను బోధించుచున్నదని ఈ శ్లోకతాత్పర్యము.

మంత్రమున అక్షరములు తత్త్వక్రమమున లేవుగదా అది ఎట్లు సంగతమగుననిచో దానికిట్లు

సమాధానము గలదు. సృష్టికాలముననే ప్రపంచముయొక్క స్థితికాలమున తత్త్వములకు క్రమనియమములేదను విషయము, అనుభవసిద్ధము.

మంత్రాక్షరములయందు ఈ తత్త్వసమన్వయము కొందరు మఱియొక విధమున చెప్పుదురు. ఆ వివరమంతయు భాస్కరరాయ వ్యాఖ్యానమున చూడనగును.

**"స్వరవ్యంజనభేదేన సప్తత్రింశత్ప్రభోదినీ ।**
**సప్తత్రింశత్ప్రభేదేన షట్త్రింశత్తత్వరూపిణీ ।**
**తత్త్వాతీతస్వభావా చ విద్యైషా భావ్యతే మయా" ॥**

అను శివవచనము పైన చెప్పబడిన సమన్వయమున కనుకూలమైయున్నది.

**శ్లో॥ జన్యజనకయోర్భేదాభావాద్వాచ్యస్య వాచకేనాపి ।**
**బ్రహ్మణి జగతో జగతి చ విద్యాఽభేదస్తు సమ్ప్రదాయార్థః ॥ 28**

జన్యజనకయోః = కార్యకారణములకు, భేదాఽభావాత్ = భేదములేకపోవుటవలన, వాచ్యస్య = శబ్దముచే చెప్పబడునట్టి అర్థమునకు, వాచకేనాపి = వాచకమైన శబ్దముతోను, భేదాఽభేదాత్ = భేదములేకపోవుటవలన, బ్రహ్మణి = బ్రహ్మయందు, జగతః = జగత్తునకు, జగతి = జగత్తునందు, విద్యాఽభేదః = విద్యకు అభేదమును, సంప్రదాయార్థః = సంప్రదాయార్థమని పేరు.

**తా :** మంత్రగతవర్ణములవలన పాంచభౌతికమైన ప్రపంచము పుట్టినట్టు పూర్వము చెప్పబడినది. మఱియు కామకలాస్వరూపమైన కారణబ్రహ్మనుండి జగత్తుపుట్టినదనియు, ప్రతిపాదింపబడినది. ఇందువలన కార్యకారణములైన జగద్బ్రహ్మలకు అభేదము, వాచ్యవాచకములైన విద్యాజగత్తుల కభేదమున్ను భావించుట సంప్రదాయార్థము.

పంచభూతవాచకములైన 15, అక్షరములు భూతములకు వాని గుణములైన, శబ్దస్పర్శ, రూప, రస, గంధములనే పంచతన్మాత్రలకు, పంచభూతాత్మకమైన, 5 జ్ఞాన, 5 కర్మేంద్రియములకు మొత్తం 10 తత్త్వములకు బోధకములు.

3 కకారములు : ఉపాసన ప్రధానమైన మనస్తత్త్వానికి ఒక అకారదశకము బుద్ధి ప్రతిబింబిత, చైతన్యాత్మకులగు అనంత జీవ వాచకమైనందున ఆ బుద్ధితత్వము ఒకదానికి ప్రాణము, కేశాదినఖపర్యంతమైన, సర్వశరీరవ్యాపకమైనందున, శరీరము అంతను వ్యాపించియున్న, అహంకారతత్వమునకు ఒకదానికి ప్రాణవాచకమైన ఏకారము బోధకము.

మూడు బిందువులలో రెండు బిందువులు ఈశ్వర సదాశివులకు, రెంటికిని మూడవ

బిందువు, ఒక పురుషాది = మాయాతత్వముగల, 7 తత్త్వములకు వాచకము అని వివరణ. మఱియు

3 నాదములలో 2 నాదములు శివశక్తి అను రెండు తత్త్వములకున్ను, మూడవ నాదము శుద్ధవిద్య, ప్రకృతి తత్వములకున్ను బోధకములు కాగా శివాది పృథివ్యంత 36 తత్వములకు పంచదశయందలి 5 హకారములు 4 ఈకారములు 3 రేఫలు 2 సకారములు 3 లకారములు, 3 కకారములు, 10 అకారములు, 3 బిందువులు, 3 నాదములు. ఒక ఏకారము, మొత్తము 37 అక్షరముల బోధకములై (వాచకము) నందున 37 అక్షరముల రూపమైనది **పంచదశీ-మంత్రము**.

షట్త్రింశత్తత్త్వరూపమైన దీన్ని, అనగా జగత్ రూపమైన దీన్ని, మంత్రముచే బోధింపబడు పరదేవతారూపమయినదీన్ని అగుచున్నది. ఇది సంప్రదాయార్థము.

## 4. నిగర్భార్థము

**అవ :** ఇక నిగర్భార్థము చెప్పబడుచున్నది.

**శ్లో॥ పరమశివే నిష్కలతా తదభిన్నత్వం స్వదేశికేంద్రస్య ।**
**తత్కరుణాతస్స్వస్మిన్నపి తదభేదో నిగర్భార్థః ॥** 29

పరమశివే = నిష్పందరూపమైన బ్రహ్మతత్త్వమునందు, నిష్కలతా = తదితర పదార్థములు లేకపోవుట, స్వదేశికేన్ద్రస్య = తన గురువునకు, తదభిన్నత్వమ్ = బ్రహ్మతో అభేదము, తత్కరుణాతః = గురుకరుణవలన, స్వస్మిన్నపి = తనయందును, తదభేదః = బ్రహ్మాభేదము, నిగర్భార్థః = నిగర్భార్థము.

**తా :** అవ్యక్త అకారహకారాత్మకముగా, నిరూపింపబడిన నిష్పందమైన బ్రహ్మయందు తదితర పదార్థము లేకుండుట ప్రథమకూటమునకు అర్థము. అట్టి నిష్పందబ్రహ్మకంటే వేరగు శివ జీవ సంసారమంతయు దుఃఖజనకమే. ఇతర పదార్థము స్ఫురించుచున్నంత వరకు దుఃఖమే. "**ద్వితీయాద్వై భయం భవతి**" రెండవ వస్తువువలన భయము కలుగుచున్న దని శ్రుతి చెప్పుచున్నది. **అద్వైతస్థితి** అభయస్థితి, ఇట్టి **అభయస్థితి ప్రథమకూటమునకు అర్థమ**ని సారాంశము. మఱియు

పరమశివే నిష్కలతా అను శ్లోకమున పరశివతత్వము నిర్విశేషము, నిర్వికల్పము, స్వయంప్రకాశ, నిత్యసుఖబోధాత్మకము. శివశక్తి సమరసాకార, అఖండ, సచ్చిదానంద లక్షణమును అయియున్నది.

"**తదభిన్నత్వం స్వదేశికేంద్రస్య**" పై చెప్పబడిన పరమశివాది స్వగురుపర్యంతము, క్రమగతితో, ఆ యా గురువుల పరిపూర్ణకటాక్షప్రసాదమహిమచే, తన గురువునందు కూడా, ఆ పరమశివస్వరూపధర్మము అవతరింపబడియుండుటచే స్వగురువు పరమశివుని కంటే వేరుకాదు. **తత్కరుణాతః స్వస్మిన్నపి తదభేదో నిగర్భార్థః.**

అట్టి పరమశివాభిన్నుడగు, స్వగురువును స్మాత్మత్రయ, నిర్వ్యాజ, సమర్పణ ప్రయు అనంతరితానన్యసేవాజనితసద్గురుకటాక్ష, ప్రసాదఫలితముగా తనుకూడా (శిష్యుడు) పరమశివాత్మక, అపరోక్ష నిష్కల పరబ్రహ్మానందానుభవస్వరూపుడై వెలయుట నిగర్భార్థము.

ఇట్టి బ్రహ్మతో తనగురువు అభిన్నుడు. అనగా భేదములేని వాడని భావించుట ద్వితీయకూటమునకర్థము. అనగా **అద్వైతబ్రహ్మతో గురువును అభేదముగా భావించుట**, ద్వితీయకూటమునకర్థము. పూజ్యపాదులగు గురువులు నిరంతరము స్వాత్మతో బ్రహ్మాఽభేదమును భావించుటచే ధృఢమైన ఆ భావనచేత బ్రహ్మాఽభేదము గురువునకు సిద్ధించినదని నిశ్చయబుద్ధిగల శిష్యుడు సంసారమునుండి తరించును.

పైన పేర్కొనిన గురువుల కరుణవలన తన యందు బ్రహ్మాఽభేదము సిద్ధించునని మూడవ–కూటమునకర్థము. బ్రహ్మవిద్య సంపాదనకు, గురుశుశ్రూషయే సాధనము. నిరంతరము అవిచ్ఛిన్నమై, దినదిన ప్రవర్ధమానమైన శుశ్రూషచే సంపాదింపబడిన అపరిమితమైన గురుకరుణావశమున తనయందేర్పడిన గురువుల జ్ఞానదృష్టి ప్రసారము వలన తనయందు బ్రహ్మాఽభేదము సిద్ధించును. అట్లు తనకు సిద్ధించిన నిష్కళపరశివాఽభేదమును భావించుట తృతీయకూటమున కర్థము. ఇట్లు మూడు కూటముల యర్థమును సమష్టిచే సమన్వయించినచో **శివ, గురు, ఆత్మలకు** ఐక్యభావము నిగర్భార్థమని సారాంశము.

**శ్రీనాథాది గురుపరంపరద్వారా తనయందు శివప్రవేశమువలనను, తనకు స్వగురు పరంపరద్వారా శివునియందు ప్రవేశమువలనను, ఈ అభేదము సిద్ధించుచున్నది. ఇట్టి అభేదమును శ్రీసద్గురుకటాక్షనిరీక్షణక్షణము మొదలు, తనకు బ్రహ్మాభేదసిద్ధికి సాధనమై వాచకమైన మంత్రమునందు భావించుటవలన ధృఢమైన అభేదసిద్ధికలుగును. ఈ అభేదార్థమే నిగర్భార్థమునకు ముఖ్యాభిప్రాయము.**

జీవునిచే అనేక జన్మలయందు చేయబడిన పుణ్యపరంపరవలన శ్రీసద్గురువు లభించును, సద్గురులాభము కలిగించిన ఈ పుణ్యము ఫలత్యాగపూర్వకమైన నిష్కామకర్మయోగమై యుండును. ఆ కర్మయోగమునందలి ఫలత్యాగము వైరాగ్యపూర్వకమై యుండును. వైరాగ్యము పార్థివములగు విషయములయందుగల నివృత్తి కళచే ఏర్పడును. ఆ నివృత్తి కళ చిదంశము.

అట్టి పుణ్యపరంపరచే, శుద్ధచిత్తవృత్తి గలిగిన జీవుడు తాను ఆత్మగా భావించిన శరీరేంద్రి-యాదులను, అహంకారమును, తనకు గౌణాత్మభావము గలిగిన (అనగా మమకారము (నాది) వలన కలిగిన) క్షేత్ర, పుత్ర, దారాఽఽరామాదులను గురువులకు సమర్పించి అహంకార, మమకార రహితమైన గురుచరణములయందు చూపవలయును, ఇట్టి భక్తిచే బ్రహ్మాఽఽభేదము సిద్ధించునని నిగర్భార్థము యొక్క తాత్పర్యము. ఇట్టి అభేదసిద్ధికి పరంపర కారణమైన ధర్మా(పుణ్యా)నుష్ఠానమునందే త్యాగమిమిడి యున్నది. ఆ త్యాగము గురుచరణసేవాతత్పరుడై వృద్ధిపొందించుకొనవలయును. ఇదియే "**త్యాగేనైకే అమృతత్త్వమానశుః**" అను శ్రుతిచే చెప్పబడినది.

**వివరణ :** మాయోత్తీర్ణత కలుగనిదే బ్రహ్మదర్శన మేర్పడదు. బ్రహ్మాఽఽభేదమే మోక్షము. ఆత్మబ్రహ్మలకు భేదము జీవుడు భావించును. అభేదమును గురువు ప్రసాదించును. భేదము బంధకారణము. దుఃఖజనకము; అభేదము, ఆత్మరతిని కలిగించి యాత్మారాముడగునట్లు చేయును. ఆత్మారాముడనగా ఆత్మ ఆనందరూపమగుట వలన ఆనందరూపుడై యుండుట. గుర్వనుగ్రహమున మాయోత్తీర్ణత కలిగిననే యీ ఫలము సిద్ధించును. ఆత్మస్వరూప విచారణకు గ్రంథములున్నవి. అవి శ్రుతులు, స్మృతులు, పురాణములు మున్నగురూపములతో పలు తెరంగులుగా నున్నవి. వానిని వివరించి చెప్పువారును కలరు. సులభమగు భాషలో వివరణములున్ను గలవు. వానిని జూచిన, వినిన, ఆత్మస్వరూపజ్ఞానము, అనుభవము, కలుగదా మాయోత్తీర్ణత ఏర్పడదా, గురువెందుకని సంశయము కలుగుచున్నది. ఈ విషయమున కొలది వివరణము చేయబడుచున్నది.

**ఆచార్యవాన్ పురుషో వేద** గురువున్న పురుషుడు ఆత్మస్వరూపము తెలిసికొనును అని వేదము చెప్పుచున్నది. అహంకార, మమకార వశుడై యుద్ధవిముఖుడైన అర్జునునకు కర్మ, జ్ఞాన స్వరూపములను వివరించి చెప్పిన శ్రీకృష్ణభగవానుడు "**ఉపదేక్ష్యంతి తే జ్ఞానమ్ । జ్ఞానినస్తత్త్వదర్శినః**" తత్వదర్శనము చేసిన జ్ఞానులు నాచే చెప్పబడిన జ్ఞానస్వరూపమును నీకు ఉపదేశించగలరు అని అనెను. కృష్ణుని ఉపదేశముకంటే వేఱగు ఉపదేశలక్షణము కలదని తెలియుచున్నది. ఈ విధముగా శ్రుతి స్మృతులు జ్ఞానరూపమైన ఆత్మానుభూతికి గురువవసరమని ఘోషించుచున్నది. కాన గ్రంథములయొక్క గ్రంథార్థము వివరించు వారి యొక్క ఉపకారమెంత? గురువువలన కాదగు ఉపకారమేమి? అను విషయమును విమర్శించు కొనవలయును. జ్ఞానము రెండు విధములుగా కల్పించుచున్నది. వస్తువుయొక్క స్వరూప-వర్ణనవలన తెలిసికొనుట యొకటి. దీనివలన వస్తువునందు వాంఛ కలుగును. ఇది వస్త్వనుభవమునకు దారితీయును. దీనిని పరోక్షజ్ఞానమందురు. అనగా వస్తువుననుభవించి

తెలిసికొనుటకంటే వేరైనది, వస్తువును చాటుననుంచి వస్తుస్వరూపమును తెలిసికొనుట యని పరోక్షజ్ఞానమను పదమునకర్థము. వస్తువుననుభవమువలన దెలిసికొనుట అపరోక్ష జ్ఞానమనబడును. అనగా ప్రత్యక్షముగా తెలిసికొనుట అని (అనుభవజ్ఞానము) అపరోక్ష జ్ఞానమనుపదమునకు అర్థము. బెల్లము తియ్యగా నుండునని వర్ణించిచెప్పుట వలన వస్తువాంఛ కలుగును. ఇది పరోక్షజ్ఞానము. తిని తీపిని తెలిసికొనుట అనుభవజ్ఞానము. ఇదియే అపరోక్షజ్ఞానము. వర్ణనమువలన తీపియొక్క స్వరూపము తెలియబడదు. అట్లే పరోక్షజ్ఞానము వలన ఆత్మాౖభేదస్వరూపమనుభవసిద్ధముగా తెలియదు. అనుభవముననే తెలియబడును. అనుభవజ్ఞానము వివరించి చెప్పుటకు భాషాశక్తి చాలదు. అందువలన ఈ రెండు జ్ఞానములలో మొదటిదియగు పరోక్షజ్ఞానము మాత్రమే గ్రంథములు, వ్యాఖ్యాతలు, కలిగించుదురు. అపరోక్షజ్ఞానమనుభవముననే కలుగును. అనుభవము మాయోత్తీర్ణుడైననే యేర్పడును. మాయయనునది ఆత్మదర్శనమునకు అడ్డగనున్న యొక తెరవంటిది. ఆనందరూపమైన ఆత్మ నిత్యసిద్ధమై ఎల్లరయనుభవమున నుండనే యున్నది. కాని ఇది యాత్మానందమని గుర్తించి దానియందు రుచిని మరగలేదు. ఈ మాయావరణము తొలగినగాని ఆత్మరతి యేర్పడదు. ఇట్టి మాయోత్తీర్ణతకు మాయోత్తీర్ణుడగు గురువు అవసరము. శ్రవణమువలన కలిగిన వస్తువాంఛ మాయోత్తీర్ణతాప్రయత్నమున కుపకరించును. (లౌకికములైన దుఃఖములు అర్జునుని కిట్టి వాంఛను దృఢపరుచును.) అనధికారికి విక్షేపములు వృద్ధిచేయబడి పుణ్యాపాప మిశ్రఫలమైన మనుష్యజన్మయందు పైన పేర్కొనబడిన విధమున తత్త్వజిజ్ఞాసను, వైరాగ్యమును, పెంపొందింపగల కర్మఫలము ఒక్కమారనుభవమునకు రాగల అవకాశము కలదు. ఇట్టి కర్మఫలముగ సద్గురులాభము కలుగును.

స్వాత్మార్పణ రూపమున విప్రతిపత్తి రహితముగ అనంతరితసేవాసాన్నిధ్యము చేయు విధానమును గురూపపత్తియని శాస్త్రము పేర్కొనినది. తన సర్వస్వము పరిత్యజించి సన్న్యాస పూర్వకముగా కర్మస్వరూపమును త్యాగముచేసి, సంన్యసించి జ్ఞానమును సంపాదింపవలెననుట యొక మార్గము. స్వరూపసంన్యాసమును గ్రహించినను గ్రహింపకున్నను ఐహికభోగముల యందు వైరాగ్యము, తత్త్వజిజ్ఞాసగల వాడు గృహస్థుడయ్యు ఆత్మనిష్ఠారూపమైన బ్రహ్మవిద్యను సాధింప నర్హుడగుట మఱియొకమార్గము. ఈ రెండవ మార్గమున గృహస్థాశ్రమమున నుండియు వానప్రస్థసంన్యాసులవలె నుండుట, ఇందు సంన్యాస లక్షణములున్నను బాహ్యమున కానుపింపవు. బాహ్యవ్యవహారమున గృహస్థధర్మమును పాటింపుచు అంతరమున గురూపదిష్ట సాధనములచే బ్రహ్మనిష్ఠను సంపాదింప ప్రయత్నించుచుండును. ఇది సంన్యాసి కంటే, పతితుడు కాకుండా రక్షించుకొనుటకు, బ్రహ్మావాప్తి గృహస్థునకు సులభమైన సాధనము. ధర్మార్థకామమోక్షములనెడి పురుషార్థములలో ధర్మము అర్థమునకు, అర్థము కామమునకు,

కామము మోక్షమునకు సాధనమగు విధానమును భాగవతము, పురాణములు, తంత్రములు బోధించుచున్నవి. వేదార్థోపబృంహకములైన, ఇవి ఔపనిషదమైన మార్గమునే వ్యాఖ్యానించు చున్నవి. ఈ విషయము సంప్రదాయజ్ఞులగు గురువులవలన తెలియనగును. తృతీయ పురుషార్థము, చతుర్థపురుషార్థముగా పరిణమింపగలదని లలితోపాఖ్యానము యొక్క మొదటి శ్లోకమున వ్యాసమహర్షి ఈ విషయమును సూత్రీకరించి తరువాత కథాముఖమున వివరించి చెప్పెను. "**అస్తు వః శ్రేయసే నిత్యం వస్తు వామాఙ్గమైశ్వరమ్ । యతః తృతీయో విదుషాం తురీయం తత్పరం మహః**" అనునది లలితోపాఖ్యాన ప్రారంభశ్లోకము. జగద్గురువగు శ్రీకృష్ణభగవానుడు తనయనుగ్రహము నపేక్షించిన గోకులవాసులకు తన లీలావిభూతిచే తృతీయపురుషార్థమును సాధనముగా గొని తురీయస్థితిని కలిగించి అంతర్ధానమై వారి వృత్తులను బ్రహ్మాకారములొనర్చెను. సర్వకామావ్యాప్తిరూపమే మోక్షమని శ్రుతులు ఘోషించుచున్నవి. "**శ్రోత్రియస్య చాకామహతస్య**" అని మొదలిడి సర్వకామావాప్తి మోక్షమని తైత్తిరీయశ్రుతి ఉపసంహరించినది. ఈ సాధనావిశేషములు గురుశిష్యపరంపరవలననే యెరుగనగును. "**కర్ణాత్కర్ణోపదేశేన సంప్రాప్తమవనీతలమ్**" అని సంప్రదాయజ్ఞులు తెలిపిరి. అవాఙ్మానసగోచరమైన తత్త్వమును ఆచార్యుడు తాను ఆచరించి దర్శించిన విధమున శిష్యునకు ఉద్బోధించి ఆత్మదర్శనమును కలిగించును. భాగవతమున శ్రుతులు రూపము దాల్చి స్వామిని స్తుతించి మేము తెలిసికొనలేని నీ రూపమును జూపుమని ప్రార్థించినవి. దీనిచే శ్రుతులకు దెలియనిది, బోధింపశక్యముగానిది, ఆచార్యాఽపేక్షితమైనదియునగు తత్త్వస్వరూపదర్శన విధానము కలదని బోధపడుచున్నది. ఇందుకు గుర్వపేక్ష యనివార్యమని తేలినది. సంన్యాసియు బ్రహ్మనిష్ఠుడగు మఱియొక పరివ్రాజకుని గురువుగ వరించి ప్రణవాద్యుపదేశములచే బ్రహ్మనిష్ఠుడగును. ఇందు రెండు విధములగు మార్గములందుగల త్యాగలక్షణములను వాని తాత్పర్యమును తెలిసికొనవలయును.

బ్రహ్మవిద్యకు త్యాగము ప్రధానలక్షణమని పైన పేర్కొనబడినది. ఈ త్యాగము సంన్యాసము నందువలె ఐహికభోగములను, వర్ణాశ్రమోచితకర్మలను స్వరూపతః త్యాగము చేయుట కాదు. తన సర్వమును గుర్వర్పణచేసి గుర్వధీనుడై, ఐహికభోగములను, ధర్మార్థకామములను, మోక్షమునకు సాధనము చేసికొనుట. జీవుడు కర్మ పరతంత్రుడై మెలగుట జన్మసిద్ధమైన విషయము. అట్టి కర్మవశతను పారద్రోలజాలడు. ఐహికజీవితమున ఆముష్మికజీవితమునకు కర్మాధీనుడైయుండి మఱల పుణ్యపాపకర్మలను చేయుచు అదృష్టరూపమైన కర్మఫలమును పెంచుకొనుచునే యుండును. పారతంత్ర్య మేవిధమునను తప్పదు. తన సంపత్తిచే నేను స్వతంత్రుడనని అహంకరించుట అజ్ఞాన విలాసము. ఈ విధమున తనకు తప్పని పరతంత్ర జీవితమును గుర్వధీనము చేయుట యనగా తాను జ్ఞానపరతంత్రుడగుటయని భావము.

గురువు జ్ఞానరూపుడని పూర్వము ప్రతిపాదితము, తన సర్వస్వమును గ్రహించిన సర్వజ్ఞుడగు గురువు ఆ శిష్యుని నుత్తీర్ణుని జేయుట కనువగు విధమున వాని సంపదను వానిచే ననుభవింప జేయును. శిష్యుడు తనకు స్వాతంత్ర్యము కలదని భావించిన మిథ్యాస్వాతంత్ర్యమును కర్మపారవశ్యతను విడచుటయే దీని తాత్పర్యము. "**గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేన వా**" అను సంప్రదాయప్రసిద్ధి. బ్రహ్మవిద్యేతరములైన విద్యలకు అనువర్తించును గాని బ్రహ్మవిద్యకు గాదు. "**న దేయం పరశిష్యేభ్యో నాస్తికేభ్యో, న చేశ్వరీ న చ శుశ్రూషాఽలసానాం చ, నైవాఽనర్థప్రదాయినాం**" అని విద్యాధికారులను శాస్త్రము చెప్పినది. పర-శిష్యులకీయగూడదనుటచే తనకు వచ్చిన విద్యను చెప్పి విద్యను గ్రహింపుము అను పక్షము నిరాకరింపబడినది. గురుదేవతాశాస్త్రములయందు విశ్వాసములేని నాస్తికునికి విద్యనీయరాదు. గురుసేవచేయుటయందు సోమరితనము చూపువానికి, ధనము నీయనివానికి విద్యనీయరాదని పై శ్లోకము యొక్క ఉత్తరార్థమున చెప్పబడినది. అందు సముచ్చయవాచకమైన చ కారము గలదు. అందుచే గురుసేవయందు అలసుడు గాక యుండుటయు, ధనమునిచ్చుటయు రెండును అధికారి లక్షణములని స్పష్టమగుచున్నది. గురుశుశ్రూషయందు అలసులగువారు సేవజేయగల శక్తి యుండియు సేవచేయనివాడని యర్థము. శక్తిలేక సేవచేయకున్నను, అర్థప్రదునకు విద్యనీయవచ్చును. అట్లే ధనహీనుడై "**విత్తశాఠ్యం న కారయేత్**" అను శాస్త్రవచనముననుసరించి స్వాత్మగౌణాత్మ సమర్పణము, యథాశక్తిగావించి శుశ్రూష చేసిన వారికి విద్యనీయవచ్చునని పై వాక్యమునకు తాత్పర్యము. శక్తియున్నంతవరకు శుశ్రూషా సమర్పణములు రెండు అవసరమని శాస్త్రతాత్పర్యమై యున్నది. ఈ విషయము "**పరీక్షితాయ దాతవ్యం వత్సరార్థోషితాయ చ**" అను శాస్త్రవచనముచే ధ్రువీకరింపబడినది. ఈ వాక్యము నందును సముచ్చయవాచకమైన చ కారముగలదు. దీనివలన శుశ్రూషా సమర్పణములచే పరీక్షింపబడి గురుకృప యున్నవానికే విద్యాదానము చేయుమని ఈశ్వరుడు గురుస్థానము వహించిన వారి కుపదేశించెను.

"హే స్వామిన్! పరమేశాన! కృపయా మాం విలోకయ
ఇదం శరీరం భగవన్! పుణ్యపాపసమార్జితమ్ ।
సమర్పితం చ సర్వస్వం భవత్పాదారవిందయోః
భవదీయమిమం శిష్యం భవదాజ్ఞాపరం శిశుమ్ ।
పూర్ణాభిషేకవిధినా దీక్షయస్వ మహాప్రభో! ॥

శ్రీ గురో శ్రీకృపాసింధోఽనుగృహాణ సదాశివ ।
యేనాయం పశుపాశేభ్యో ముక్తశ్శివపదం వ్రజేత్ ॥

ఇదం మమ ధనం సర్వమియంజాయా సధర్మిణీ ।
అయం దాస ఇదం క్షేత్రం అన్యత్సర్వస్వమప్యథ ।
ఆత్మార్పణేన నిర్వ్యాజం తవ పాదే సమర్పితమ్ ॥

ఇమాం శ్రీదక్షిణాం, నాథ భుంజ భుంజ యధా సుఖమ్
త్వద్భుక్తశేషం పుత్త్రోऽహం భుంజన్నిర్వృతిమాప్నుయాం
స్వాత్మానందమహాలాభాన్నకాంక్షే పరమీహితమ్ ।

యద్యద్యథా మోక్షహేతుః స్యాత్తథైవోపయుంక్ష్వతామ్ ।
ఇదం సత్యమిదం సత్యం శాధి మాం పాలయ ప్రభో! ॥

గురువుయొక్క పూర్ణానుగ్రహమునపేక్షించినవాడు తన సర్వస్వమును, అనగా దారాపుత్రక్షేత్ర ధనధాన్యాదిసంపత్తితో ఆత్మార్పణము చేయవలయునని పై శ్లోకముల సారాంశము. ఆ సంపత్తిలో నే వస్తువెట్లు మోక్షకారణమగునో దానినట్లు వినియోగింపమనియు ప్రార్థన గలదు. కాగా తేలిన విషయము ధర్మార్థకామములను మోక్షహేతువులుగా చేయుమని ప్రార్థించి అర్చించుట. ఈ అర్పణము తనకుగల స్వాతంత్ర్యమును త్యజించుటయందు పర్యవసానమైనది. ఇది **జ్ఞానపరతంత్రత**. ఇట్లు గుర్వధీనుడై జ్ఞానసాధనము చేయువాడు ఎట్లు మెలగవలయునను విషయము సమయాచారతంత్రాదులయందు విపులముగా వివరింపబడినది. ఆ నియమముల ప్రధానతాత్పర్య సంగ్రహమిది. ఐహికాముష్మిక సర్వభోగముల కాధారమైన సర్వకామావాప్తి రూపమైన మోక్షము అనుత్తరమైన సర్వశ్రేష్ఠమైన శ్రేయము. దానినపేక్షించి కృషిచేయువానిని జూచి ఆ స్థానముకంటే అధమస్థానమున నుండు దేవాది సర్వజీవులు, అనగా ప్రకృతి యంతయు అసూయాగ్రస్తమై వాని కృషికి నంతరాయము కల్పించును. దానినెదుర్కొనుటకు ప్రధానమైన కొన్ని సూత్రములు కలవు. వానిని మూలముగా జేసికొని గురుశిష్యులకు సంబంధములు గల ప్రవర్తనములో కొన్ని నియమములు శాస్త్రమున విధింపబడినవి. అందు ముఖ్యమైనవి అన్యదేవతారాధనము, భోగదృష్టితో సంపత్తునుపయోగించుట, అన్యగురు-సమాశ్రయణము, పుస్తకజ్ఞానమున తత్త్వసమీక్ష, గుర్వాజ్ఞాపరిపాలనమున ననాదరము, ఐహికాముష్మికవిషయముల కంటే జ్ఞానసాధనములగు కర్మోపాసనలకు అప్రాధాన్యము కలిగించుట అనగా ధన, ప్రాణ, దేశ, కాల శరీరములకు వ్యయప్రయాసలను, జ్ఞానముకంటే భోగములకు వినియోగించుకొనుట మున్నగునవి. జ్ఞానమునకు వ్యతిరేకములైనవి. ఏ సందర్భమున నైనను తాను మాయోత్తీర్ణుడై శుద్ధవిద్యోదయము కలుగునంత వరకు స్వాతంత్ర్యము నవలంబింపరాదు. అంతవరకు శిష్యుని ప్రవృత్తిలో గల ధర్మాऽధర్మములకు బాధ్యుడు గురువేయైయుండును. పరస్పరము గురుశిష్యులు సామరస్యమున మెలగి దేవాऽ

సురసంపత్తిని జయించినగాని నిరంతరాయముగా విద్యోదయము కలుగనేరదు. ఎన్నడును గురువుయొక్క ఆగ్రహమునకు గురికారాదు. పై చెప్పిన వ్యతిరేక విషయముల జోలికి పోరాదు. ప్రవృత్తిని వృత్తి ధర్మములు పరస్పరము విరోధభావము గలవగుటచే వానిని సామరస్యమున నడపి ఈశ్వరానుగ్రహపాత్రముగా శిష్యునిచేయుట గుర్వధీనము. జ్ఞానము అలౌకికమగుటచే గురువులనబడు పెద్దల ప్రవృత్తులు, అసాధారణములై లోకవిరుద్ధముగా గనుపించును. అవి యన్నియు నివృత్తి ధర్మబద్ధములై యుండుట వలన వానిని సామాన్యులగు శిష్యులు విమర్శింపరాదు. ఏవగించుకొనరాదు. అన్యదేవతారాధనము, అనగా తీర్థాటనము, వ్రతచర్య మున్నగునవి. వానిని గురుసహితుడై, తదా జ్ఞానబద్ధుడై గాని చేయవలయును. ఆ యా దేవతల యందు తన ఉపాస్యదైవభావమే యుండవలయును. దేవతాభేదదృష్టి పనికిరాదు. ఉపాస్యదైవమును సహితము గురుభావనచే చూడవలయును. అది యొక సాధనమాత్రమే. అండాతీతుడైన పరశివుడుగా భావింపబడు గురువు నిష్పందభూమికయై తురీయాతీతస్థితుడు. నిరంతరము సమాధిస్థితులై బాహ్యదర్శనము లేని వారు గురువులుగా శిష్యులకుపయోగింపరు. సమాధినిష్ఠచే ఆత్మానుభవముగలిగి బాహ్యవ్యవహారమున సమదర్శనుడై బాహ్యసమాధియని చెప్పబడు బ్రహ్మనిష్ఠారతుడు గురువుగా శిష్యుని అదృష్టవశమున లభ్యము కాగలడు. ఉపాసన-యందు కర్మయందువలె జరిగిన దోషములకు ప్రాయశ్చిత్తము లేదు. ఆ దోషము కలిగిన కర్మను మఱల ఆచరించుటయే. ఇట్లే ఆ యా సూత్రములకు ప్రధానతాత్పర్యము. సర్వాత్మకుడని గురువును భావించుట, "**దేవైరుష్టే గురుస్త్రాతా గురౌరుష్టే న కశ్చన**" అను శాస్త్రవచనము దైవముకంటే గురువునకు ప్రాధాన్యము పేర్కొనినది.

పై విమర్శవలన జ్ఞానసాధనకు గురువు ప్రధాన మని తదాజ్ఞాబద్ధుడై నిరంతరము నడువవలయునని, అన్యదేవతారాధనము, సర్వదేవతాస్వరూపుడగు గురువునతిక్రమించి చేయరాదని, అన్యదేవతలు జ్ఞానసాధనకు విఘ్నకారులగుటచేత తత్తద్దేవతారాధనయందు గురుపూర్వకముగా, గుర్వనుగ్రహాంతముగా మెలగుట ఆవశ్యకము.

అహంకార మమకారములకు తావలమైన దారాపుత్రధనసంపత్తిని గుర్వధీనము చేయుట మాయోత్తీర్ణతకు ప్రధానమైన విషయము. ఉపనిషత్తులయందు మాయదురత్యయమైనదనియు తత్తరణమున బ్రహ్మప్రాప్తి కలుగుననియు మాత్రము చెప్పబడినది. జగత్తుయొక్క సత్యతాబుద్ధిని నిరాకరించి వైరాగ్యమవసరమని బోధింపబడినది. కాగా మాయోత్తీర్ణతకు సాధనములను వివరింపలేదు. అవి గుర్వధీనమని చెప్పబడినవి. పైన పేర్కొనబడిన గురుశిష్యుల ప్రవృత్తి నియమములన్నియు మాయోత్తీర్ణతకు సాధనములే. **మాయయందు విక్షేపావరణశక్తులు రెండున్నవి. విక్షేపశక్తి అహంకారమును, ఆవరణశక్తి మమకారమును కలిగించును. ఆవరణ**

**శక్తి కాంతాధీనమై, విక్షేపశక్తి ధనాధీనమై యుండును. ఈ రెండే జీవుల మాయోబద్ధుని జేసినవి. దానివలన రాగద్వేషాదిమలిన చిత్తవృత్తులును, జగత్తునందు సత్యత్వబుద్ధియు, ఇహాముష్మికభోగములయందు మోహమును కలిగించినవి.** ఇవి యన్నియు పూర్వము చెప్పబడిన గుర్వధీనతతో, పటాపంచలగును. కాన మాయోత్తీర్ణత గుర్వధీనమై యున్నదనుట నిర్వివాదాంశము. మాయోత్తీర్ణతవలన నిష్కళమైన బ్రహ్మస్వరూపము భవగోచరమగును. అనగా నిష్కళ బ్రహ్మత్మ స్థితిని పొందును. అట్టి స్థితిని పొందిన గురువు ప్రధానమగుటచే గురువునందు నిష్కళబ్రహ్మభావము కలిగియుండుట సమంజసము. సహజము ఆదినాధుడు మొదలు గురుపరంపరద్వారా తత్త్వశోధన పూర్వకముగా, మాయోత్తీర్ణుడై నిష్కళబ్రహ్మాత్మ భావమును పొందిన గురువు, తన కట్టిస్థితిని కల్పించుటకు సమర్ధుడు. "**భావో హి భవకారణమ్**" అను సంప్రదాయ సిద్ధమైన వచనము. భావమునకు ప్రాధాన్యమును తెల్పుచున్నది. భావమున కీటకము భ్రమరమగుట ప్రకృతి సిద్ధమై యున్నది. అందువలన మాయోత్తీర్ణతకు వలయు సాధనములనుపదేశించి ఆచరింపజేసి బ్రహ్మదర్శనము కలిగించు గురువునందు, ఈ భావనావిశేషమున తనకు బ్రహ్మభావముగలుగుట సులభము. ఒక్కొక్క జీవుడు భావనా మాత్రముననే యుత్తీర్ణుడై బ్రహ్మాత్మానుభవము కలిగినట్లు పురాణములు పేర్కొనినవి. సర్వతోముఖమైన విమర్శవలన పరిశీలింపగా సాధకుడు ప్రారంభమునుండి **నిగర్భార్థరహస్య** మెరిగి తదర్థమును మంత్రమున భావించు యథాశక్తి సాధనముల నెంతగనుష్టించిన నిష్కళ బ్రహ్మావాప్తి రూపమగు శ్రేయస్సును, అవశ్యము పొందగలడు. ఈ విషయము, గురు, దేవతానుగ్రహమున సాధకుల శ్రేయస్సును గోరి, యథాశక్తి వివరింపబడినది. గురుదేవతా శాస్త్రములయందు విశ్వాసము గల సాధకులు స్వాత్మగౌణాత్మసమర్పణపూర్వకగుర్వనుగ్రహము సంపాదించి గురుముఖమున వలయు విశేషముల దెలిసికొని **నిగర్భార్థభావన** ననుష్టించి, ఆత్మానందముననుభవించి, ఆత్మారాములైనెగడెదరు గాకయని అస్మదుపాస్యయగు శ్రీ సద్గురు పాదుకాఽధిదేవత నాకాంక్షించెద.

## 5. కౌళికార్థము.

**అవ :** తరువాత, దేవత, శ్రీవిద్యామంత్రము, శ్రీచక్రము, గురువు, తాను అను నైదింటికి

**శ్లో॥ గణేశ, గ్రహ, నక్షత్ర, యోగినీ, రాశి, రూపిణీమ్ ।**

**దేవీం మన్త్రమయీం, నౌమి మాతృకాపీఠరూపిణీమ్ ॥** అని తంత్రమున చెప్పబడిన గణేశాదిషట్కమునకు సాధర్మ్యముచే అభేదము చెప్పుట **కౌళికార్థ**మనబడును.

ముందు పరదేవతయందు గణేశాది షట్కస్వరూపమును ప్రతిపాదించుచున్నాడు.

**శ్లో॥ మాతా నిరుపమతేజోమయ్యాస్స్వస్యా మరీచిరూపాణామ్ ।**
**ఆవరణదేవతానామీశిత్వాదుచ్యతే గణేశీతి ॥ 30**

నిరుపమతేజోమయ్యాః = సాటిలేని తేజస్స్వరూపురాలగు, స్వస్యాః = తనకు అనగా పరదేవతకు, మరీచిరూపాణామ్ = తన తేజఃకిరణముల స్వరూపమే యగు, ఆవరణదేవతానామ్ = తనను ఆశ్రయించి యుండు దేవతలకు, ఈశిత్వాత్ = రాణియగుట వలన, మాతా = అమ్మ జగజ్జననియగు పరదేవత, గణేశీ + ఇతి = గణములకు ప్రభ్వి యని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తా :** దేవియొక్క తేజస్సు పోలికలేనిది అగుటచే ఉదాహరణము చెప్పనలవికానిది. అట్టి ఆమె యొక్క కిరణరూపములైన ఆవరణదేవతలకు ప్రభ్వియగుటచే ఆమెను దేవతాగణములకు **ఈశి** యని పిలుతురు.

"**న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః ।**
**తమేవ భాన్తమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి॥**" అని శ్రుతిచే ప్రతిపాదింపబడిన అపరిమిత తేజస్స్వరూపిణి యగు బిన్దుచక్రాధిష్ఠాత్రియైన పరదేవతయొక్క కిరణములే ఆవరణ దేవతలని ప్రతిపాదింపబడినది. అట్టి దేవతా గణములకు **ఈశి, ప్రభ్వి** యగుటచే పరదేవత **గణేశీ** అని చెప్పబడుచున్నదని తాత్పర్యము.

**అవ :** ఈ విధమున గణేశతత్త్వమును ఉపపాదించి పరదేవతకు గ్రహరూపతను ప్రతిపాదించుచున్నాడు.

**శ్లో॥ ఇచ్ఛాదిత్రయరూపా గుణత్రయాఢ్యాఽనలేన్దురవినేత్రా ।**
**ఏవం నవభిర్యోగాద్గ్రహరూపేత్యుచ్యతే మాతా ॥ 31**

ఇచ్ఛాదిత్రయరూపా = ఇచ్ఛ, జ్ఞాన, క్రియ అనెడి శక్తిత్రయస్వరూపిణి, గుణత్రయాఢ్యా = సత్త్వ, రజ, స్తమో గుణరూపిణి, అనలేన్దురవినేత్రా = అగ్ని, చంద్రుడు, సూర్యుడు అను స్వరూపమైన మూడు నేత్రములు గలది. ఈ విధముగా తొమ్మిది అవయవములతో సంబంధించిన దగుట వలన పరదేవత గ్రహరూపిణి యని చెప్పబడుచున్నది. గ్రహములు తొమ్మిది, ఇచ్ఛాదినవకస్వరూపమే యగుట వలన గ్రహరూపత్వము సిద్ధించినదని తాత్పర్యము. ఇచ్చట సంఖ్యాసామ్యమియ్యబడినది.

**అవ :** ఇక నక్షత్ర స్వరూపత్వముపపాదించబడుచున్నది.

**శ్లో॥ ఇంద్రియదశకేనాంతఃకరణచతుష్కేణ విషయదశకేన ।**
**ప్రకృతిపురుషగుణతత్త్వైర్జాతా నక్షత్రరూపిణీ మాతా ॥ 32**

ఇంద్రియదశకేన = జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు, మొత్తము పది ఇంద్రియములచేత, అంతఃకరణచతుష్కేణ = మనోబుద్ధిచిత్తాహంకారములనెడు నాలుగు అంతరింద్రియములచేత, విషయదశకేన = శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనెడి ఐదు, జ్ఞానేంద్రియములకు గోచరమగు విషయములైదు. కర్మేంద్రియ విషయములైదు, వచనము, ఆదానము, గమనము, విసర్గము, ఆనందములు. ఇట్టి పది యింద్రియవిషయములచేత, ప్రకృతిపురుషగుణతత్త్వైర్జాతా నక్షత్రరూపిణీ మాతా = ప్రకృతి, పురుషుడు, గుణతత్త్వము అనగా సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థ, ఈ మూడు తత్త్వములచేత మొత్తమిరువదియేడు అవయవముల సంబంధముచే పరదేవత నక్షత్రరూపిణియైనది. నక్షత్రరూపములిరువదియేడు. ఈ శ్లోకమున చెప్పబడిన ఇంద్రియాద్యవయవములును ఇరువది యేడు. ఈ సంఖ్యా సామ్యముచే పరదేవతకు నక్షత్రరూపత్వము సిద్ధించినది.

**అవ :** ఇక యోగినీరూపత్వమును ప్రతిపాదించుచున్నాడు.

**శ్లో॥ నరపతిరవికాష్ఠాషట్సముద్రద్విసంఖ్యై-**
**రకడబవహపూర్వైరక్షరైర్వేష్టితాభిః ।**
**డరలకసహవర్ణాద్యాకినీభిస్తు షడ్భి-**
**ర్ఘటితతనురితీయం కథ్యతే యోగినీతి॥ 33**

నరపతి... సంఖ్యైః = నరపతి (16), రవి = పంద్రెండు (12), కాష్ఠా = పది (10), షట్ = ఆరు(6), సముద్ర = నాలుగు (4), ద్వి = రెండు (2), సంఖ్యైః = సంఖ్యలుగల, అ = స్వరములు (16), క = కకారము మొదలు, ఠకారము వరకు. పంద్రెండు (12) డ = డకారము మొదలు ఫకారము వరకు పది (10), అక్షరములు, బ = బకారము మొదలు ల కారము వరకు, ఆరు (6), అక్షరములు, వ = వకారము మొదలు సకారము వరకు నాలుగు (4) అక్షరములు, హ = హకార క్ష కారములు రెండు (2) పూర్వమున చెప్పబడిన ఆ యా సంఖ్యగల అక్షరములతో, ఉపలక్షింపబడిన అమృతాది దేవతలతో, వేష్టితాభిః = పరివేష్టింప బడిన, డ = డాకినీ, ర = రాకినీ, ల = లాకినీ, క = కాకినీ, స = సాకినీ, హా = హాకినీ, వర్ణాత్ =ఈ అక్షరములచే చెప్పబడిన దేవతలకంటే వేరై ఈ దేవతల సమష్టి అయిన, యాకినీభిః = యాకినీ అనెడి షడ్భిః = ఆరుదేవతలతో, ఘటితతనుః = కూడిన స్వరూపముగల, ఇయమ్ = ఈ పరదేవత, యోగినీ ఇతి = యోగిని అని, కథ్యతే = చెప్పబడుచున్నది.

**తా :** **"విశుద్ధౌ హృదయే నాభౌ స్వాధిష్ఠానే చ మూలకే ।**
**ఆజ్ఞాయాం ధాతునాథాశ్చ న్యస్తవ్యా డాదిదేవతాః ।**
**అమృతాదియుతాస్సమ్యక్ ధ్యాతవ్యాశ్చ సురేశ్వరి॥"**

అను తంత్రవచన ప్రకారము, అకారాద్యక్షరములు, ఏబదింటిచే చెప్పబడు అమృతాది దేవతలు కలరు. వారు ఈ 33వ శ్లోకమున చెప్పబడిన రీతిన విశుద్ధాది మూలాధారము వరకును, ఆజ్ఞాచక్రము నందును, షట్చక్రములయందు న్యస్తములైయున్నారు. ఒక్కొక్క చక్రమునకు అధిపతులై డాకిన్యాది దేవతలు కలరు. వారు త్వక్, అసృక్ (రక్త), మాంస, మేద, అస్థి, మజ్జారూపులు. అనగా ధాతునాథ దేవతలు ధాతువులు, ఏడు శుక్లధాతువుతో ఏడని వైద్యశాస్త్ర ప్రసిద్ధికలదు. సహస్రారమున శుక్లధాతునాథ దేవతయై అకారాది పంచాశత్ వర్ణరూపిణియై యాకిని యను ధాతునాధ దేవతయున్నది. ఈమె పంచాశత్ వర్ణరూపిణి యగుటచే సమష్టి రూపము. **సహస్రారముగూడ షట్చక్రముల సమష్టిరూపమే యగుటచే ఆమె యోగినులలో ప్రత్యేకముగ లెక్కింపబడలేదు.**

ఈ శ్లోకముయొక్క అర్థము, అంతర్మాతృకా, లఘుషోడశాది న్యాసములు చేయువారికి సుకరముగ తెలియును. అందువలన నింతకంటే వివరము చేయబడలేదు.

**అవ :** ఇక రాశిరూపత్వము చెప్పబడుచున్నది.

**శ్లో॥ పంచభిర్నాగకూర్మాద్యైః ప్రాణాపానాదిపఞ్చభిః ।**
**జీవాత్మపరమాత్మాభ్యాం చైషా రాశిస్వరూపిణీ ॥ 34**

నాగకూర్మాద్యైః= నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ అనుపేర్లు గల, పంచభిః = ఐదు ఉపవాయువులచేత, ప్రాణాపానాదిపంచభిః = ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన అనెడి వాయువుల చేత, జీవాత్మ పరమాత్మాభ్యాం చ = జీవాత్మ, పరమాత్మ అనెడి తత్త్వముల చేతను, ఏషా = ఈ పరదేవత, రాశిస్వరూపిణీ = మేషాది పండ్రెండు రాసులయొక్క స్వరూపమైనది.

**తా :** ఐదు ఉపవాయువులు, ఐదు మహావాయువులు, జీవాత్మ, పరమాత్మలు రెండు ఈ పండ్రెండింటి సంబంధముచే దీనితో సమాన సంఖ్యగల మేషాది పండ్రెండు రాశుల స్వరూపమే పరదేవతయని భావింపవలయును. ఈ విధముగ పరదేవతకు, గణేశ, గ్రహ, నక్షత్ర, యోగినీ, రాశి, రూపత్వము నిరూపింపబడినది. పీఠస్వరూపత్వము మున్ముందు దేవతా మంత్రచక్రము లకు నొకే శ్లోకమున నిరూపింప బడగలదు.

**అవ :** ఇప్పుడు విద్యయందు గణేశాది పంచకస్వరూపమును ప్రతిపాదింపదలచి ముందు గణేశరూపత్వము ప్రతిపాదింపబడుచున్నది.

**శ్లో॥ అకథాదికషోడశాక్షరాత్మకతార్తీయకకామవాగ్భవైః ।**
**ఘటితా చ పరాదివాగ్గణైరితి విద్యాపి గణేశరూపిణీ ॥ 35**

అకథాదికషోడశాక్షరాత్మక = అకారాది విసర్గాంతము, కకారాది తకారాంతము, థకారాది స కారాంతముగల పదునారు అక్షర స్వరూపములైన, తార్తీయక కామవాగ్భవైః = తృతీయకూట, ద్వితీయకూట, ప్రథమకూటములతో, పరాదివాగ్గణైశ్చ = పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ స్వరూపములతో, ఘటితా = కూడినది, ఇతి = ఈ కారణముచేత, విద్యాపి = విద్యయున్ను, గణేశరూపిణీ = వర్ణగణ స్వరూపములగుట వలన **శ్రీవిద్య** గణేశరూపమని భావము.

**తా :** అకారాది విసర్గాంతము, కకారాది త కారాంతము, థకారాది సకారాంతము, మాతృక మూడు గణములుగ నున్నది. వాక్కు, పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ అని నాలుగు రూపములుగ నున్నది. ఈ విధముగ విద్య గణరూపములుగ విభజింపబడుటచే గణేశిత్వము సిద్ధించినది.

అకారాది షోడశస్వరాత్మకము శక్తి కూటమగు మూడవకూటము; కకారాది త కారాంత అక్షరరూపము కామరాజు కూటమైన రెండవ కూటము; థ కారాది స కారాంతాక్షరరూపము వాగ్భవకూటమైన మొదటి కూటము. పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ యనెడి వాక్చతుష్టయము వ్యష్టి, సమష్టి భేదముచే విద్యారూపము. ఇందువలన శబ్దగణమునకు ప్రభువు అగుటచే శ్రీవిద్యకు గణేశిత్వము సిద్ధించినది.

**అవ :** ఇక గ్రహరూపత్వము ప్రతిపాదింపబడుచున్నది.

**శ్లో॥ బిందుత్రయనాదత్రయతదన్యకూటైర్గ్రహత్వమిహ ।**
**నక్షత్రత్వం చ దశాకారాణాం వ్యంజనైరపార్థక్యాత్ ॥ 36**

బిందుత్రయ = మూడు కూటములయొక్క చివరనున్న మూడు బిందువులు, నాదత్రయ = అర్ధచంద్ర, రోధిని, నాద, నాదాంత, శక్తి, వ్యాపిక, సమన, ఉన్మని అనెడి యెనిమిదింటికి **నాద**మని పేరు. ఈ నాదము మూడు కూటముల చివర బింద్వంతముగ నున్నది. దీనికి **నాదత్రయ**మని పేరు. తదన్యకూటైః గ్రహత్వమిహ = బిందునాదముకంటే వేరైన మూడు కూటములు మొత్తం తొమ్మిదింటిచే గ్రహసంఖ్యాసామ్యమును బట్టి విద్యకు గ్రహత్వము సిద్ధించినది. ఇక నక్షత్రరూపత్వము చెప్పుచున్నారు.

ఇక నక్షత్రత్వం చ = విద్యకు నక్షత్రధర్మమున్ను, దశ + ఆకారాణామ్ = పది ఆకారములకు, వ్యంజనైః = హల్లులతో అపార్థక్యాత్ = వేరుకాకపోవుటవలన, నక్షత్రత్వమ్ = నక్షత్రధర్మము, ఇహ = ఈ విద్యయందు, (సిద్ధమ్ = సిద్ధించినది.)

**తా :** సంప్రదాయార్థప్రకరణమున విద్యయందు **ముప్పది ఏడు** వర్ణములు చెప్పబడినవి. అందు అకారములు పది. అవి. 1,4,6,7,8,9,10,12,13,14 అక్షరముల యందున్నవి. ఆ పది ఆకారములకు వానితో కూడిన హల్లులకు వేరు వేరుగ సంప్రదాయార్థమున లెక్క

చూపబడినవి.

ఈ కౌళికార్థమున, ఆ యక్షరముల యందున్న అకారాములు పదింటికి వేరు లెక్కచేయక హల్లులతో కలిపి పది యక్షరములుగ లెక్కించినచో సంప్రదాయార్థమున చెప్పబడిన ముప్పది ఏడు సంఖ్యలలో పది సంఖ్యలు తగ్గును. కాగా విద్యామంత్ర మిరువది యేడక్షరములు కలదిగా లెక్కింపబడును. ఈ విధముగ సంఖ్యా సామ్యముననుసరించి విద్యకు నక్షత్రత్వము సిద్ధించినది. విద్యయందు ముప్పదిఏడు అక్షరముల లెక్కను ఈ ప్రకరణమున గల (17)డవ శ్లోకము యొక్క వ్యాఖ్యానము చూచునది.

**అవ :** ఇక యోగినీ రూపమును రాశిరూపమును విద్యకు నిరూపించుచున్నాడు.

**శ్లో॥ హృల్లేఖాభిస్తిసృభిస్తదన్యకూటైస్తు యోగినీ యోగాత్ ।**
**రాశీభూతాప్యేషా తిసృణాం పూర్వాక్షరైరైక్యాత్ ॥ 37**

తిసృభిః = మూడైన, హృల్లేఖాభిః = హ్రీంకారములచేత, తదన్యకూటైః = హృల్లేఖాతిరిక్తమైన మూడుకూటములచేత, మొత్తము ఆరింటితో, యోగాత్ = సంబంధమువలన, ఏషా = ఈ విద్య, యోగినీ = యోగినీ స్వరూపమైనది. (ఇక రాశిరూపత్వము చెప్పుచున్నాడు)

తిసృణామ్ = మూడు హ్రీంకారముల యొక్క, పూర్వాక్షరైః = ముందున్నమూడు లకారములతో, ఐక్యాత్ = ఒక్కటిగా లెక్కించుట వలన, ఏషా = ఈవిద్య, రాశీభూతాపి = రాశియైనది.

**తా :** విద్యయందున్నమూడు హ్రీంకారములు, హ్రీంకారములను విడిచిన కూటములు మూడు. మొత్తం ఆరింటియొక్క సంబంధమువలన విద్య డాకిన్యాది యోగినీ స్వరూపముగ చెప్పబడినదని భావము.

విద్యాకూటములు, మూడు, వానియందు మూడు హ్రీంకారములు కలవు. ఆ హ్రీం కారముల మూడింటిని తత్పూర్వముననున్న ల కారముతో చేర్చి **లహ్రీం** అని ఏకాక్షరముగా లెక్కించినచో విద్యయందు పంద్రెండక్షరములగును. మేషాది రాశులు పంద్రెండగుటచే విద్యాసంఖ్యాసామ్యమును బట్టి విద్య రాశిస్వరూపమగును.

**అవ :** ఈ విధముగ, గణేశాది పంచక స్వరూపముగ శ్రీవిద్యకు, పరదేవతకు అభేదము నుపపాదించి, ఈ యభేధము రూపైక్యమునను కలదని సాధించుచున్నాడు.

**శ్లో॥ దేవ్యా రూపాంతరత్వేన విద్యాయాస్తదభేదతః ।**
**గణేశగ్రహనక్షత్రయోగినీరాశిపీఠతా ॥ 38**

విద్యాయాః = శ్రీవిద్యకు, దేవ్యాః = పరదేవతయొక్క, రూపాన్తరత్వేన = మఱియొక రూపమే యగుటచేత, తదభేదతః = విద్యాదేవతలయొక్క అభేదమువలన, గణేశ... పీఠతా = గణేశాది షట్కస్వరూపత్వము సిద్ధించినదని భావము.

**తా :** రామకృష్ణాద్యవతారములు విష్ణువుయొక్క రూపాంతరములే యెట్లగునో అట్లే పరదేవతయొక్క రూపాంతరమే విద్యామంత్రము, ఆ కారణమున విద్య, దేవతలు వేరుకానందున ఇద్దరికి గణేశాది షట్కస్వరూపత్వము సిద్ధించినది. శ్రీచక్రమున గణేశాది రూపకము చెప్పుచున్నాడు.

**శ్లో॥ రేఖాదలకోణగణైర్ఘటనాచ్చక్రే గణేశత్వమ్ ।**
**త్రైలోక్యమోహనాద్యైర్నవభిశ్చక్రైర్గ్రహత్వం చ ॥ 39**

రేఖాదలకోణగణైః రేఖా = భూపురముననున్న మూడు రేఖలు, దళ = షోడశదళమునందున్న పదహారు దళములు, అష్టదళ పద్మమునందున్న ఎనిమిది దళములు, కోణ = చతుర్దశారచక్రము నందున్న పదునాలుగు కోణములు, బహిర్దశార చక్రమునందున్న పదికోణములు, అంతర్దశార చక్రముననున్న పదికోణములు, వసుకోణచక్రమున నున్న ఎనిమిది చక్రములు, త్రికోణ చక్రముననున్న మూడు కోణముల యొక్క, గణైః = సమూహములచే ఘటనాత్ = కూడుట వలన, చక్రే = శ్రీచక్రమునందు, గణేశిత్వమ్ = గణేశత్వభావము సిద్ధించినది.

ఇక గ్రహరూపత్వము చెప్పుచున్నాడు.

త్రైలోక్యమోహనాద్యైః = త్రైలోక్యమోహనము మొదలగు. నవభిః = తొమ్మిదియైన, చక్రైః = చక్రములతో, ఘటనాత్ = కూడుటవలన, గ్రహత్వం చ = గ్రహస్వరూపము సిద్ధించినదని భావము.

ఇక చక్రమునకు నక్షత్ర రూపమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ వృత్తత్రయధరణీత్రయమన్వశ్రాణాం విభజ్య గణనేన ।**
**సప్తభిరితరైశ్చక్రైశ్చక్రే నక్షత్రరూపత్వమ్ ॥ 40**

వృత్తత్రయ = అష్టదళ, షోడశదళములకు ముందు ఒక వృత్తము, అష్టదళ, షోడశదళముల మధ్య ఒకటి, వీటి అంతమున ఒకటి, ఇట్లు మూడు వృత్తములు, ధరణీత్రయ = భూపుర రేఖలు మూడు, మన్వశ్రాణామ్ = చతుర్దశారచక్రముననున్న త్రికోణములు పదునాలుగింటి యొక్క, విభజ్య = విడిగ, గణనేన = లెక్కించుటచేత, ఇతరైః = శ్రీచక్రము నందలి, భూపుర, మన్వస్రముల కంటే వేరైన, సప్తభిః = ఏడగు, చక్రైః = చక్రములచేత, చక్రే = శ్రీచక్రమునందు, నక్షత్ర రూపత్వం = నక్షత్ర స్వరూపము సిద్ధించినది.

**తా :** శ్రీచక్రమున మూడు వృత్తములున్నవి, మొదటిది, అష్టదళ, షోడశదళములకు ముందు, రెండవది, ఆ రెంటిమధ్య, మూడవది వాని యంతమున కలవు. భూపురచక్రమున మూడు రేఖలున్నవి. మన్వశ్ర చక్రమున పదునాలుగు త్రికోణములున్నవి, వీనిని విడివిడిగ (3+3+14) లెక్కించినచో ఇరువది యగును. భూపురము, మన్వశ్రము అనెడి రెండు చక్రములు ఈ యిరువదిలో లెక్కింపబడుటచే శ్రీచక్రమున ఇక ఏడు చక్రములు గలవు. వాటిని నొక్కొక్కటిగా లెక్కించిన మొత్తము ఇరువది యేడు సంఖ్య సిద్ధించును. ఈ సంఖ్యాసామ్యమును బట్టి శ్రీచక్రము నక్షత్రరూపత్వమని భావింపవలయును.

ఇక శ్రీచక్రమున యోగినీ రూపత్వము చెప్పుచున్నాడు.

**శ్లో॥ స్థితిసంహృతిచక్రే ద్వే పద్మే ద్వే వృత్తభూగృహే చ ద్వే ।**
**ఏవం షడ్భిర్యోగాచ్ఛ్రీచక్రం యోగినీరూపమ్ ॥ 41**

స్థితి సంహృతి చక్రే = స్థితి, సంహారచక్రములు, ద్వే = రెండు, పద్మే = షోడశదళ, అష్టదళ పద్మములు, ద్వే = రెండు, వృత్తభూగృహే చ = వృత్తత్రయ, భూపురమున్ను, ద్వే = రెండు, ఏవమ్ = ఈ విధముగ, షడ్భిః = ఆరింటితో, యోగాత్ = సంబంధము వలన, శ్రీచక్రం = శ్రీచక్రము, యోగినీరూపమ్ = యోగినీ స్వరూపము.

**తా :** శ్రీచక్రమున తొమ్మిది చక్రములు గలవు. అందు సంహారచక్రము, స్థితిచక్రము, సృష్టిచక్రము అను పేరున మూడు చక్రములు గలవు. ఎట్లన, **బిందు, త్రికోణ, వసుకోణ చక్రములు మూడు** – సంహారచక్రము; **అంతర్దశార, బహిర్దశార, చతుర్దశార చక్రములు మూడు** – స్థితిచక్రములు; **అష్టదళ, షోడశదళ, భూపురచక్రములు మూడు** – సృష్టిచక్రము. అందు స్థితి సంహృతి చక్రములు రెండు విభాగములు లేక స్థితి చక్రమొకటి. మొత్తము రెండు చక్రములు. సృష్టిచక్రమున పద్మములు రెండు. అష్టదళపద్మము ఒకటి, షోడశదళపద్మము మరొకటి. వృత్తత్రయము ఒకటి, భూపురము ఒకటి అవి మొత్తం రెండు. ఇట్లు (3×2=6) ఆరింటితో సంబంధించి యుండుట వలన శ్రీచక్రము యోగినీ రూపము. యోగినులు అనగా, డాకిన్యాదులు, ఆరుగురు శ్రీచక్రమున ముందు చెప్పబడిన విధముగ ఆరు అవయవములు, యోగినీ రూపములని తెలియవలయును.

**అవ :** తరువాత రాశిరూపత్వమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ పంచచతుశ్శక్త్యనలా బిందుర్వృత్తం చ భూబింబమ్ ।**
**ఏవం ద్వాదశసంఖ్యైర్ఘటనాచ్చక్రస్య రాశిత్వమ్ ॥ 42**

పంచచతుశ్శక్త్యనలాః = అయిదు శక్తులు, నాలుగు అనలములు (అగ్నులు), బిన్దుః =

బిన్దువు, వృత్తమ్ = వృత్తత్రయము, భూబిమ్బమ్ = భూపురము, పరమ్ = ఈ విధముగ, ద్వాదశసంఖ్యైః = పంద్రెండు అంకెలతో, 5+4+1+1+1 = 12. ఘటనాత్ = కూడుటవలన, చక్రస్య = చక్రమునకు, రాశిత్వమ్ = రాశిభావము సిద్ధించినది.

**తా :** శ్రీచక్రమున తనకెదురుగనున్న త్రికోణములైదు, పరాఙ్ముఖముగనున్న త్రికోణములు నాలుగు, అనలకోణములు (అనగ శివకోణములు) ఈ విధముగ తొమ్మిది కోణములు గలవు. ఈ తొమ్మిది త్రికోణములచేత, త్రికోణ, వసుకోణ, అంతర్దశార, బహిర్దశార, చతుర్దశారములను చక్రములుత్పన్నములైనవి. ఈ కారణమున, అవి అనగా త్రికోణ, వసుకోణాదులను వేరుగ లెక్కింపనవుసరము లేదు. కనుక శక్త్యనలకోణములు తొమ్మిది (5+4 = 9) , బిందువు ఒకటి, వృత్తత్రయము ఒకటి, భూపురము ఒకటి, ఈ విధముగ పంద్రెండు సంఖ్యతో కూడి యుండుట వలన మేషాది ద్వాదశరాశిరూపము శ్రీచక్రమునకు సిద్ధించినది.

**అవ : దేవ్యా రూపాన్తరత్వేన** అనెడి 37వ శ్లోకమున విద్య, దేవతలు, వేరువేరు అవతారములే యగుట వలన అభేదము ప్రతిపాదింపబడినది. ఇప్పుడు, **విద్యకు చక్రములకు** జన్యజనక భావముండుట వలనను, అవతారాన్తరము లగుటవలనను, అభేదమని గణేశాదిరూపత్వమును దృఢముచేయుచున్నాడు.

**శ్లో॥ చక్రం విద్యాక్షరైరేవ జననాత్తదభేదవత్ ।**
**దేవ్యా రూపాంతరత్వాచ్చ తేన యుక్తోక్తరూపతా ॥ 43**

చక్రమ్ = శ్రీచక్రము, విద్యాక్షరైః ఏవ = మంత్రము నందలి అక్షరముల చేతనే, జననాత్ = పుట్టుటవలన, దేవ్యాః = పరదేవతయొక్క, రూపాన్తరత్వాచ్చ = మఱియొక రూపమగుట వలనను, తదభేదవత్ = విద్యాదేవతల కంటే భేదములేనిది, తేన = అట్లు అభేదమగుట చేత, ఉక్తరూపతా = చెప్పబడిన గణేశాదిరూపము, యుక్తా = తగియున్నది.

**తా :** శ్రీచక్రము **పంచదశీ మంత్రాక్షరముల** నుండియే పుట్టినదని ముందు నలుబడి యారవశ్లోకమున చెప్పబోవుచున్నాడు. కనుక శ్రీచక్ర, విద్యాక్షరములకు జన్యజనక భావమున్నది. కనుక ఆ రెంటికి నభేదము సిద్ధము. పరదేవతయొక్క రూపాంతరమే శ్రీచక్రము. ఆకారమున చక్ర, విద్యలు, రెండు పరదేవతయొక్క రూపాంతరములగుటచే విద్యా దేవతలతో శ్రీచక్రమునకు భేదము లేదు. మూడు అనగా, చక్రము, విద్య, పరదేవతలు ఏకరూపమే. ఈ కారణమున ముందు చెప్పబడిన గణేశాది స్వరూపము సహేతుకమేయని తెలియనగును. చక్రము విద్యాక్షరములనుండి పుట్టిన దను విషయము ముందు (46) వ శ్లోకమున చెప్పబడును.

**అవ :** ఇంతవరకు, విద్య, దేవత, చక్రములకు; గణేశ, గ్రహ, నక్షత్ర, యోగినీ, రాశ్యాత్మక

పంచకత్వరూపత్వమే ప్రతిపాదింపబడినది. పీఠ, రూపత్వము ప్రతిపాదింపబడలేదు. ఇందువలన అనగ, విద్య, దేవతా; చక్రములకు పీఠరూపత్వము చెప్పుచున్నాడు.

**శ్లో॥ యావన్మాతృకముదితాన్యేకసమేతాని పంచాశత్ ।**
**పీఠాని పునర్గణితాన్యోజాపూకాని చత్వారి ॥ 44**

యావన్మాతృకమ్ = మాతృకాక్షరము లెన్నియో అంతసంఖ్యకలుగునట్లు, ఏకసమేతాని = ఒకటితో కూడిన, పఞ్చాశత్ = ఏబది, పీఠాని = పీఠములు, ఉదితాని = చెప్పబడినవి, పునః = మఱియు, **ఓజాపూకాని = ఓడ్యాణ, జాలంధర, పూర్ణగిరి, కామగిరి అను**, చత్వారి = నాలుగు, పీఠాని = పీఠములు, గణితాని = కూర్పబడినవి.

**తా :** మాతృకామంత్రాక్షరము లేబది యొకటి, ఆసంఖ్యయే కలిగిన ఏబది యొకటి పీఠములు చెప్పబడినవి. అంతకంటే వేరగు పీఠములు నాలుగు కూడా ఏబదియొకటి పీఠములతో చేర్చబడినవి. అవి (1) ఓడ్యాణ పీఠము, 2. జాలంధర పీఠము, 3. పూర్ణగిరి పీఠము, 4. కామగిరిపీఠము, నామైకదేశే నామగ్రహణం ఒకదాని పేరు చెప్పు. ఆ పేరులో ఏకదేశమును (అనగా భాగమును) చెప్పవచ్చును. అను న్యాయమును బట్టి ఓజాపూకాని అని ఆ పీఠములను నాలిగింటిని, ఈ శ్లోకమున గ్రహించెను. ఇట్లు ఏబదియొకటితో నాలుగింటిని కలుపగా మొత్తము ఏబదియైదు పీఠములైనవి.

**అవ :** ఆ ఏబదియైదు పీఠములకు, విద్య, దేవి, చక్రములయందునికి ఎట్లు? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ గణపగ్రహభాదీనాం శశినిధితారర్తుసూర్యసంఖ్యానామ్ ।**
**మేలనతః పీఠాని జ్ఞేయాన్యేతేషు పంచపంచాశత్ ॥ 45**

ఏతేషు = ఈదేవి, విద్య, చక్రముల యందున్న, శశి = ఒకటి, నిధి = తొమ్మిది, తార = ఇరువది ఏడు, ఋతు = ఆరు, సూర్య = పండ్రెండు, సంఖ్యానామ్ = సంఖ్యలు గలిగిన, గణప = గణేశుడు, గ్రహ = నవగ్రహములు, భాదీనామ్ = ఇరువది ఏడు నక్షత్రములు మున్నగు యోగినీరాశుల యొక్క, మేళనతః = లెక్కించుటవలన, పఞ్చపఞ్చాశత్ = ఏబదియైదు, పీఠాని = పీఠములు, భవన్తి = అగుచున్నవి. జ్ఞేయాని = తెలిసికొనదగినవి.

**తా :** గణేశ, గ్రహ, నక్షత్ర, యోగినీ రాశుల, సంఖ్య లెక్కించి కలిపిన ఏబదియైదు వచ్చును. ఎట్లన శశి = గణేశుడు, నిధి = గ్రహములు తొమ్మిది, తార = నక్షత్రములు ఇరువది యేడు, ఋతు = యోగినులు = ఆరు, సూర్య = రాశులు పండ్రెండు, వీటిని కలిపిన నేబదియైదు

సంఖ్య వచ్చును. (1+9+27+6+12 = 55) పీఠములు ఏబదియైదు, గణేశాదిరాశ్యంతమున నున్న యేబదియైదు అవయవముల సమూహమునందు పీఠభావనచేయవలసినదని భావము.

**అవ :** నలుబది మూడవ శ్లోకమున సూచింపబడిన విద్యాక్షరములనుండి చక్రము పుట్టినది అను విషయమును వివరించుచున్నాడు.

**శ్లో॥ కత్రితయాదీకారాద్బిందుర్జాతస్తదగ్రిమే చక్రే ।**
**హృల్లేఖాభిస్తత్పరచక్రత్రితయం హకారాభ్యామ్ ॥ 46**

**శ్లో॥ ఏకారేణ చ తత్పరచక్రే జాతే సకారాభ్యామ్ ।**
**చతురశ్రాణి లకారైరేవం విద్యాక్షరేణ చక్రజనిః ॥ 47**

కత్రితయాత్ = మూడు క కారముల నుండియు, ఈకారాత్ = ఈ కారము నుండియు, బిన్దుః = బిందుచక్రము, జాతః = పుట్టినది. తదగ్రిమే = దానికి ముందున్న, చక్రే = రెండు చక్రములు, అనగా, త్రికోణ, వసుకోణములు, హృల్లేఖాభిః = మూడు హ్రీంకారములచేత, జాతే = పుట్టినవి, తత్పరచక్రత్రితయమ్ = దాని తరువాతి మూడు చక్రములు. అనగా, అంతర్దశార బహిర్దశార, చతుర్దశార చక్రములు, హకారాభ్యామ్ = రెండు హకారముల నుండి, ఏకారేణ చ = ఏకారము నుండియు, జాతే = పుట్టినవి, తత్పరచక్రే = దాని తరువాత రెండు చక్రములు, అష్టదళ, షోడశదళములు, సకారాభ్యామ్ = రెండు సకారముల నుండి, జాతే = పుట్టినవి, చతురశ్రాణి = నలుచదరముననున్న మూడు రేఖలు (భూపురము) లకారైః = మూడు లకారముల నుండి, జాతే = పుట్టినవి. ఏవమ్ = ఏవిధముగా, విద్యాక్షరేణ = విద్యామంత్రముచేత, చక్రజనిః = చక్రముయొక్క ఉత్పత్తి, (అభూత్ = అయినది.)

**అవ :** శ్రీగురువు యందు, తనయందును శిష్యుని యందును గణేశాది షట్కరూపత్వమును ప్రతిపాదించుచున్నాడు.

**శ్లో॥ ఏతత్త్రితయాభిన్నస్స్వగురుస్తదభేదభావనాదార్ఢ్యాత్ ।**
**తేన గణేశాదిమయస్తద్దయయా చ స్వయం తథారూపః ॥ 48**

తదభేదభావనాదార్ఢ్యాత్ = దేవీ, విద్యా, చక్రములతో కూడా తనకు నిరంతరము, అభేద-భావనానుసంధానముయొక్క దృఢతరమైన అభ్యాసమువలన, ఏతత్త్రితయాఽభిన్నః = దేవీ, మంత్ర, చక్రములకంటే అభిన్నుడై; దేవీ, మంత్ర, చక్ర త్రితయస్వరూపో భవతి ఇతి శేషః ; దేవీ, మంత్ర, చక్రముల మూడింటియొక్క స్వరూపుడగునని భావము. తేన = దేవీ, మంత్ర, చక్ర, గురువులు, అభిన్నులగుటచేత, గణేశాదిమయః = గణేశాదిషట్క స్వరూపమైన

శ్రీదేవ్యాద్యభేదభావనవలన, గణేశాదిషట్కస్వరూపుడయ్యెను, తద్దయయా = అట్టి గురువు యొక్క అనుగ్రహముచేత, స్వయమ్ = సాధకుడైన తానును, తథారూపః = అట్టి రూపము గణేశాది షట్కస్వరూపము, భవతి = అగుచున్నాడు.

**తా :** నిరంతరము గణేశాదిషట్కస్వరూపమైన శ్రీదేవీ, మంత్ర, చక్రములతో అభేదభావన చేయుటవలన భావనాదార్ఢ్యమున గురువున్ను, దేవీ, మంత్ర, చక్ర, స్వరూపములతో అభిన్నుడగును. శ్రీగుర్వనుగ్రహమున షడ్విధదీక్షాత్మకప్రసాదమున సాధకుడున్ను, అట్టి రూపముగలవాడగును.

**అవ :** కౌళికార్థము ఉపసంహరించుచున్నాడు.

**శ్లో॥ ఇత్థం మాతా విద్యా చక్రం స్వగురుస్స్వయం చేతి ।**
**పంచానామపి భేదాభావో మంత్రస్య కౌలికార్థోఽయమ్ ॥ 49**

ఇత్థమ్ = ఈ విధముగా, మాతా = పరదేవత, విద్యా = మంత్రము, చక్రమ్ = శ్రీచక్రము, స్వగురుః = తనగురువు, స్వయం + చ = సాధకుడైన తాను, ఇతి = ఈ విధమైన, పంచనామపి = ఐదుగురుకిన్నీ, భేద+అభావః = భేదము లేకపోవుట, మన్త్రస్య = పంచదశీమంత్రమునకు, కౌలికార్థః = కౌలికమనుపేరుగల అర్థము.

**తా :** ఈపైన చెప్పబడిన విధముగ శ్రీపరదేవత, మన్త్రము, చక్రము, గురువు, సాధకుడు, అను ఈ యైదుగురికి గణేశాదిషట్కస్వరూపముతో అభేదము కల్గుట పంచదశాక్షరీ మన్త్రము యొక్క అర్థము. దీనికి కౌలికార్థమని పేరు.

## 6. సర్వరహస్యార్థము.

**అవ :** సర్వరహస్యార్థము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ద్వాదశషోడశదశభిస్తపనశశిదహనకలాభిరాకీర్ణైః ।**
**పంచాశద్భిర్వర్ణైరభిన్నదేహా కులీనకుణ్డలినీ ॥ 50**

ద్వాదశ = పండ్రెండు, షోడశ = పదునారు, దశభిః = పదియునైన, తపన = సూర్యుడు, శశి = చంద్రుడు, దహన = అగ్నుల యొక్క కలాభిః = కళలతో, ఆకీర్ణైః = వ్యాప్తములైన, పంచాశద్భిః = ఏబదియగు, వర్ణైః = అక్షరములచేత, కులీనకుండలినీ = మూలాధారమున నున్న కులకుండలిని, అభిన్నదేహా = వేరుగాని రూపముగలది.

**తా :** మూలాధారమున కుండలిని గలదు. ఈ కుండలిని సూర్య, చంద్ర, అగ్ని కలారూపమైన

యేబది అక్షరముల మాతృకతో వ్యాపించినది. ఎట్లన **సూర్యకళలు పంద్రెండు**, అవి, కకారాది, అనులోమము వరుసన, భకారాది విలోమమున అక్షరమేళనము చేసిన పంద్రెండు జంటలగును, ఎట్లన [1]కంభం, [2]ఖంబం, [3]గంఫం, [4]ఘంపం, [5]ఙంనం, [6]చంధం, [7]ఛందం, [8]జంథం, [9]ఝంతం, [10]ఞంణం, [11]టంఢం, [12]ఠండం ఈ విధముగ సూర్యకళలు పంద్రెండు అక్షరములచే వ్యాప్తములైనవి. 1-తపినీ, 2-తాపినీ, 3-ధూమ్రా, 4-మరీచిః, 5-జ్వాలినీ, 6-రుచిః, 7-సుషుమ్ణా, 8-భోగదా, 9-విశ్వా, 10-బోధినీ, 11-తారిణీ, 12-క్షమా.

**చంద్రకళలు** : పదునారు, అకారాది విసర్గాంతమునగల, షోడశస్వరములచే వ్యాపింపబడినవి. 1. అమ్-అమృతా, 2. ఆమ్-మానదా, 3. ఇమ్-భూషా, 4. ఈమ్-తుష్టిః, 5. ఉమ్-పుష్టిః, 6. ఊమ్-రుచిః, 7. ఋమ్-ధృతిః, 8. ఋూమ్-శశినీ, 9. ఌమ్-చంద్రికా, 10. ౡమ్-కాంతిః, 11. ఏమ్-జ్యోత్స్నా, 12. ఐమ్-శ్రీః, 13. ఓమ్-ప్రీతిః, 14. ఔమ్-అంగనా, 15. అం-పూర్ణా, 16. అః-పూర్ణామృతా.

**అగ్నికళలు** = పది. అవి యకారాది క్షకారాంత దశవర్ణములచే వ్యాప్తములైనవి. 1. యమ్-ధూమ్రార్చిః, 2. రమ్-ఊష్మా, 3. లమ్-జ్వలినీ, 4. వమ్-జ్వాలినీ, 5. శమ్-విస్ఫులింగినీ, 6. షమ్-సుశ్రీ, 7. సమ్-సురూపా, 8. హమ్-కపిలా, 9. ళమ్-హవ్యవాహినీ, 10. క్షమ్-కవ్యవాహినీ.

ఈ విధముగ కులకుండలిని మాతృకాభిన్నమై పంచాశత్ వర్ణరూపమున నున్నది.

**శ్లో॥ బిసతన్వీ తటిదాభా మూలాధారస్థపద్మశృంగాటాత్ ।**
**భిత్త్వా మూలహృదాజ్ఞాగతవహ్నిరవీందుమణ్డలత్రితయమ్ ॥ 51**

ఏషా = ఈ కులకుండలిని, బిసతన్వీ = తామరతూడులోని దారమువలె సూక్ష్మమైనది. తటిదాభా = మెరుపుతో సమానమైన కాంతిగలది. మూలాధారస్థ పద్మశృంగాటాత్ = మూలాధారపద్మమునందలి త్రికోణమునుండి, మూలహృదాజ్ఞా... త్రితయమ్ = మూలాధారముననున్న అగ్నిమండలమును, హృదయమున నున్న సూర్యమండలమును, ఆజ్ఞాచక్రమున నున్న చంద్రమండలము ఈ మూడు మండలములను, భిత్త్వా = భేదించి

**తా :** ఈ కులకుండలిని, తామరతూడులోని దారమువలె సూక్ష్మమైనది. మెఋపుయొక్క కాంతి వంటి కాంతిగలది. ఇది మూలాధారపద్మమున 3 1/2 మూడున్నర చుట్లగ (వలయముగ) చుట్టుకొని అధోముఖియై యుండును. సాధకుడు ప్రయత్నించి యూర్ధ్వ ముఖముగా బ్రహ్మరంధ్రమున నున్న ఊర్ధ్వ సహస్రారమునందలి అకులకుండలినితో కలుపును. ఇది ఈ మధ్యనున్న చక్రములను భేదించుకొని పోవును.

అధఃసహస్రారము మొదలు, ఊర్ధ్వసహస్రారము వఱకు నున్న ప్రదేశము, మూడు మండలములుగ నున్నది. అగ్నిమండలము–మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరకముల వరకు, సూర్యమండలము–హృదయమునందలి అనాహతము, కంఠము నందలి విశుద్ధము వరకు వ్యాపించి యున్నది. చంద్రమండలము–ఆజ్ఞాచక్రమున వ్యాపించినది. సుషుమ్నామార్గమున ప్రయాణించుచు, ఈ మూడు మండలములను భేదించుకొని కుండలిని చిచ్చంద్రమండలమున ప్రవేశించునని ముందు శ్లోకముతో అన్వయము.

**శ్లో॥ వ్యోమని చిచ్ఛశిమణ్డలమధ్యే త్వకులేన సంగమ్య ।**
**ఉభయాంగసంగజన్యం ప్రవాహయంతీ సుధాపూరమ్ ॥ 52**

**శ్లో॥ స్వయమపి తత్పానవశాన్మత్తా భూత్వా పునశ్చ తేనైవ ।**
**మార్గేణ పరావృత్య స్వస్మిన్ స్థానే సుఖం స్వపితి ॥ 53**

వ్యోమ్ని = పరమాకాశమున, చిచ్ఛశి–మండల–మధ్యే తు = చిచ్ఛంద్రమండల మధ్యము నందు, అకులేన = అకుల కుండలినితో, సంగమ్య = కలసి, ఉభయాంగ సంగజన్యమ్ = కులకుండలిని, అకుల కుండలిని, (శక్తి = కులకుండలిని, శివ = అకులకుండలిని) స్వరూపముల యొక్క ఈ రెంటి శరీరసంబంధముచే పుట్టిన, సుధాపూరమ్ = అమృత–ప్రవాహమును, ప్రవాహయంతీ = స్రవింపచేయుచున్నదై, స్వయం + అపి = తానున్ను, తత్పానవశాత్ = అమృతపానమువలన, మత్తా భూత్వా = పరవశురాలై, పునశ్చ = మఱల, పరావృత్య = వెనుకకు తిరిగి, తేనైవ మార్గేణ = ఆ సుషుమ్ణామార్గముననే, స్వస్మిన్ + స్థానే = తన నివాసమైన మూలాధారత్రికోణమధ్యమున, సుఖమ్ = సుఖముగా, స్వపితి = నిద్రించుచున్నది.

**తా :** అగ్ని, సూర్య, చంద్ర మండలములను భేదించుకొని ఊర్ధ్వముగా వెడలి పరమాకాశమున చిచ్చంద్ర మండలమును ప్రవేశించును. **ద్వ్యంగుళోర్ధ్వం శిరోదేశం పరం వ్యోమ ప్రకీర్తితమ్** శిరఃప్రదేశమున నుండి రెండంగుళముల పైన పరాకాశము కలదని తంత్రము చెప్పుచున్నది. అందు అధోముఖసహస్రారమధ్యమున చిచ్చంద్రమండలమున్నది. ఆ మండలమధ్యమున, అకులకుండలిని కలదు. అది శివస్వరూపము. మూలాధారమునుండి వెళ్లిన కులకుండలిని శక్తిస్వరూపము. ఆ చిచ్చంద్రమండలమున ఉభయకుండలినులు, అంగసంగమమున కలియుటచే, అమృతప్రవాహము స్రవించును. ఆ యమృతపానముచే కులకుండలిని పరవశయై వెనుకకు మఱలి సుషుమ్ణా మార్గమున ప్రయాణించుచు ఆజ్ఞాచక్రము మొదలు, మూలాధారము వఱకు గల మండలములను (పద్మములను) మాతృకాక్షరరూపమైన అమృతబిందువులచే

తడుపుచూ మఱల మూలాధారపద్మకర్ణికామధ్యమున నున్న త్రికోణమున అధోముఖియై తోకతో సుషుమ్నా మార్గమును కప్పి నిద్రించును. ఈ విషయము గురుముఖమున బాగుగా తెలిసి కొనవలసినది.

**శ్లో॥ సాక్షాద్విద్యైవైషా న తతో భిన్నా జగన్మాతా ।**
**అస్యాస్స్వాభిన్నత్వం శ్రీవిద్యాయా రహస్యార్థః ॥ 54**

ఏషా = ఈ కులకుండలిని, సాక్షాత్ = ప్రత్యక్షముగా, విద్యా + ఏవ (విద్యైవ) = శ్రీవిద్యయే, జగన్మాతా = పరదేవత, తతః = కుండలినీ స్వరూపముకంటే, భిన్నా = వేరైనది, న = కాదు, అస్యాః = కులకుండలిని కంటే, స్వ+అభిన్నత్వమ్ = తనతో (జీవునకు) భేదము లేకపోవుట, శ్రీవిద్యాయాః = శ్రీవిద్యయొక్క పంచదశియొక్క, రహస్యార్థః = రహస్యమైన యర్థము.

**తా :** చిచ్చంద్ర మండలమున గల కులకుండలిని ప్రత్యక్షముగా శ్రీవిద్యయైన పంచదశీ మంత్రమే. పరదేవత కుండలినికంటే వేరుకాదు. కుండలిని జీవునకంటే వేరుకాదు. ఈవిధముగా **కుండలిని, శ్రీవిద్య, పరదేవత, జీవుడు** అను ఈ నలుగురికి అభేదముచెప్పుట శ్రీవిద్యయైన పంచదశాక్షరీ మంత్రముయొక్క సర్వరహస్యార్థము.

## 7. మహాతత్త్వార్థము.

**శ్లో॥ వాగింద్రియైరగమ్యే తత్త్వాతీతే మహత్తరేఽణుతరే ।**
**వ్యోమ్నోఽప్యుపరి స్థితిమతి విశ్వాభిన్నే చిదానందే ॥ 55**

**శ్లో॥ బ్రహ్మణి పరే నియోజ్యస్స్వాత్మా తదభేదసంప్రాప్త్యై ।**
**ఏష మహాతత్త్వార్థశ్శ్రీవిద్యాయాశ్శివేనోక్తః ॥ 56**

వాగిన్ద్రియైః = వాక్కుచేత, ఇంద్రియములచేత, అగమ్యే = ఇట్టిదని చెప్పుటకు, తెలిసికొనుటకు శక్యముగానిది, తత్త్వాతీతే = షట్త్రింశత్తత్వములకంటే వేరైనది. మహత్తరే = అన్నిటికంటే గొప్పది. అణుతరే = సూక్ష్మములన్నిటికంటే సూక్ష్మమైనది. వోమ్నః + అపి = పరాకాశము కంటెను, ఉపరి = పైన, స్థితిమతి = ఉన్నది, విశ్వాభిన్నే = ప్రపంచరూపమున పరిణమించిన స్ఫురణశక్తికంటే అభిన్నమైనది, చిదానందే = స్వప్రకాశసుఖస్వరూపమైనది, పరే = నిరతిశయమైనది. అన్నిటికంటే గొప్పదైనదియునగు, బ్రహ్మణి = బ్రహ్మయందు, తదభేద–సంప్రాప్త్యై = తనకు అట్టి బ్రహ్మతో అభేదము సిద్ధించుట కొఱకు, స్వాత్మా =

కులకుండలినీ రూపమున సంకుచితస్వరూపుడగు తాను (జీవుడు) నియోజ్యః = కలుపదగిన వాడు, కూర్పదగినవాడు.

**తా :** జీవునకు ఆత్మకు బ్రహ్మకు, అభేదభావన మహాతత్త్వార్థము. బ్రహ్మస్వరూపము నిత్యసిద్ధమే యైనను, బ్రహ్మాభేదము నిత్యసిద్ధమే యైనను అజ్ఞానము వలన అబద్ధమైన విషయముగా భావించు జీవుడు మఱల అభేదస్ఫురణకు గురు, శాస్త్రములయందు విశ్వాసముంచి వారు చెప్పిన ప్రకారము బ్రహ్మాభేదజ్ఞానమును మరల పొందుట యేదిగలదో అదియే స్వాత్మ-నియోజనము. అదియే మహాతత్త్వార్థము.

బ్రహ్మస్వరూపము వాక్కుచే చెప్పనలవికానిది. ఇంద్రియములచే తెలియరానిది, మనస్సుచే మననము చేయ వీలుకానిది. షట్త్రింశత్తత్త్వరూపమైన ప్రపంచము కంటే అతీతమైనది. కేవల శూన్యమైన **అ**కార **హ**కార స్వరూపమైనది. "**అణోరణీయాన్మహతో మహీయాన్**" అను శ్రుతిచే ప్రతిపాదింపబడిన విధముగ మహత్పదార్థములకంటే మహత్తైనది, అణుపదార్థముల కంటే మఱియు అణురూపముగలది. సూక్ష్మపదార్థములకంటే సూక్ష్మమైనది. పరాకాశ జగముకంటే ఊర్ధ్వమున నున్నది. ప్రపంచస్వరూపమున పరిణమించిన స్ఫురణశక్తితో అభిన్నమై కలసి యున్నది. స్వప్రకాశసుఖస్వరూపమైనది. అట్టి బ్రహ్మతో అభేదమును తనకు సిద్ధించుట కొఱకై కులకుండలినీ రూపమైన తన స్వరూపమును బ్రహ్మతో అభిన్నముగ బ్రహ్మాభిన్నముగ భావింప వలయును.

ఈ యర్థము శివునిచే చెప్పబడినది. భావార్థము మొదలు మహాతత్త్వార్థము వఱకు శివుడు పార్వతి నుద్దేశించి చెప్పెను. ఇది **యోగినీహృదయతంత్రమున** నున్నది. ఇందువలననే అవయవ శక్తిలేకున్నను నిది ప్రమాణమైనది. ఆప్తవాక్యం శబ్దప్రమాణం అని శాస్త్రము. శివునికంటే ఆప్తుడెవరు?

## 8. నామార్థము + 9. శబ్దరూపార్థము

**అవ :** ఇక నొకశ్లోకముచే నామార్థము, శబ్దరూపార్థము చెప్పుచున్నాడు.

**శ్లో॥ తత్తద్వర్ణార్థేయం తత్తద్వర్ణస్వరూపేయమ్ ।**
**ఇతి తు శ్రీవిద్యాయా నామార్థశ్శబ్దరూపార్థః ॥** **57**

ఇయమ్ = ఈ పరదేవత, తత్తద్వర్ణార్థా = కకారాది ప్రత్యేక అక్షరమునకు అర్థము, ఇతి తు = ఇది అయితే, శ్రీవిద్యాయాః = శ్రీవిద్యయొక్క, నామార్థః = నామములకు అర్థము.

ఇయమ్ = ఈ పరదేవత, తత్తద్వర్ణస్వరూపా = కకారాది ప్రత్యే అక్షరముల స్వరూపము, ఇతి తు = ఇది అయితే, శబ్దరూపార్థః = శబ్దరూపార్థమైన అర్థము.

**తా :** శ్రీవిద్యయైన పంచదశియందున్న అక్షరములు, ప్రత్యేక ప్రత్యేక నామములు, ఆ నామములన్నిటికి పరదేవత అర్థము. ఇది నామార్థము.

పంచదశియందున్న కకారాది అక్షరముల యొక్క స్వరూపమే ఆ యా యక్షరములకు, అర్థము. ఇది శబ్దార్థము.

## 10. నామైకదేశార్థము

**అవ :** ఇక నామైకదేశార్థము చెప్పుచున్నాడు.

**శ్లో॥ కల్యాణేకాక్షర్యావీశ్రీ చాపి లలితా చ ।**
**ఇత్థం నామత్రిశతీవాచ్యోఽర్థస్తత్తదక్షరస్యాపి ॥ 58**

కళ్యాణి + ఏకాక్షర్యా + ఈశ్రీ ఇత్థమ్ = ఈ విధముగ, నామత్రిశతీవాచ్యః = మూడువందల నామములచే చెప్పబడు, అర్థః = అర్థము, తదక్షరస్యాపి = ఆ నామములయొక్క ప్రథమాక్షరము నకున్ను, అర్థః = అర్థము, భవతి = అగుచున్నది. ఇతి నామైకదేశరూపః = నామైకదేశ రూపమైన అర్థము.

**తా :** కళ్యాణీ, ఏకాక్షరీ, ఈశ్రీ, లలితాఅనువిధమున మూడువందల నామములచే చెప్పబడు అర్థము. ఈ నామములన్నిటిని కలిపి కూడినచో 300 నామములగును. ఇదియే లలితాత్రిశతీ. ఒక్కొక్క యక్షరముయొక్క అర్థము 20 విధములు, కళ్యాణి మున్నగు నామముల యొక్క ఏకదేశమైన కకారాదులకు, కళ్యాణి అను పదముయొక్క యర్థము చెప్పుట ఎట్లనగా, భీమ పదమునకు, భీమసేనుడు అను అర్థము చెప్పుటవలె తెలియనగును.

**శ్లో॥ నామైకదేశమాత్రే నామగ్రహణస్య లోకసిద్ధత్వాత్ ।**
**నామోపస్థితిగమ్యః ప్రోక్తో నామైకదేశార్థః ॥ 59**

నామైకదేశమాత్రే = నామముయొక్క కొద్దిదేశము మాత్రము, (గృహీతే-సతి = గ్రహింప బడగా), నామగ్రహణస్య = సంపూర్ణమైన నామము గ్రహించుట, లోకసిద్ధత్వాత్ = లోక వ్యవహారమున ప్రసిద్ధమై యుండుటవలన, నామః + ఉపస్థితిగమ్యః = ప్రసిద్ధనామము నకున్ను వ్యవహారముచే నూహింపబడుట, నామైకదేశార్థః = నామైకదేశార్థమని, ప్రోక్తః = చెప్పబడినది.

**తా :** వ్యవహారనామముయొక్క ఏకదేశమును గ్రహించి పలుకుటచే, నామము పూర్తిగా

గమ్యమై అర్థమగుట లోకవ్యవహారమున కలదు. ఎట్లన భీమసేన అను నామముయొక్క ఏకదేశమైన భీమ అనుపదమును గ్రహించి యుచ్చరించుటచే, భీమసేన అను పూర్తినామము గమ్యమై అర్థమగుచున్నది. సత్యభామ అను నామముయొక్క ఏకదేశమైన సత్య అను పదమును పలుకుటచే పూర్ణనామమైన సత్యభామ అను పదమునకు అర్థమై గోచరించుట వ్యవహారమున ప్రసిద్ధమై యున్నది. ఇట్టి వ్యవహారప్రసిద్ధమైన అర్థమునకు, నామైకదేశార్థమని పేరు. మంత్రమునగల అక్షరములకు అట్టి వ్యవహారము లోకమున ప్రసిద్ధి ఎట్లున్నది అనగా = శంకరాచార్యుల వారు సౌందర్యలహరి అను గ్రంథమున "**భజంతే వర్ణాస్తే తవ జనని నామావయవతామ్** ॥ అని చెప్పియున్నారు. దీనినిబట్టి సిద్ధపురుషులలో నిట్టి ప్రసిద్ధి కలదు గాన ఇది ప్రామాణికమైన అర్థమే.

**అవ :** ఈ నామైకదేశార్థమును ప్రస్తరించుటచే బహుభంగుల (విధముల) నున్నదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ తిథిమితబిందుగణోత్తరగజరసగిరిదస్రరామసంఖ్యాకాః ।**
**అర్థా భవంతి యోగాన్నామ్నో నామైకదేశస్య ॥ 60**

తిథిమిత = తిథిసంఖ్యతో పరిమితిగల, = 15 పదునైదు, బిందుగణ = బిందు సమూహమునకు, ఉత్తర = ఉత్తర భాగముననున్న, గజ = (8) ఎనిమిది, రస = (6) ఆరు, గిరి (7), దస్ర = రెండు (2), రామ = (3) మూడు, సంఖ్యాకాః = అంకెలు (సంఖ్యలు) కలిగిన, అర్థాః = అర్థములు, నామ్నః = నామముయొక్క, నామైకదేశస్య = నామైకదేశము యొక్క, యోగాత్ = సంబంధము వలన, భవంతి = కలుగుచున్నది.

**తా :** "**అంకానాం వామతో గతిః**' అంటుంది శాస్త్రము. లలితాత్రిశతి యందలి ప్రతినామమును మరి ఇరువది విధములుగా విస్తరించి చెప్పుటకు అవకాశమున్నది. దానిచే ఇరువదిని 15 మార్లు వేసికొని పరస్పరం గుణించగా ఏర్పడు సంఖ్యగల నామములు నిష్పన్నమగును. అనగా, $20^{15}$ = 32,768,000,000,000,000,000.

## శాక్తార్థము

**అవ :** శాక్తార్థము రెండు విధములు, 1. అవయవార్థము, 2. శక్తిసమూహార్థము అని. అందు అవయవార్థము చెప్పుచున్నాడు.

## 11. శాక్తార్థము - అవయవార్థము

**శ్లో॥ వాక్కామశక్తికూటైరవయవశో విగ్రహో మాతుః ।**
**ప్రతిపాద్యోఽత్రా కణ్ఠాదా మధ్యాదా చ పాదాగ్రాత్ ॥ 61**

వాక్ = వాగ్భవకూటము, కామ = కామరాజకూటము, శక్తికూటైః = శక్తికూటములతో, ఆ కంఠాత్ = కిరీటము మొదలు కంఠ పర్యంతము, ఆ మధ్యాత్ = కంఠాదికటి పర్యంతము, ఆ పాదాగ్రాత్ = కట్యాదిపాదాగ్ర పర్యంతము, అవయవశః = అవయవక్రమమున, మాతుః = పరదేవత యొక్క, విగ్రహో = శరీరము, ప్రతిపాద్యః = నిరూపించుకొనవలసినది.

**తా :** మంత్రావయవములను పరదేవతా శరీరముగా భావింపదగు విధమిందు చెప్పబడినది. ఈ అవయవముల నిరూపణము, శాక్తార్థమున భేదమైన అవయవార్థము పరదేవతా స్వరూపమును, ఈ విధముగా భావింపవలెను. కిరీటాగ్రము మొదలు కంఠము వరకు వాగ్భవకూటమనియు, కంఠము మొదలు కటి వఱకు కామరాజకూటమనియు, కటిమొదలు పాదాగ్రము వఱకు శక్తికూటమనియు భావింపవలయును.

## 12. శాక్తార్థము - శక్తిసమూహార్థము

**అవ :** ఇక శక్తిసమూహార్థము చెప్పుచున్నాడు.

**శ్లో॥ వేధోభారత్యౌ మాధవలక్ష్మ్యౌ రుద్రపార్వత్యౌ ।**
**రేఫాన్తవర్ణషట్కస్యార్థాన్ క్రమశో విజానీయాత్ ॥ 62**

వేధోభారత్యౌ = బ్రహ్మ-సరస్వతి, మాధవలక్ష్మ్యౌ = విష్ణువు-లక్ష్మీదేవి, రుద్రపార్వత్యౌ = శివుడు-పార్వతి, రేఫాంత వర్ణషట్కస్య = రేఫవరకు నున్న ఆరు అక్షరములకు, క్రమశః = వరుసగా, అర్థాన్ = అర్థములనుగా, విజానీయాత్ = తెలిసి కొనవలసినది.

**తా :** ప్రథమకూటమున, క కారాది రేఫవరకు, ఆరు అక్షరములు గలవు. ఈ ఆరు అక్షరములకు క్రమముగా, బ్రహ్మసరస్వతులు, విష్ణులక్ష్ములు, శివపార్వతులు అర్థములుగా భావింపవలయును.

**అవ :** కూటాంతమున నున్న మిగిలిన ఈం కారమునకు అర్థము చెప్పుచున్నాడు.

**శ్లో॥ తా ఏతాస్సకలా అపి కామకలా ఏవ న తతోఽన్యాః ।**
**సామానాధికరణ్యాదీకారేణాయమర్థోఽస్య ॥ 63**

తాః ఏతాః సకలాః అపి = ఈ పై చెప్పబడిన సమస్తమున్ను, అనగా క కారాది రేఫాన్త

అక్షరషట్కవాచ్య బ్రహ్మాది గౌర్యంత షట్ శక్తులున్ను, కామకలా ఏవ = కామకలలే, తతః = ఆ కామకలాస్వరూపము కంటే, అన్యాః = ఇతరములైనవి, న = కావు, ఈం కారేణ = ఈం కారముతో, సమానాధికరణ్యాత్ = కకారాద్యక్షరషట్కమునకు, ఒక కూటమున సహప్రయోగము వలన, అస్య = దీనికి (ఈ మంత్రమునకు), అయమ్ అర్థః = ఈ అర్థము.

**తా :** కామకలాక్షరమైన ఈంకారముతో కకారాద్యక్షరషట్కమునకు అర్థమైన బ్రహ్మాది షట్శక్తులు, సహప్రయోగము కల్గియుండుటచే నివి అన్నియు, కామకలాస్వరూపములే, అని యర్థమగు చున్నది. కామకలారూపపరదేవతా జన్యములగుట వలన, కామకలాస్వరూపముకంటే వేరు కావు.

**అవ :** ఈ విధముగా ప్రథమకూటమునకు అర్థము చెప్పి, రెండు, మూడవ కూటములకు అర్థము చెప్పుచున్నాడు.

**శ్లో॥ అయమేవ కూటయోరపి పరయోరర్థః పరం తు తార్తీయే ।**
**ద్వైతీయీకద్వైతీయీకహకారస్సకారతః పూర్వః ॥ 64**

పరయోః = ఇతరములైన, కూటయోః అపి = రెండు, మూడు కూటములకున్ను, అయమేవ = ఇదియే, అర్థః = అర్థము, పరం తు = కాని, తార్తీయే = మూడవ కూటమునందు, ద్వైతీయీక ద్వైతీయీక హకారః = రెండవ కూటమునందలి రెండవ హకారము, సకారతః = స కారమునకంటె, పూర్వః = మొదట, (యోజ్యః = కూర్పదగినది.)

**తా :** ప్రథమకూటమువలెనే, రెండు మూడు కూటములగు, కామరాజ, శక్తికూటములకు, అర్థము నిరూపింపవలసినది. ద్వితీయకూటమున హకారాది రేఫాంతము 7 అక్షరములున్నవి. తృతీయ కూటమున సకారాది రేఫాంతము అయిదు అక్షరములున్నవి. కాగా, ఆ రెండు కూటములకు, బ్రహ్మాది పార్వత్యంత షట్శక్తిరూపత ఎట్లు అనుశంకకు సమాధానము చెప్పుచున్నాడు, రెండవ కూటమునన్ను రెండవ హకారమును, మూడవ కూటమున ప్రథమాక్షరమగు సకారము కంటే ముందు చేర్చుకొనవలయును. అట్లగుచో ద్వితీయ, తృతీయ కూటములకు కూడా ఆరు అక్షరములు సంభవించును. వాటికి బ్రహ్మాది పార్వత్యంత షట్ శక్తివాచకత్వము వానికి కామకలాస్వరూపత్వము ప్రథమకూటమువలె నిరూపించవచ్చును.

**శ్లో॥ అన్వయితవ్యోఽక్షరశః శక్తేశ్శాక్తైర్విభావ్యత్వాత్ ।**
**వామేచ్ఛాదికశక్తిమయత్వోక్తేరేష శాక్తార్థః ॥ 65**

అన్వయితవ్యః = అన్వయించుకొనవలయును, ఈ పదము పూర్వశ్లోకముతో అన్వయించుకొనవలెను. శాక్తార్థము, అను పదమునకు వ్యుత్పత్తిని చెప్పుచున్నాడు.

అక్షరశః = కకారద్యక్షర క్రమమున, శక్తేః = బ్రహ్మాదులయందు, అభిధావృత్తిచే రూఢిగా చెప్పబడుటగాని, శక్తైః = ఉపాసకులచేత, విభావ్యత్వాత్ = ఉపాసింపబడుటవలన గాని, వామేచ్ఛాదిక శక్తిమయత్వోక్తేః = కకారాదులకు వామేచ్ఛాది శక్తులతో, అభేదమును వర్ణించుట వలనగాని, ఏషః = ఇది, శాక్తార్థః = శాక్తార్థము అని, (నిర్దిష్టః = నిశ్చయింప బడినది.)

**తా :** ఇందున్న అన్వయితవ్యః అను పదమును పూర్వ 64వ శ్లోకమున చేర్చుకొని అర్థమును చెప్పుకొనవలయును. ఈ చెప్పబడిన అర్థమునకు శాక్తార్థమను పేరు కలుగుటకు మూడు విధములైన కారణములు చెప్పుచున్నాడు. "**అస్మాత్‌పదాత్ అయమర్థో బోధవ్యః**" ఇతి ఈశ్వర సంకేతః శక్తిః. ఆ సంకేతమునకు శక్తి అని పేరు.

కకారాద్యక్షరక్రమమున బ్రహ్మాదుల యందు శక్తియుండుటచే శాక్తార్థమని పేరు. లేక శక్త్యుపాసకులచే భావింపబడుట వలన శాక్తార్థమని పేరు. వామేచ్ఛాది శక్తులతో అభేదము చెప్పుట వలన శాక్తార్థమని పేరు. ఈ విధముగా మూడు కారణములచే శాక్తార్థమని అన్వర్థనామము సంభవించినది.

**అవ :** తరువాత సామరస్యార్థము చెప్పుచున్నాడు.

**శ్లో॥ కహయోర్లసయోరర్థౌ శివశక్తీ శుద్ధయోరచోః శక్తిః ।**
**ఉభయోస్సమరసభావో హృల్లేఖాయాః పరం బ్రహ్మ ॥ 66**

కహయోః = కకార హకారములకు, లసయోః = లకార, సకారములకు, శుద్ధయోః = ఇతర అక్షరములతో కలియని, ఉభయోః = రెండైన, అచోః = అచ్చులకు, ఏకార,ఈ కారములకు, శివశక్తీ = శివుడు శక్తియు, అర్థౌ = అర్థములు, హృల్లేఖాయాః = హ్రీం-కారములకు, ఉభయోః = శివశక్తులయొక్క, సమరసభావః = శివశక్తి సామరస్య స్వరూపమైన, పరం బ్రహ్మ = పరబ్రహ్మము నిరతిశయమైన బ్రహ్మస్వరూపము, అర్థః = అర్థము.

**తా :** మూడు హృల్లేఖల కంటే వేరైన (12) పండ్రెండు అక్షరములలో (3) మూడు కకారములకు, (2) రెండు హకారములకు, శివుడని అర్థము. (3) మూడు లకారములకు, 2 సకారములకు, ఏకార ఈ కారములకు, శక్తియే అర్థము. (3) మూడు హృల్లేఖలకు శివశక్తి సామరస్యమైన నిరతిశయబ్రహ్మము అర్థము. ఆ యా కూటములందున్న హృల్లేఖలకు ఆ యా కూటము నందున్న సామరస్యస్వరూపపరబ్రహ్మమే అర్థము.

ప్రతికూటమునందు శివవాచకమైన అక్షరములు, శక్తివాచకమైన అక్షరములు, ఉభయ

సామరస్యరూపమైన బ్రహ్మమును బోధించు హ్రీంకారమున్ను కలవు, కనుక ప్రతికూటము వ్యష్టి సమష్టి భేదముచే నుభయ సామరస్యమై బ్రహ్మను బోధించుచున్నది.

**అవ :** ఈ విధముగ సామూహికముగా మంత్రమున కంతయూ అర్థమును చెప్పి ప్రతికూటమును విభజించి చూపుచున్నాడు.

**శ్లో॥ బ్రహ్మైవ శివశ్శక్తిశ్చేతి ప్రత్యేకకూటార్థః ।**
**శివశక్తిసామరస్యాద్విద్యాయా ఏష సామరస్యార్థః ॥ 67**

శివః = శివుడు, శక్తిః + చ = శక్తియున్ను, బహ్మైవ = బ్రహ్మమే, ఇతి = అని, ప్రత్యేక కూటార్థః = విడివిడిగా ప్రతికూటమునకు అర్థము, శివశక్తిసామరస్యాత్ = శివశక్తుల సామరస్యమువలన, విద్యాయాః = విద్యయొక్క, ఏషః = ఈ అర్థము, సామరస్యార్థః = సామరస్యార్థము అని, (నామతః ప్రసిద్ధః = పేరుగా ప్రసిద్ధమైనది.)

**తా :** శక్తియు, బ్రహ్మమే, బ్రహ్మకంటే వేరైన తత్త్వములు, శివుడుగాని, శక్తిగాని కావు. ఈ విషయము ప్రతికూటముయొక్క అర్థము. ఎట్లన వాగ్భవకూటమున క కారము శివస్వరూపము, కకారము తరువాత ఏ, ఈ , ల అను మూడక్షరములకు శక్తి అని అర్థము. హ్రీం కారమునకు తదుభయసామరస్య మని అర్థము. కామరాజకూటమున రెండు హకారములు, క కారము శివస్వరూపములు; ల కార స కారములు శక్తి స్వరూపములు; హ్రీం కారము తదుభయ-సామరస్యాత్మకము. శక్తికూటమున కకారము శివస్వరూపము; ల కార స కారములు శక్తిస్వరూపములు; హ్రీం కారము సామరస్యాత్మకము.

**అవ :** తరువాత సమస్తార్థమును చెప్పుచున్నాడు.

## 13. సమస్తార్థము

**శ్లో॥ కన దీప్తావితి ధాతోః ప్రకాశకత్వం కకారార్థః ।**
**అధ్యయనార్థకతేజః స్యాదేకారస్తదీయకరణార్థః ॥ 68**

**శ్లో॥ వర్ణద్వయమేలనతః ప్రకాశికా బుద్ధిరిత్యర్థః ।**

**తా :** కన దీప్తౌ అను ధాతువునుండి, ఉత్పన్నమైన కకారమునకు ప్రకాశకము అని అర్థము. అధ్యయనము అను అర్థము కలిగిన ఇఙ్ ధాతువునుండి పుట్టిన ఏకారమునకు బుద్ధి అని అర్థము.

రెండు వర్ణముల యొక్క మేళనము వలన కలిగిన క ఏ లకు ప్రకాశమైన బుద్ధి అని

యర్థము. ప్రకాశకమనగా సూక్ష్మమని అర్థము. సూక్ష్మబుద్ధి అని అర్థము తేలినది. ఈ సమస్తార్థప్రకరణమున మూలమే వ్యాఖ్యారూపమున నున్నందున, తత్ సామరస్యము చెప్పబడినది. అధ్యయనసాధనమైన బుద్ధి అని అర్థము.

**ఈ వ్యాప్తావితి ధాతోస్తస్యా వ్యాప్తిస్తృతీయవర్ణార్థః ॥ 69**

**శ్లో॥ తస్యా లహర్యాధిక్యం తన్నిర్మాణం మకారార్థః ।**

**తా :** ఈ వ్యాప్తౌ అను ధాతువు నుండి పుట్టిన ఈకారమునకు వ్యాప్తి అని అర్థము. అనగా బుద్ధివ్యాప్తి. తస్య = ఆ బుద్ధివ్యాప్తియొక్క, లహర్యాధిక్యమ్ = లహరుల ఆధిక్యం, మకారార్థః నిర్మాణమ్ = మ కారమునకు (బిందువునకు) నిర్మాణము అని అర్థము. కాగా సూక్ష్మబుద్ధ్యాధిక్యనిర్మాణము అని ప్రథమకూటముయొక్క సారాంశము.

**హన హింసాయామితి హం శౌర్యం ప్రత్యర్థిహననకరణత్వాత్ ॥ 70**

**శ్లో॥ సం భోగసాధనం ధనముపభోగార్థాత్స్యతేస్సునోతేర్వా ।**
**కము కాంతావితి ధాతోరిచ్ఛావిషయోఽంగనాదిః కమ్ ॥ 71**

**శ్లో॥ ఏషాం గమనం ప్రాపణమోహఙ్గత్యర్థధాతుజన్యం హమ్ ।**
**తస్యాతిశయో లహరీ తత్ర శ్లిష్టః సవర్ణదీర్ఘేణ ॥ 72**

**శ్లో॥ ఈకారస్తస్యార్థః కీర్తిస్సర్వాసు దిక్షు దీప్తత్వాత్ ।**
**ఈ దీప్తావితి ధాతోర్నిర్మితిరనయోర్మకారార్థః ॥ 73**

**తా :** హన హింసాయామ్ ఇతి = హన హింసాయాం అను ధాతువునుండి **హం** అను పదము పుట్టినది. దీనికి శౌర్యము అని అర్థము. శత్రువును బాధించుటకు సాధనమగుట వలన, భోగసాధనమ్ = భోగమునకు సాధనమైనది. సకారస్య, ధనమ్ ఉపభోగార్థః = ధనము ఉపభోగము అను అర్థముగల, స్యత్ అను ధాతువునుండి గాని, సున్ అను ధాతువు నుండి గాని, సం అను పదము పుట్టినది. కము కాంతౌ అను ధాతువు నుండి పుట్టిన పదము కం, దీనికి అర్థము ఇచ్ఛా విషయమైన అంగనాదులు (స్త్రీలు): వీనిని పొందుట ఇచ్ఛావిషయములైన అంగనాదులను పొందుట కూటమధ్యమమున నున్న హ కారమునకు అర్థము. (హన) గతి = పొందుట, అను ధాతువునుండి పుట్టినది, హం, అను పదము. కాన విషయములను పొందుట అను అర్థము. మధ్యమ హ కారమునకు కలిగినది సంభవించినది. ఆ గమనము యొక్క అతిశయము లహ్రీం అను పదమునకు అర్థము. అచ్చుటి **హ్రీం** అను పదమున దీర్ఘ ఈ కారము శ్లేషమై (వేరై) యున్నది.

ఈకారమునకు అర్థము కీర్తి. కీర్తి అన్ని దిక్కుల యందు ప్రసిద్ధిని కలిగించుట వలనః ఈ దీప్తౌ అను ధాతువు నుండి పుట్టినదని చెప్పవలయును. మకారము నకు (బిందువునకు) నిర్మాణము అని అర్థము.

**తా :** ద్వితీయకూటమున మొదటి హకారమునకు అర్థము శౌర్యము, స కారమునకు అర్థము ధనము, క కారమునకు అర్థము స్రక్ చందన వనితాది సంపత్తి, రెండవ హ కారము యొక్క అర్థము సంపత్ ప్రాప్తి, లహ్రీం అను పదమునకు అర్థము ప్రాప్త్యాధిక్యము. ఛ్ఛేధింపబడిన ఈ కారమునకు కీర్తి అర్థము. అంతమున మ కారమునకు బిందువునకు అర్థము నిర్మాణము కాగా, శౌర్యధనశ్రీప్రాప్త్యాధిక్యముయొక్క కీర్తియొక్క నిర్మాణము, అని ద్వితీయకూటమియొక్క పిండితార్థము.

**అవ :** ప్రథమ ద్వితీయ కూటముల యొక్క అర్థమును పైన చెప్పిన దానిని అనుపపదించు చున్నాడు.

**శ్లో॥ వాగ్భవకూటస్యార్థస్సూక్ష్మమతివ్యాపనాధిక్యమ్ ।**
**శౌర్యధనస్త్రీయశసామాధిక్యం కామరాజార్థః ॥ 74**

**తా :** రెండు కూటముల అర్థము నుండి కలిగిన, ఆధిక్యం అను పదమునకు ఆధిక్య నిర్మాణము అని పూరించు కొనవలయును.

**అవ :** తృతీయకూటముయొక్క అర్థము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఏతే సమ్యక్కలయతి సకలా హరతేర్హృకారస్స్యాత్ ।**
**నిఖిలజగత్సంహర్త్రీత్యర్థస్తస్యాపి వర్ణస్య ॥ 75**

**తా :** ఈ ఉభయ నిర్మాణములను అనగా, ప్రథమ, ద్వితీయ కూటార్థమున చెప్పబడిన నిర్మాణములను రెంటిని, సమ్యక్, బాగుగా, కలయతి = చేయుచున్నది. (ఉపాసకులకు) కనుక సకల అయినది. హృ హరణే అను ధాతువునకు జగత్ సంహారము చేయుట యని అర్థము.

**అవ :** ఈ కారమునకు, అర్థము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఈకారః ప్రశ్లిష్టః సృష్టిస్థితిరూపదీప్తికర్త్రర్థః ।**
**యద్వా హృది ఖే దహరే ప్రకాశతే తేన మాతా హ్రీః ॥ 76**

ప్రశ్లిష్టః ఈకారః = హ్రీం అను పదమును భేదించి, ఈ అను పదము వేరు చేయబడినది. (పూర్వశ్లోకమున) సృష్టిస్థితిరూపదీప్తి కర్త్రర్థః = సృష్టి, స్థితి, రూపదీప్తిని చేయునది, యద్వా =

లేక, హృది = హృదయమున, దహరే ఖే = దహరాకాశమున, ప్రకాశతే = ప్రకాశించుచున్నది. తేన = ఆ కారణముచేత, మాతా = తల్లి, హ్రీః = హ్రీ అని చెప్పబడినది.

**తా :** ఈ కారమునకు సృష్టిస్థితులను కల్గించి ప్రకాశించునది అని అర్థము. లేక హృదయమున గల దహరాకాశమున ప్రకాశించునది. అనియు చెప్పవచ్చును. ఈకారణమున ఈ పరదేవత హ్రీ అని చెప్పబడినది. అనగా సృష్టి-స్థితి-సంహారములను చేయునది అని గానీ, దహరాకాశమున ప్రకాశించునది యనిగాని, అర్థము చెప్పవచ్చును.

**శ్లో॥ సకలాంతేన పదేన హ్రీకారే కర్మధారయః కార్యః ।**
**తస్య విశేష్యో మస్స్యాన్నాదార్థస్సంవిదర్థో వా ॥** **77**

సకలాన్తేన పదేన = కకారము మొదలు, సకల అనునది యంతమున గల పదముతో, హ్రీకారే = హ్రీంకారము నందు, కర్మధారయః = కర్మధారయ సమాసము, విశేషణోభయ పదకర్మధారయ సమాసము, కార్యః = చేయదగినది, తస్య = ఆ విశేషణ పదమునకు, విశేష్యః = విశేష్యవాచకపదము. మః = మకారము, (బిందువు), స్యాత్ = అగును. నాదార్థః = నాదమనే అర్థము గాని, సంవిదర్థో వా = చిచ్ఛక్తియనిగాని, అర్థః = అర్థము, స్యాత్ = అగును.

**తా :** ఈ శ్లోకమున సమష్టి, మంత్రార్థము నుటంకించి (యుద్దేశించి) చెప్పుచున్నాడు. క కారము మొదలు, సకల వఱకు, ఒక విశేషణము, హ్రీయనునది మఱియొక విశేషణము. ఈ రెండు విశేషణములకు మకారము బిందువు విశేష్యము. ఆ విశేష్యమునకు అర్థము నాదము అనిగాని చిచ్ఛక్తి యనిగాని చెప్పదగును. కాగా, మంత్రమున కంతయు నిట్లు అర్థము సిద్ధించినది.

సూక్ష్మబుద్ధివ్యాపనాధిక్యనిర్మాణకర్త్రీ
శౌర్యధనశ్రీప్రాప్త్యాధిక్యనిర్మాణకర్త్రీ
నిఖిలజగత్సృష్టిస్థితిసంహారకర్త్రీ

**దహరాకాశవర్తినీ, నాదస్వరూపిణీ,** లేక **చిచ్ఛక్తి** అని పర్యవసన్నమైన అర్థము.

**అవ :** ఇక రెండు శ్లోకములతో వ్యాకరణశాస్త్రనిరోధమును పరిహరించుచున్నాడు.

**శ్లో॥ ధాతోర్బహ్వర్థత్వాద్బహులగ్రహణాత్పృషోదరాదిత్వాత్ ।**
**ఆకృతిగణపాఠేన స్వేచ్ఛానుగుణాదుణాదికల్పనతః ॥** **78**

**శ్లో॥ ఛందసి సర్వవిధీనాం వైకల్పికతావశాదముష్య మనోః ।**
**సిద్ధైః కథితేఽర్థేఽస్మిన్ వైయాకరణానుశాసనానుమతిః ॥** **79**

అముష్య = ఈ ప్రతిపాదింపబడుచున్న, మనోః = మంత్రమునకు, సిద్ధైః = అగస్త్యాది మహాఋషులచేత, కథితే = చెప్పబడిన, అస్మిన్ + అర్థే = సమస్తార్థమునందు, ధాతోః = ధాతువునకు, బహ్వర్థత్వాత్ = అనేకార్థములుండుటచేతను బహుల గ్రహణాత్ = బాహులక విధిననుసరించుట వలనను, ఆకృతి గణపాఠేన = సామ్యగణములయందు పఠించుట చేతను, స్వేచ్ఛానుగుణాత్ = ఇచ్ఛానుసారముగ ప్రకృతి ప్రత్యయములను కూర్చుట వలనను, ఉణాదికల్పనతః = ఉణాదులయందు కల్పించుటవలన, ఛందసి = ఛందస్సునందు, సర్వవిధీనామ్ = అన్ని విధులకు వ్యాకరణ శాసనములకు, వైకల్పికతావశాత్ = వైకల్పికత వికల్పభావము వలనను, వైయ్యాకరణానుశాసనానుమతిః = వ్యాకరణశాస్త్రసమ్మతి, అస్తి = ఉన్నది.

**తా :** సిద్ధులైన అగస్త్య, హయగ్రీవ, పరశురామాది, మహర్షులు చెప్పిన ఈ సమస్తార్థము నందు, ధాతువు, బహ్వర్థమగుట మున్నగు, ఏడు కారణములవలన వ్యాకరణశాస్త్రసమ్మతి కలదు. ఈ సప్తహేతు వివరణమును భాస్కరరాయ వ్యాఖ్యానమున చూడనగును.

**అవ :** సమస్తార్థము నుపసంహరించుచున్నాడు.

**శ్లో॥ బహుతరసమాసయోగాత్సమస్తపురుషార్థసాధనత్వోక్తేః ।**
**సంక్షేపాత్సారోక్తేః శ్రీవిద్యాయాస్సమస్తార్థః ॥ 80**

**తా :** సమస్తార్థమను పేరు కలుగుటకు కారణములను నాలుగు చెప్పుచున్నాడు.

1. అనేకసమాససంబంధమువలన సమస్తార్థము
2. సమస్తపురుషార్థసాధనమగుటవలన సమస్తార్థము
3. సంక్షేపమగుటవలన సమస్తార్థము
4. విషయసారమగుటవలన సమస్తార్థము.

అను చతుర్విధవ్యుత్పత్తులతో **శ్రీవిద్య**కు సమస్తార్థము ప్రతిపాదింపబడినది.

**అవ :** ఇక సగుణార్థము చెప్పుచున్నాడు.

## 14. సగుణార్థము

**శ్లో॥ కో విధిరేకారో హరిరకార ఈశస్తువార్థమీడపదమ్ ।**
**ద్విస్వరమధ్యగతస్య డకారస్య ళకార ఆదేశః ॥ 81**

క = బ్రహ్మ, ఏ = హరి; విష్ణువు, అ = రుద్రుడు, ఈడే = స్తుతి, స్తోత్రము చేయదగిన, ద్విస్వరమధ్యగతస్య = రెండు అచ్చులమధ్యనున్న, డకారస్య = డ కారమునకు, ళకారః = ళ కారము, ఆదేశః = స్థానివద్భావమున వచ్చినది.

**తా :** ప్రథమకూటమున కకారమునకు బ్రహ్మ అని అర్థము. ఏ కారమునకు విష్ణువు, ఏ కారము తరువాత పూర్వరూపసంధిచేత, అకారప్రశ్లేషగా సంభవించిన అకారమునకు రుద్రుడర్థము. ఈడ స్తుతౌ ఇతి ధాతోరచి స్తుత్య ఇత్యర్థః । = స్తుతింపదగినది అని బ్రహ్మకు విశేషణము. హ్రీం అనునది బ్రహ్మవాచకము. బ్రహ్మ, విష్ణు, రుద్రులచే స్తుతింపదగిన నిరతిశయబ్రహ్మము అని యర్థము. ఈడ = అనునది స్తోత్రవాచకము. ఆ డకారమునకు, ళ కారము ఆదేశముగ వచ్చినది. ఆదేశమనగా ఒక అక్షరస్థానమున మఱొక అక్షరము వచ్చుట.

**ద్వయోశ్చాస్య స్వరయోర్మధ్యమేత్య సంపద్యతే స డకారో ళకారః।** ఇతి బహ్వచప్రాతిశాఖ్య ననుసరించి ఈ ఆదేశము కలిగినది.

**శ్లో॥ తేనర్గ్వేదాత్మత్వం సూచితమాద్యస్య కూటస్య ।**
**క్రమశోఽగ్రిమకూటయుగే తేన యజుస్సామతా సిద్ధా ॥ 82**

తేన = ఈడే అనుపదముతో కూడుట చేత, ఆద్యస్య = మొదటిదియైన, కూటస్య = వాగ్భవ కూటమునకు, ఋగ్వేదాత్మత్వమ్ = ఋగ్వేదస్వరూపమగుట చేత, అగ్రిమకూటయుగే = ముందున్న ద్వితీయ, తృతీయ కూటములందు, క్రమశః = వరుసగా, యజుస్సామతా = యజుర్వేదస్వరూపము, సామవేదస్వరూపమున్ను, సిద్ధా = సిద్ధించినది.

**తా :** ఋగ్వేదప్రథమసూక్తమైన అగ్నిసూక్తము. "**అగ్నిమీళే పురోహితమ్**" అని ప్రారంభమైనది. అందువలన ఈళే అను పదమున ఋగ్వేద ప్రతిశాఖ్యననుసరించి డకారమునకు ళకారాదేశము కలిగినది. అట్టి ఋగ్వేద లక్షణమును సూచించు చిహ్నము, ఈ ప్రథమకూటమున నుండుటచే ఈ ప్రథమకూటము ఋగ్వేదస్వరూపమని భావన కలుగుచున్నది. ఆ లక్షణముచే, ద్వితీయ కూటము యజుర్వేద స్వరూపమనియు, మూడవకూటము సామవేదస్వరూపమనియు సూచింపబడుచు తత్స్వరూపం స్సిద్ధించినది.

**శ్లో॥ హ్రీమితి నామ విశేష్యం నపుంసకం బ్రహ్మలక్షకత్వేన ।**
**విధిహరిగిరిశైరీడ్యం బ్రహ్మేతి ప్రథమకూటార్థః ॥ 83**

హ్రీం ఇతి నామ = హ్రీం అను పదము, బ్రహ్మలక్షకత్వేన = బ్రహ్మను బోధించుటచేత, విశేష్యమ్ = విశేష్యమగుచున్నది. నపుంసకమ్ = నపుంసకమున్ను, విధిహరిగిరిశైః = బ్రహ్మ, విష్ణు, రుద్రులచేత, ఈడ్యమ్ = స్తుతింపదగినది, పూజింపదగినది. బ్రహ్మ = నిరతిశయ బ్రహ్మము ఇతి = అని, ప్రథమకూటమునకు, అర్థః = అర్థము.

**తా :** ఈ శ్లోకమున, నపుంసకమైన హ్రీం అనుపదము పరబ్రహ్మ బోధకమగుటచే,

విశేష్యమగుచున్నది. అనగా బ్రహ్మ, విష్ణు, రుద్రులచే స్తుతింపదగిన నిర్గుణ బ్రహ్మమని ప్రథమకూటమునకు అర్థము.

**శ్లో॥ హసకం తు హసద్వదనం మతం కకారస్య వదనవాచిత్వాత్ ।**
**యద్వా హస ఆనందః కస్సూర్యో హస్తు చంద్రస్స్యాత్ ॥ 84**

హసకం తు = హసకం అను పదమునకు, హసత్ వదనమ్ = నవ్వు ముఖము అని, మతమ్ = ఇష్టము, కకారస్య = కకారమునకు, వదనవాచిత్వాత్ = ముఖము అను అర్థము చెప్పునది యగుట వలన, యద్వా = లేక, హసః = ఆనందము, కః = సూర్యుడు, హస్తు = హకారమైతే, చంద్రః = చంద్రుడు, అని అర్థము, స్యాత్ = అగును.

**తా :** హసక అను పదమునందు ముఖమనునర్థము నిచ్చు క కారమున్నందున, నవ్వుముఖమని యర్థము, లేక, హసః = ఆనందము, కః = సూర్యుడు, తరువాత నున్న హకారమునకు చంద్రుడని యర్థము.

**శ్లో॥ ఏతౌ లౌ నయనే యస్య తత్తు కహలం రవీన్దునేత్రమితి ।**
**తేన ప్రకాశకత్వాచ్చిద్రూపత్వం చ నిగదితం భవతి ॥ 85**

ఏతౌ = ఈ సూర్యచంద్రులు, లౌ నయనే = నేత్రములు, యస్య = ఏ బ్రహ్మకో, తత్ = ఆ బ్రహ్మ, కహలమ్ = చంద్రసూర్యనేత్రములు కలది, ఇతి = అని, ఉచ్యతే = చెప్పబడుచున్నది. తేన = సూర్యచంద్రులు నేత్రములగుటచేత, ప్రకాశకత్వాత్ = ప్రకాశమిచ్చునది. అగుట వలన, చిద్రూపత్వమ్ = చిన్మయరూపమగుట, నిగదితమ్ = చెప్పబడినది., భవతి = అగుచున్నది.

**తా :** కహలం అను సమస్తపదమునకు, సూర్యచంద్రులు, (లౌ) నేత్రములుగా కలదని యర్థము. సూర్యచంద్రులు నేత్రములగుట బ్రహ్మకు చిద్రూపత్వము చెప్పినట్లయినది. సూర్య, చంద్రులు ప్రపంచము నెట్లు ప్రకాశింపజేయుదురో, అట్లే, బ్రహ్మ ప్రపంచమును సూర్యచంద్రులను ప్రకాశింపచేయుటవలన చిద్రూపత్వము సిద్ధించినది.

**శ్లో॥ విధిహరిగిరిశేడ్యత్వే హేతూ ఏతే హసత్వకహలత్వే ।**
**తేనాత్యమితానందం చిద్బ్రహ్మేతి ద్వితీయకూటార్థః ॥ 86**

ఏతే = ఈ పూర్వోక్తములైన, హసత్వ, కహలత్వే = ఆనందస్వరూపత్వము, సూర్యచంద్ర–నేత్రత్వమున్ను, (బ్రహ్మణః = బ్రహ్మకు), విధిహరిగిరిశేడ్యత్వే = బ్రహ్మ విష్ణు రుద్రులచే నుపాసింపబడువిషయము, హేతూః = కారణములుకదా, తేన = ఆ కారణముచేత,

అత్యమితానందమ్ = అపరిచ్ఛిన్నమైన ఆనందము, చిత్‌బ్రహ్మ = చిద్రూపమైన బ్రహ్మ, ఇతి = అని, ద్వితీయకూటార్థః = ద్వితీయకూటార్థము.

**తా :** బ్రహ్మానందస్వరూపుడు, సూర్యచంద్రులు నేత్రములుగా కలవాడు, అనుట, బ్రహ్మ విష్ణు రుద్రులచే నుపాసింపబడుటకు కారణములైనవి. ఆ కారణముచే ప్రథమకూటమున హ్రీం, అను పదము బ్రహ్మ బోధకమని చెప్పుటచే ద్వితీయ కూటమున కూడా అట్లే బ్రహ్మ బోధకమని చెప్పనగును. అందువలన అపరిచ్ఛిన్నానందచిద్రూపమైన బ్రహ్మ అని ద్వితీయ కూటమునకు అర్థము.

**శ్లో॥ సకలకలాభిః సహితం సకలం బ్రహ్మ తు తృతీయకూటార్థః ।**
**ఇత్థం గుణగణకథనాత్ విద్యాయా ఏష సగుణార్థః ॥ 87**

సకలకలాభిః = సర్వజీవకలలచేత, సహితమ్ = కూడిన, సకలమ్ = సమస్తమైన ప్రపంచము, బ్రహ్మ ఇతి = బ్రహ్మయని, తృతీయకూటార్థః = మూడవ కూటమునకు అర్థము, ఇత్థమ్ = ఈ విధముగా, గుణగణకథనాత్ = గుణ సమూహమును వర్ణించుటవలన, విద్యాయాః = విద్యయొక్క, ఏషః = ఇది, సగుణార్థః = సగుణరూపమైన అర్థము.

**తా :** పరబ్రహ్మాంశభూతమైన జీవకలలతో సకల ప్రపంచము పుట్టినది. అది బ్రహ్మ అని మూడవ కూటమునకు అర్థము. ఈ ప్రకారము బ్రహ్మయొక్క గుణ గణ సమూహమును వర్ణించుట విద్యయొక్క సగుణార్థమని లోకమున ప్రసిద్ధము.

**అవ :** తరువాత మహావాక్యార్థము చెప్పుచున్నాడు.

## 15. మహావాక్యార్థము

**శ్లో॥ విధిహరిశివవచనా అపి కకార ఏకారకోఽకారః ।**
**సృష్టిస్థితిభంగాత్మకతత్తజ్జనకత్వలాక్షణికాః ॥ 88**

**శ్లో॥ ఈశ్వరవాచీకారో వక్తి దకారస్సదాశివం తాభ్యామ్ ।**
**లక్షణయా తత్ర తిరోధానానుగ్రహణకృత్యతా గదితా ॥ 89**

విధి = బ్రహ్మ, హరి = విష్ణు, శివ = రుద్ర అను, వచనా అపి = చెప్పునవి అయినను, కకారః ఏకారః అకారాః = కకార, ఏకార అకారప్రశ్లేషములు, సృష్టి... లాక్షణికాః = సృష్టి స్థితి సంహార స్వరూపమైన వారి వారి కృత్యములను పుట్టించుట, యను అర్థము లక్షణా వృత్తిచే బోధించును.

ఈశ్వరవాచి = ఈశ్వరుని చెప్పునది, ఈకారః = ఈ కారము, దకారః = ళకారము (డో

మహేశః సమాఖ్యాతః), సదాశివః = సదాశివుని, వక్తి = చెప్పుచున్నది. తాభ్యామ్ = ఆ ఈకార లకారములచేత, లక్షణయా = లక్షణావృత్తిచే, తత్ర = ఈ ప్రథమకూటమునందు, తిరోధాన+అనుగ్రహణ కృత్యతాః, తిరోధాన = తిరోధానము (విషయమును మరుగు పరచుట), అనుగ్రహణ = భక్తుని అనుగ్రహించుట (కోరికలను నెరవేర్చుట) కృత్యతాః = పనులను, గదితా = చెప్పబడినది

**తా : తత్త్వమసి** మున్నగు మహావాక్యములందు, తత్ పదమునకు అర్థము సృష్టి, స్థితి, సంహార, తిరోధాన, అనుగ్రహరూపమైన పంచకృత్యములకు కారణభూతుడు. "**యతో వా ఇమాని భూతాని జాయంతే**"

"**యేన జాతాని జీవంతి, యత్ప్రయంత్యభి సంవిశంతి**" అను శ్రుతి ప్రతిపాదితమైన అర్థము. ఇది వాక్యార్థము. లక్ష్యార్థమైతే, "**సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ**" ఈ మున్నగు శ్రుతులచే ప్రతిపాదింపబడిన కృత్యాతీతుడు, (పంచకృత్యములకు అతీతుడు) సచ్చిదానంద స్వరూపమైన తత్త్వము, వాక్యార్థముచే చెప్పబడిన కృత్యకారకులైన అర్థము. బ్రహ్మయొక్క తటస్థలక్షణమును చెప్పునది. లక్ష్యార్థము. బ్రహ్మయొక్క స్వరూపలక్షణము.

త్వం పదమునకు వాక్యార్థము "**స ఏవ మాయా పరిమోహితాత్మా**" ఇత్యాది శ్రుతి వాక్యములచే ప్రతిపాదింపబడిన జాగ్రదాది అవస్థాపంచకవిశిష్టమైన అర్థము. అవస్థా-పంచకములు **జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయ, తుర్యాతీత** అనునవి. లక్ష్యార్థమైతే, జాగ్రదాది అవస్థాపంచక వినిర్ముక్తమైన సత్యజ్ఞానానంత లక్షణమైన బ్రహ్మ కాగా వాక్యార్థములకు అభేదము సంభవింపనందున, తత్త్వమసీత్యాది మహావాక్యములచేత వాక్యార్థమును వదలి, లక్ష్యార్థముల కభేదము నిరూపింపబడినది. తత్ = త్వం పదార్థములు రెంటికి సత్యజ్ఞానానందాత్మకమైన లక్ష్యార్థమొక్కటియే యగుట వలన అభేదార్థము సంభవించినది. వాక్యార్థ, లక్ష్యార్థములను బోధించు వాక్యములకు, **అవాంతరవాక్యములని**, అభేదార్థముల బోధించు వాక్యములకు **మహావాక్యమనియు** సంజ్ఞ, ఇట్లే మహావాక్యార్థప్రకరణమున **అవాంతరవాక్యములచే** వాచ్యార్థాదులు చెప్పబడుచు మహావాక్యార్థము ప్రతిపాదింప బడుచుండును.

**అవ :** ముందు **తత్** పదము యొక్క వాక్యార్థము ప్రథమకూటముచే చెప్పుచున్నాడు. కకార, ఏకార, ఈకారములు బ్రహ్మవిష్ణురుద్రులను వాచ్యార్థములచే చెప్పునది అయినను, సృష్టి, స్థితి, సంహార రూపమైన వారి వారి కృత్యములను పుట్టించుటను లక్షణావృత్తిచే బోధించును. ఎట్లనగా బ్రహ్మవాచకమైన కకారము లక్షణచే సృష్టికృత్యమును బోధించును. విష్ణువాచకమైన ఏకారము లక్షణచే స్థితి కృత్యమును బోధించును. రుద్రవాచకమైన ఈ కారము లక్షణచే

సంహారకృత్యమును బోధించును. ఈ కారము దీర్ఘమగుటచే ప్రశ్లేషవలన మరొక ఈ కారము నిందు గ్రహింపవచ్చును. ఆ రెండవ ఈకారమునకు ఈశ్వరుడు వాచ్యార్థము. తిరోధానము లక్ష్యార్థము. లకారమునకు సదాశివుడు వాచ్యార్థము. అనుగ్రహము లక్ష్యార్థము.

హ్రీం అనుపదము, ఆత్మవాచకము. కాగా సృష్టి, స్థితి, సంహార, తిరోధాన, అనుగ్రహాత్మక కృత్యపంచక విశిష్ట పరమాత్మ అవాంతర వాచ్యమైన ప్రథమకూటమునకు అర్థమని తేలినది. ఈ యర్థమే తత్ పదమునకు వాచ్యార్థమని "**యతో వా ఇమాని భూతాని జాయంతే**" ఇత్యాది అవాంతరశ్రుతి వాక్యము ప్రతిపాదించినది. ఇవి అవాంతరవాక్యములు.

ఈ ప్రథమకూటమే, **త్వం** పదము యొక్కయు, వాచ్యార్థమును బోధించుచున్నది. ఎట్లన కకారము జాగ్రదవస్థను బోధించును. ఏకారము స్వప్నావస్థను బోధించును. ఈకారము సుషుప్త్యవస్థను బోధించును. రెండవ ఈకారము తుర్యావస్థా బోధకము. (డ)లకారము తురీయాతీతావస్థా బోధకము. హ్రీంకారము ఆత్మవాచకము. కాగా, జాగ్రత్స్వప్నసుషుప్తి తురీయ తురీయాతీతాత్మక అవస్థా పంచక విశిష్ట ఆత్మయని అవాంతర వాక్యమైన ప్రథమ కూటమునకు అర్థము తేలినది. ఇది త్వం పదముయొక్క వాచ్యార్థము శ్రుతులలో "స ఏవ పరిమోహిత ఆత్మా" ఇత్యాది అవాంతరవాక్యముల చేత ప్రతిపాదింపబడినది. ఇట్లే ఒక్కొక్క కూటమునకే తత్, త్వం అను పదముల యొక్క వాచ్యార్థము బోధింపబడుట వలన అవాంతర వాక్యరూపత్వము.

కకారాదులచే సృష్ట్యాది కృత్యపంచక స్వరూపము చెప్పబడినది. అవియే అవస్థాపంచక స్వరూపమునెట్లు చెప్పును, అను సందేహమునకు సమాధానము.

జీవులయొక్క సమష్టి యీశ్వరుడు, జీవావస్థాపంచక సమష్టి యీశ్వర కృత్య పంచకము. అని ఈ రెంటికి స్వరూపభేద మేమాత్రము లేదు. అందువలన రెండు విధములైన జీవేశ్వరుల అవస్థాపంచకము కృత్యపంచకము నొక్క వాక్యముచేతనే బోధింపబడినవి. ఈ యర్థము మూలమున అపి అను పదముచే (88 శ్లో॥) సూచింపబడినది. ఆ కారణముచే జీవావస్థా పంచకమిందు సంగ్రహింపబడినది. ఇందు వివాదమేమియు లేదు.

**అవ :** ఇక **తత్, త్వం** పదములయొక్క లక్ష్యార్థమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ హస ఆనందస్సత్యం కం హమనంతం చ లం జ్ఞానమ్ ।**
**ఇత్థం బ్రహ్మ తటస్థస్వరూపలక్షణయుగేన నిర్ణాయ॥ 90**

హస ఆనందః = హస అనుదానికి ఆనందము అను అర్థము. కం – సత్యం, క

కారమునకు సత్యమని యర్థము, హం అనంతమ్ = హకారమునకు అనంతమని అర్థము, లం జ్ఞానమ్ = లకారమునకు జ్ఞానమని అర్థము.

**తా :** హ్రీం అనునది బ్రహ్మ వాచ్యము. ఇట్లు ఆ యా పదములకు అర్థము చెప్పబడినది. ఇందువలన రెండవ కూటముచే సత్యం, జ్ఞాన, మనంతం బ్రహ్మ అను తత్, త్వం, పదములకు గల లక్ష్యార్థ స్వరూపము చెప్పబడినది. శ్రుతులలో చెప్పబడిన అవాంతర వాక్యార్థరూపము రెండవ కూటముచే చెప్పబడినది.

**అవ :** ఈ విధముగా తత్, త్వం పదముల యొక్క వాచ్యార్థము లక్ష్యార్థమున్ను అవాంతర వాక్యములచే బోధింపబడిన దానిని, రెండు కూటములచే చెప్పి మూడవ కూటముచే తత్త్వమసీత్యాది మహావాక్యార్థము చెప్పుచున్నాడు.

**శ్లో॥ తదభేదం జీవగణే వక్తి తృతీయేన కూటేన ।**
**జాగ్రత్స్వప్నసుషుప్త్యాఖ్యకలాత్రితయేన సాహిత్యాత్ ॥ 91**

**శ్లో॥ సకలపదం జీవపరం బ్రహ్మపరం శక్తిబీజం స్యాత్ ।**
**సామానాధికరణ్యాత్తల్లక్షితశుద్ధయోరభేదోఽర్థః ॥ 92**

తృతీయేన కూటేన = మూడవదియైన శక్తికూటముచేత, జీవగణే= త్వం పదలక్ష్యార్థ-భూతమైన జీవసమూహమునందు, తదభేదః = తత్పదలక్ష్యార్థముతో కూడ అభేదము చెప్పబడినది.

**తా :** మూడవకూటము తత్, త్వం పదముల లక్ష్యార్థములకు అభేదమును బోధించినది. అది మహావాక్యార్థము.

జాగ్రత్స్వప్న సుషుప్త్యాఖ్య కలాత్రితయేన = జాగ్రత్, స్వప్న, సుషుప్తి అను పేరుగల అవస్థాత్రయముచేత, సాహిత్యాత్ = కూడుటవలన, సకల పదమ్ = మూడవ కూటమునందలి సకల అనుపదము, జీవపరమ్ = జీవవాచకమయినది. శక్తిబీజమ్ = హ్రీంకారము, బ్రహ్మపరమ్ = బ్రహ్మవాచకము, స్యాత్ = అగును, సామానాధికరణ్యాత్ = సకల అనుపదమునకు అర్థమైన జీవులకు, హ్రీం పదమునకు అర్థమైన బ్రహ్మకు, సమానవిభక్తి కలిగి ఒక వాక్యమున సమావేశము పొందుట వలన, తల్లక్షితశుద్ధయోః = తత్, త్వం పదములకు లక్ష్యార్థమైన కృత్యపంచక, అవస్థాపంచకముల కంటే, అతిరిక్తమైన, సత్యజ్ఞానానంద స్వరూపులగు జీవాత్మ పరమాత్మలకు, అభేదః = అభేదము స్వరూపైక్యము, అర్థః = అర్థము.

**తా :** జాగ్రత్, స్వప్న, సుషుప్తి, అనుపేరుగల అవస్థాత్రయముచేత కూడియుండుట వలన,

మూడవ కూటమునందలి, సకల పదమునకు జీవుడర్థమైనది. శక్తిబీజమైన హ్రీంకారమునకు పరమాత్మ, అర్థమైనది. ఈ రెంటికి, ఒక్క విభక్తి గలిగి, ఒక్క వాక్యముననుండుట వలన తత్ త్వం పదములకు లక్ష్యార్థమైన కృత్యపంచక అవస్థాపంచకములకంటే, అతిరిక్తమైన సత్యజ్ఞానానంద స్వరూపులగు జీవాత్మ, పరమాత్మలకు స్వరూపైక్యము సిద్ధించినది.

**శ్లో॥ అత్యల్పమిదం కథితం యత్సర్వం ఖల్విదం బ్రహ్మ ।**
**ఇత్యేవం బోధయితుం సకలపదం వా తృతీయకూటగతమ్ ॥ 93**

ఇదమ్ = ఈ పూర్వ శ్లోకమున చెప్పబడిన విషయము, యత్ = ఏది కలదో, తత్ = అది, అత్యల్పమ్ = మిక్కిలి అల్పమైన విషయము, ఇదమ్ = ఈ పరిదృశ్యమానమైన, సర్వమ్ = అంతయు, బ్రహ్మ ఖలు = బ్రహ్మయే, ఇతి ఏవమ్ = ఈ విధముగా, బోధయితుమ్ వా = బోధించుటకున్ను, తృతీయకూటగతమ్ = మూడవకూటముననున్న, **సకల** పదమ్ = సకల అనుపదము, సమస్తము అను అర్థము గల పదము.

**తా :** మూడవ కూటమునకు ఇంతకుముందు చెప్పిన అర్థమును విడువకయే మరొక విధమున అర్థము చెప్పుచున్నాడు. పూర్వశ్లోకమున చెప్పబడిన జీవబ్రహ్మలకు అభేద రూపమైన అర్థమేది కలదో అది మిక్కిలి అల్పమైనది. ఎందుకనగా జీవ బ్రహ్మలకంటే, వేరైన ప్రపంచముండుట వలన, జీవబ్రహ్మలకైక్యము చెప్పినంతమాత్రమున అద్వైతము సిద్ధించలేదు. అందువలన నీ కనబడునట్టి ప్రపంచమంతయు, భోక్తృభోగ్యరూపమైన, సర్వము బ్రహ్మయే అని బోధించుటకు, మూడవ కూటముననున్న సకల పదము సహాయము చేయును. సకల పదము సర్వ వాచకమగుట వలన, హ్రీంకారము బ్రహ్మ వాచకమగుటవలన, మూడవ కూటము పూర్వార్థము విడువకయే **సర్వం ఖల్విదం బ్రహ్మ** అను వాక్యార్థమును కూడ బోధించుచున్నది. అనగా సర్వప్రపంచము బ్రహ్మయే అని బ్రహ్మ ప్రపంచముల కభేదమును, "**సర్వం ఖల్విదం బ్రహ్మ**" యను శ్రుతి వాక్యము చెప్పుచున్నది. అదే యర్థమును **సకలహ్రీం** అను మూడవకూటము కూడా బోధించుచున్నది. అని తాత్పర్యము. ఇచట శ్లోకముననున్న **వా** అను శబ్దమునకు **చ** అను సముచ్చయార్థము చెప్పవలయును.

**శ్లో॥ ఏవమవాంతరవాక్యైర్జీవబ్రహ్మస్వరూపమభిధాయ ।**
**తదభేదో వర్ణిత ఇత్యేష మహాపూర్వవాక్యార్థః ॥ 94**

ఏవమ్ = ఈ విధముగా, అవాన్తరవాక్యైః = ప్రథమ, ద్వితీయ కూటములకు అర్థములైన, తత్, త్వం పదములయొక్క వాక్యార్థ, లక్ష్యార్థములను బోధించు అవాంతర వాక్యములచే, జీవ బ్రహ్మ స్వరూపమ్ = జీవ బ్రహ్మలయొక్క వాక్యార్థస్వరూపమును,

లక్ష్యార్థస్వరూపమును, అభిధాయ = చెప్పి, తదభేదః = ఆ జీవబ్రహ్మలయొక్క అభేదము, స్వరూపైకాత్మ్యము, వర్ణితః = మూడవ కూటముచే వర్ణింపబడినది. ఇతి = ఈ విధముగ, ఏషః = ఈ చెప్పబడిన యర్థము, మహాపూర్వవాక్యార్థః = మహత్ పదము ముందున్న వాక్యార్థము. అనగా మహావాక్యార్థమని పేరు.

**తా : విధిహరిశివవచనాపి** ఇత్యాది = ఇది మొదలు క్రమముగా అవాంతరవాక్యార్థములు, ప్రథమద్వితీయకూటములచే చెప్పబడినది. అందు **తత్, త్వం** పదములయొక్క వాక్యార్థ, లక్ష్యార్థములచే, జీవబ్రహ్మల యొక్క వాక్యార్థస్వరూపము, లక్ష్యార్థస్వరూపమున్ను బోధింపబడినది. తరువాత మహావాక్యార్థస్వరూపమైన మూడవకూటముచే, జీవబ్రహ్మల యొక్క ఏకాత్మ్యస్వరూపమైన, అభేదము వర్ణింపబడినది. ఇందువలన ఇది **మహావాక్యార్థ** మని యెరుంగునది.

ఈ విధముగా గాయత్రీ అర్థము మొదలు మహావాక్యార్థము వఱకు పదునైదు అర్థములు నిరూపింపబడినవి. ఈ పదునైదు అర్థములను విభజించి 37 అర్థములుగా కొందరు చెప్పుచున్నారు. వ్యాకులాక్షరశ్లోకములచే ప్రతిపాదింపబడిన అర్థములు కొన్ని గలవు. అంతకంటే చాల అర్థములు తంత్రములలో కనబడుచున్నవి. నామైకదేశార్థముల నన్నిటిని కలిపి లెక్క చూచిన, అపరిమితములైన అర్థములు గలవు.

ఈ విధముగ అనంతమైన అర్థముల నిచ్చునది పురుషార్థములనన్నిటిని ఇచ్చునిదియు నగు ఇది ఈ మహావిద్య వ్యాసభగవానుడు "**జన్మాద్యస్యయతః**" ఇత్యాది సూత్రములచే అనేక భావములను సూచించెను. వేదాంతములన్నియు ఆత్మైకత్వజ్ఞానము కొఱకు ఆరంభింపబడినవి. శ్రీమత్ భగవత్ పాదులు శంకరాచార్యులవారు, శారీరకభాష్యమున సూచించిరి. సర్వోపనిషత్సారభూతమైన ఈ మహావిద్య వేదాంతశ్రవణమైన పిదప స్వస్వరూపలాభము కొఱకు, అందరునునుసంధింపదగినది. **పంచదశాక్షరీ** స్వరూపమైన **ఈ మహావిద్యను**, నాబుద్ధికొలది సద్గురూపదేశమున కలిగిన జ్ఞానవైభవముచే, నా సతీర్థుల యొక్కయు భాసురానందనాథుల యనుగ్రహము యొక్కయు సహాయము చేతను నేను కొద్దిగ ప్రకటించితిని. సత్పురుషులు, నన్ననుగ్రహింతురు గాక. ఈ అర్థములయందున్న విశేషవిషయములు, శ్రీభాస్కరాయకృతవ్యాఖ్యానమున బాగుగ వివరింపబడినవి. ఇచట నేను విస్తరింపలేదు.

**అవ :** ఇక చెప్పబడిన అర్థములయందు ఇతరులు చూపు విరుద్ధవిషయములను నివారించుచున్నాడు.

**శ్లో॥ శక్త్యా లక్షణయా వా యే యేఽర్థా దర్శితా మనోరస్య ।**
**తేషు న కోఽపి వివాదః ప్రత్యక్షత్వేన సిద్ధత్వాత్ ॥ 95**

అస్య మనోః = ఈ మంత్రమునకు, శక్త్యా = అభిధావృత్తిచేతగాని, లక్షణయా వా = లక్షణావృత్తిచేతకాని, యే యే అర్థాః = యే యే అర్థములు, దర్శితాః = చూపబడినవో, తేషు = ఆ యా యర్థములయందు, కః + అపి = కోపి = ఏమియు, వివాదః = తగవు, న = లేదు, ప్రత్యక్షత్వేన = శ్రుతివ్యాకరణాదులచేత ప్రత్యక్షముగా నిదర్శనముగా, సిద్ధత్వాత్ = సిద్ధించినదగుటవలన.

**తా :** ఈ పై చెప్పబడిన పదునైదర్థములలో, భావార్థము మొదలు, మహాతత్త్వార్థము వఱకు గల ఆరు అర్థములను విడచి ఇతరములైన తొమ్మిది యర్థముల యందు శ్రుతి స్మృతి, వ్యాకరణ శిష్ట వాక్యములు, మున్నగు వాని ప్రామాణ్యముచే కొన్ని అర్థములు, శక్తిచేతను, కొన్ని లక్షణావృత్తిచేతను ప్రతిపాదింపబడినవి. ఆ యర్థముల విషయమున శ్రుతి వ్యాకరణాదులను స్పష్టముగ ప్రదర్శించుటచే విరోధము భావింపవలదు. అట్టి వ్యాకరణాది నిరూపణ పద్ధతి భాస్కరరాయవ్యాఖ్యానమున చూడనగును.

**అవ :** ఇక భావార్థము మొదలారు అర్థముల యొక్క ప్రామాణ్యమును రెండున్నర శ్లోకములచే చూపుచున్నాడు.

**శ్లో॥ యే పునరిహ భావార్థాదయష్షడర్థా మనోరుక్తాః ।**
**తేషు యది శక్తిభక్తీ న హి సంభవతస్తథాపి కా హానిః ॥ 96**

యే పునః = ఏవియైతే, ఇహ = ఈ గ్రంథమున, భావార్థాదయః = భావార్థము మొదలగునవి, షట్ = ఆరు, అర్థాః = అర్థములు, మనోః = మంత్రమునకు, ఉక్తాః = చెప్పబడినవో, తేషు = ఆ యర్థములయందు, శక్తిభక్తీ = అభిధావృత్తి, లక్షణావృత్తులు, న సంభవతః యది = సంభవింపనియెడల, తథాపి = అయినను, కా హానిః = నష్టమేమి?

**తా :** భావార్థము మొదలు, అర్థములయందు అభిధావృత్తిగాని, లక్షణావృత్తిగాని సంభవింప కున్నను నష్టములేదు.

**అవ :** అయినచో నర్థసిద్ధి ఎట్లు సంభవించునో చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఆస్తామన్యా వృత్తిర్విలక్షణా తద్గ్రహస్తు మనోః ।**
**శివవచనేన భవిష్యతి యద్వైషా శక్తిరేవాస్తు ॥ 97**

**శ్లో॥ ఏతస్మాదయమర్థో బోద్ధవ్య ఇతీశ్వరేచ్ఛాత్వాత్ ।**

విలక్షణా = అభిధాలక్షణావృత్తులకంటే వేరైన, అన్యా = మఱియొక, వృత్తిః = శబ్దవ్యాపారము (వ్యంజనావృత్తిః), అస్తామ్ = ఉండుగాక, (కలుగుగాక), మనోః = మంత్రము నకు, తత్ గ్రహస్తు = మరొక వృత్తియొక్క అంగీకారమైతే, శివవచనేన = శివునివాక్యము ననుసరించి, భవిష్యతి = కాగలదు, యద్వా = లేక, ఏషా = ఈ వ్యాపారము, శక్తిః ఏవ = శక్తియే, అస్తు = అగుగాక, ఏతస్మాత్ = ఈ పదమునుండి, అయమర్థః = ఈ అర్థము, బోద్ధవ్యః = తెలిసి కొనదగినది, ఇతి = అని, ఈశ్వరేచ్ఛాత్వాత్ = ఈశ్వరుని యిచ్ఛయగుటవలన.

**తా :** ఈ అర్థమున అభిధావృత్తి, లక్షణావృత్తి బోధింపకున్నను వ్యంజనావృత్తి బోధించునని చెప్పుచున్నాడు. లక్షణకువలె, పరంపరగా శక్యసంబంధము వ్యంజనావృత్తికి నుండవలయును. శక్య సంబంధము లేనిచో వ్యంజనావృత్తి యెట్లు సిద్ధించునని సందేహించి, సాక్షాత్తు పరశివునిచే చెప్పబడిన అర్థవిషయములలో ఆ సందేహమవసరము లేదని చెప్పియు, పరమార్థమైన విషయము చెప్పుచున్నాడు. ఇతరుల శంక నంగీకరించి చెప్పుచున్నాడు. ఈ యారు అర్థములు శక్తిచేతనే సంభవించును. ఈ పదమువలననీయర్థము బోధింపబడవలయునను ఈశ్వర సంకేతశక్తి అని శక్తిలక్షణమగుట వలన భావార్థముల యందు ఈశ్వరశక్తి కలదు. యోగినీ హృదయము శివపార్వతుల సంవాద మగుట వలన శివోక్తి యీ యర్థములయందుండుట వలన శక్తియే యగును. ఈ విషయమున సందేహమే మాత్రము లేదు.

**అవ :** ఏ వాక్యమున ప్రతిపదమునకు, అర్థముండునో అట్టి పదసమూహమైన వాక్యమర్థమును బోధించుట లోకసహజము. ఇక్కడ ప్రతిపదమునకు అర్థము లేకపోవుటవలన వాక్యార్థమెట్లు సిద్ధించును? అను సందేహమునకు సమాధానము చెప్పుచున్నాడు.

**ప్రతిపదమర్థవిశేషాజ్ఞానేఽప్యాస్తామఖండవాక్యస్య ॥ 98**

**శ్లో॥ అర్థోఽప్యఖండరూపో విశిష్టమతిరిక్తమితి హి సిద్ధాంతః ।**

ప్రతిపదమ్= అన్ని పదములకు, అర్థవిశేషాజ్ఞానేపి = అర్థవిశేషము లేకున్నను, అఖండ వాక్యస్య = సమూహవాక్యమునకు, అఖండరూపః = సమూహాత్మకమైన, అర్థః = అర్థము, ఆస్తామ్ = ఉండుగాక, విశిష్టమ్ = అనేక పదవిశిష్టమైన అర్థము, అతిరిక్తమ్ = పదములకంటే వేరైనది, ఇతి = అని, సిద్ధాంతః హి = సిద్ధాంతము గదా?

**తా :** ప్రతిపదార్థము లేకున్నను, పదార్థమునపేక్షించక, పదార్థసమూహాత్మకమైనచో అఖండ వాక్యమే, అఖండార్థమును బోధించును. అఖండవాక్యమును వైయ్యాకరణులంగీకరించిరి. ఈ అర్థమున అందరి సమ్మతికి ప్రమాణము కలదు. పదములకంటే విశిష్టము వేరని

సిద్ధాంతము కదా? ఈ సిద్ధాంతమే ఈ మంత్రార్థమున పర్యవసానము పొందుచున్నది. విశిష్టవాక్యము పదార్థములకంటే వేరైన దగు అర్థమును బోధించునని దాని యభిప్రాయము.

**అవ :** పదార్థసమూహజ్ఞానము లేకుండా వాక్యార్థజ్ఞానము కలుగునను విషయము కొందరికి సమ్మతము కాదు, అని శంకించి, ఆ పక్షమున నీ మంత్రమంతయు ఒకే పదమగుగాక, ఒక్క పదమేయైయుండి, బహ్వర్థములను బోధించునను విషయమును దృష్టాంతముతో చెప్పుచున్నాడు.

**ఆసేచనకవ్యాప్త్యాదిపదవదాస్తాం పదత్వమపి ॥ 99**

ఆసేచనక, వ్యాప్తి మున్నగు పదములవలె దీనికి పదత్వము కూడా నుండుగాక, ఎట్లనగా? ఆసేచనక అను పదమునకు **తదాసేచనకం తృప్తేర్నాస్త్యంతో యస్య దర్శనాత్ ।**

**అవ :** ఈ విధముగ మంత్రమున కంతకు పదత్వమును, వాక్యత్వమును సంపాదించి, ముందు ఏ పదత్వ పక్షమున, ఇక పదమునకు గాయత్ర్యాద్యకార్థములు చెప్పుట యనునది దోషమను సందేహమునకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఏకస్యానేకార్థా దృష్టా హరిసైంధవాదిషు పదేషు ।**

**తా :** హరి అను పదమునకు కోతి, సింహము, చిలుక, మున్నగు అర్థములు దాదాపుగ నిరువది కలవు. అట్లే సైంధవ పదమునకు గుఱ్ఱము, ఉప్పు మున్నగు నర్థములు గలవు. ఆ విధముననే మంత్రమునకునూ అనేకార్థములుండుట సంభవము.

**అన్యతమైకావగతౌ ప్రకరణతాత్పర్యయోర్విశేషకతా ॥ 100**

**తా :** ఏదో యొక యర్థమును గ్రహించుటకు సాధనముగా వక్త చెప్పదలచిన తాత్పర్యము సంలక్షించియు, భోజనము, యాత్ర మున్నగు ప్రకరణమును గుర్తించియు, వలసిన యర్థమును గుర్తింపవలయును.

**అవ :** ఓ ఈ హరి సైంధవ మున్నగు పదములకు వలే ఈ మంత్రమునకు ప్రకరణము, వక్త లేకపోవుట వలన అనేకార్థముల బోధించుట యెట్లను సందేహమునకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ప్రకృతే తు సర్వబోధస్యేష్టత్వాన్నో విశేషకాకాంక్షా ।**

**తా :** ప్రకృతమైన జపకాలమున, అన్నియర్థములనేక కాలమున బోధించుట మాకిష్టమగుట వలన ప్రకరణ తాత్పర్యములను గుర్తించనవసరము లేదు.

**అవ :** ఒకే సమయమున బహ్వర్థములయందు శక్తికనబడుటలేదు. కాలభేదముననే కనబడుచున్నది. అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

**అథ వా సకలార్థేష్వపి శక్త్యైక్యం పుష్పవంతపదవదిహ ॥ 101**

**తా :** "ఏకయోక్త్యా పుష్పవంతౌ దివాకర నిశాకరౌ" ఇట్టి పదములయందు పుష్పవంత పదమునకు ఒక్కమారే రెండర్థముల యందు ఒకే శక్తి ఎట్లు కలదో, అట్లే ఈ మంత్రమునకున్నూ పదునైదర్థములయందు నొకే శక్తి కలదని తాత్పర్యము.

**అవ :** ఈ విధముగా మంత్రమంతయు నొకే పదమైనప్పుడు, అనేకార్థములు కలిగి యుండుట దోషము కాదని నివారించి, ఏకవాక్యమైనపుడనేకార్థములుండుట దోషముకాదని చెప్పదలచి ముందు, అర్థభేదముచే వాక్యవిభాగమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ యత్ర ప్రతిపదమర్థస్తాన్ ప్రత్యస్యాస్తు వాక్యత్వమ్ ।**
**క్వచనావాంతరవాక్యం సమాసవాక్యం మహావాక్యమ్ ॥ 102**

**తా :** గాయత్ర్యాది అర్థములయందు ఎచ్చట ప్రతిపదమునకు అర్థము కలదో అచ్చట పదసమూహాత్మకమైన వాక్యముగానే మంత్రమంతయు నగును. సగుణార్థ, అవయవార్థాదుల యందు అవాంతరవాక్యమగును. సమస్తార్థమున సమాసవాక్యమగును. చరమార్థమున మహావాక్యమగునని తెలియదగును.

**అవ :** ఈ మంత్రము వాక్యమేయయినను, అనేకార్థములుండుట దోషమని శంకించి, దృష్టాంత పూర్వకముగా సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఏకస్యానేకార్థే వినియోగాదర్థబాహుల్యమ్ ।**
**వేదే బహుశః స్వీకృతమత్ర త్వేకత్ర వినియోగాత్ ॥ 103**

**తా :** వేదమునందు పురుషసూక్తమున కాయా దేవతా పూజయందు వినియోగించుటచేత, తత్తత్ దేవతా పదముగా అర్థము కల్పించుటచే అనేకార్థత్వము కనుపించుచున్నది. అట్లే ఈ మంత్రమునకున్నూ అనేకార్థత్వము కలుగవచ్చునని భావము. కాని యీ మంత్రమునకు వినియోగము ఒకే దేవతయగు పరదేవత యందు మాత్రమే. పురుషసూక్తమున భిన్నభిన్న దేవతలయందు వినియోగ ముండుటచే భిన్న భిన్న అర్థ శ్రవణములు.

**అవ :** ఈ విధముగ పదాత్మకమో, వాక్యాత్మకమో యైన ఒక్క మంత్రమునకనేకార్థములను సాధించుట వలన కలిగిన లాభమేమి? యను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ అఖిలార్థబోధనియమో నియమాదృష్టం ప్రకల్పయతి ।**
**సిద్ధే ప్రమాణదార్ఢ్యే సకలం కల్ప్యం హి తదవిరోధాయ ॥ 104**

**తా :** ఈ విధముగ ఒక్కమారు సమస్తార్థములను బోధించుట యను నియమముచేత, ఇతర కర్మోపాసనలకంటే గొప్పదియైన, అదృష్టము కలుగును. దీని ఫలము, ఆత్మ, బ్రహ్మలయొక్క తాదాత్మ్యసాక్షాత్కారరూపమైనది కలుగుచున్నది. ఇది మహాఫలము. ఈ విషయమెట్లు తెలియుచున్నది యను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు. "**సిద్ధే ఇత్యాది ప్రమాణదార్ఢ్యే**" అన్ని అర్థములకు ప్రామాణ్యనిశ్చయము, సిద్ధే = ఫలింపగా, తదవిరోధాయ = ఆ ప్రామాణ్యము నకు విరోధము లేకుండా, సకలమ్ = సమస్తము, అనగా, అదృష్టము, ఫలము అంతయు, కల్ప్యమ్ + హి = కల్పింపదగినది కదా అనగా, అన్నియర్థములు, ఒక్కమారు స్ఫురించుట నిష్ఫలమైనది కాదు అని దాని ఫలమును కల్పింపవలయును. అన్ని కర్మలకంటే విశిష్టమైన యదృష్టమును, ఫలమును దీనికి కలదని భావము.

**అవ :** ఇట్టి కల్పన లోకమున నెక్కడ చూడబడినది యను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ యాగస్య స్వర్గం ప్రతి సంసిద్ధే హేతుహేతుమద్భావే ।**
**తదనుపపత్తిం నిరసితుమలౌకికాపూర్వమపి క్లప్తమ్ ॥ 105**

**తా :** వేదమునందు "**జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత**" ఈ మున్నగు విధి వాక్యములున్నవి. జ్యోతిష్టోమయాగముచేత స్వర్గఫలము కలుగునని ఈ వాక్యమున కర్థము. ఈ వేదవిధిచే యాగస్వర్గఫలమునకు, కార్యకారణభావము సిద్ధించినది. ఇది ప్రమాణము కాగా, వేరు వేరు సమయములందు కలుగు, యాగమునకు స్వర్గమునకు, కార్యకారణసంబంధములేకపోవుట వలన అట్టి సంబంధమును, ప్రామాణ్యమును బట్టి కల్పించుకొనవలయును. యాగమైన తర్వాత స్వర్గమును పొందింపగలిగిన అలౌకికము, అపూర్వమునయిన అదృష్టము యాగఫలము కలుగునంతవరకు నుండునని కల్పింపబడినది. యాగస్వర్గములకు హేతు, హేతుమద్భావమున కలిగిన యనుపపత్తి యీ విధముగ నిరస్తమైనది. అట్లే మంత్రార్థమునకు, మంత్రఫలమునకు ప్రామాణ్యము నిశ్చయింపబడగా తరువాత విశిష్టమయిన అదృష్టము విశిష్టమైన ఫలము సిద్ధించుటకు సందేహ మేమాత్రము లేదు.

ఈ గ్రంథమున రెండు భాగములున్నవి.

1. ప్రథమాంశము, 2. ద్వితీయాంశము. ఆ రెండు భాగములయందు చెప్పబడిన విషయములననువదించుచున్నాడు.

**శ్లో॥ విద్యావర్ణే యత్రోద్ధారః కాలస్తదుచ్చారః ।**
**ఉత్పత్తిస్థానం తద్యత్నో రూపం స్థితిస్థానమ్ ॥ 106**

**శ్లో॥ ఆకారః స్వం రూపం విభావ్యమర్థోఽన్తరంగాణి ।**

1. విద్యాసంఖ్య = అక్షరసంఖ్య (58)
2. ఉద్ధామ = 'క్రోధీశః శ్రీకంఠ'
3. కాలము = త్రిలవోనైకత్రింశన్ మాత్రాత్మకం
4. ఉచ్చారణం = 'ఇత్యేవం వర్ణానామ్'
5. ఉత్పత్తి స్థానము = 'కంఠే చ కంఠతాలుని'
6. యత్నము = 'బాహ్యాభ్యంతరశ్చా'
7. రూపము = 'ప్రళయాగ్నినిభం' ఇత్యాది
8. స్వం రూపం = 'వ్యష్టిసమష్టి విభేదాత్'
9. అర్థము = గాయత్ర్యర్థము
10. విభావ్యం = అవస్థాపంచకము
11. ఆకారం = నాగలి, బిందువు

**తా :** విద్యాక్షరముల సంఖ్య మొదలు, అర్థాంతము వరకు ఈ గ్రంథమున చెప్పబడిన విషయములు, అంతరంగ సాధనములు. అందువలన నుపాసకులకు మిక్కిలి యవసరములు మిగిలిన విషయము స్పష్టము.

**అవ :** ఇక బాహ్యావరివస్యకై చెప్పబడిన విషయములను చెప్పుచున్నాడు.

**ఋషయశ్ఛందోదైవతవినియోగా బీజశక్తికీలాని ॥ 107**

**శ్లో॥ న్యాసా ధ్యానం నియమాః పూజాదీని బహిరంగాణి ।**
**బాహ్యాన్యంగాని పునః ప్రాయో లోకే ప్రసిద్ధకల్పాని ॥ 108**

**తా :** ఋష్యాది ధ్యానాంతము గల పదకొండు బాహ్యావరివస్యలో నిరూపింపబడినవి. బహిరంగ సాధనములు, ఇవియు ఉపాసకుల కవసరమైనవియే. ఆది పదముచే హోమాదులు గ్రహింపవలయును.

ఇతర విషయములు.

1. ఋషి హయగ్రీవుడు మొదలగువారు
2. ఛ్ఛంధః = గాయత్రీ మున్నగునవి
3. దైవతము = త్రిపురసుందరీ దేవతా
4. వినియోగము = ఇష్టార్థజనకము
5. బీజము = వాగ్భవ మొదలగునవి

6. శక్తి = పరాశక్తి మొదలగునవి
7. కీలకం = కామరాజబీజము
8. న్యాసః = ఋష్యాది న్యాసము
9. రూపధ్యానము = శ్లోకోక్తరూపధ్యానము 'అరుణామ్...'
10. నియమము = చెఱుకుగడ తినగూడదు. సంకల్పింపరాదు, మున్నగునవి.
11. పూజ = పాత్రాసాధనాదులు

**తా :** ఈ బాహ్యాంగములన్నియు లోకమున ప్రసిద్ధిగనున్నవి.

**శ్లో॥ దుర్లభమాంతరమంగం ప్రాయోఽంతర్ముఖజనైస్తదాదృత్యమ్ ।**
**తోషాయైషా తేషామతః ప్రదిష్టా రహస్యవరివస్యా ॥ 109**

**తా :** అంతరంగములు = అంతరంగములైన అంగము లన్నియు లోకమున దుర్లభములు. అవి అంతర్ముఖులైన జనులకవసరములు. ఇందువలన నంతర్ముఖులగు జనుల సంతోషమునకై అంతరవరివస్యారహస్యమను గ్రంథము నాచే రచింపబడినది.

**శ్లో॥ ఏతాముత్సృజ్య జడైః క్రియమాణా బాహ్యడంబరోపాస్తిః ।**
**ప్రాణవిహీనేవ తనుర్విగలితసూత్రేవ పుత్తలికా ॥ 110**

**తా :** ఈ యాంతర వరివస్యను విడచి చేయునట్టి బాహ్యాడంబరము చేయుట యుపాసనా ఫలజనకము కాదు. ఎట్లన ప్రాణములేని శరీరమువలె, దారములేని బొమ్మవలె ప్రాణము, దారము, అంతరంగములు; శరీరము, బొమ్మయొక్క ఆకారము బహిరంగములు.

**శ్లో॥ బీజాన్మూలం మూలాత్ క్షేత్రస్యాన్తఃస్థబాహ్యవిస్తారౌ ।**
**యద్యప్యనయోస్సామ్యం ప్రాధాన్యమథాపి చాంతరంగస్య ॥ 111**

**తా :** ఏదేని యొక క్షేత్రమున బీజమును నాటినచో ఆ బీజము నుండి వేరు, ఏర్పడును, ఆ వేరు నుండి భూమిలోపల వేళ్లు విస్తరించును. బాహ్యమున శాఖలు, కొమ్మలు, పూలు, పండ్లు, ఆకులు విస్తరించును. అట్లే, ఉపాసకుని శరీరమున గురువుచే నుంచబడిన యంత్రబీజమువలన పంచదశీ రూపమైన మూలమేర్పడును. శరీరమున నున్న మూలము నుండి "విద్యావర్ణే యత్రోద్ధారః" అను శ్లోకమున చెప్పబడిన విస్తారమంతయు శరీరమున భావింపవలయును. అది పాదస్థానీయము బాహ్యాంగములైన ఋష్యాదులు విస్తారము శరీర బాహ్యప్రదేశమున భావింపవలయును. ఇది శాఖా, పత్ర పుష్పఫలాది స్థానీయము. విచారింపగనీ యంతరంగ బహిరంగ సాధనములు రెండు, సమప్రధానములే. అయినను, అంతరంగమునకు, బహిరంగమునకంటే అధికమైన ప్రాధాన్యము కలదు. ఎట్లనగా చెట్టుయొక్క

బహిరంగము లైన, కొమ్మలు, ఆకులు మున్నగువానిని నరికినను అంతరంగములైన వేళ్లు మొదలగునవి యున్నచో మఱల శాఖా, పుష్ప, ఫలాదులు మొలచును. అట్లే, ఉపాసకునకు బహిరంగములైన ఋషిన్యాసాదులు లోపించినను అంతరంగములైన అర్థాదులున్నచో, పురుషార్థసిద్ధి, మంత్రసిద్ధియు కలుగును. అందువలన బహిరంగముకంటే, అంతరంగమునకు ప్రాధాన్యము కలదనుట నిర్వివాదమైన అంశము.

**అవ :** సద్గురు ముఖమున సంపాదించినపుడే ఈ జ్ఞానము ఫలించునని దృష్టాంతపూర్వకముగ నిరూపించుచున్నాడు.

**శ్లో॥ సద్గురుకులతః కృపయా లబ్ధా కామానియం సూతే ।**
**నిజబుద్ధిమాత్రజన్యా పాపం కన్యా యథా స్వీయా ॥ 112**

**తా :** గురుకులమున నుండి గురుసేవాజనితప్రసాదమున పొందబడిన ఈ విద్య ఫలమును పుట్టించును. తన బుద్ధిగర్వముచే మాత్రము తెలియబడిన విద్య పాపము కలిగించును. తనకు పుట్టిన కన్యను పరిణయమైనచో నెట్లు పాపము కలుగునో అట్లే పాండిత్యగర్వముచే గురువునపేక్షింపక, స్వయముగ చూచి సంపాదించిన విద్య పాపమును కలిగించును.

**శ్లో॥ పారంపర్యవిహీనా యే జ్ఞానమాత్రేణ గర్వితాః ।**
**తేషాం సమయలోపేన వికుర్వంతి మరీచయః ॥**

శ్రీ ఆదినాథుని నుండి గురుపరంపరగా వచ్చిన విద్యను పొందక, జ్ఞానమాత్రముచే గర్వితులై సంపాదించినవారికి సమయాచారలోపముచే ధాతునాథదేవతలు, వికారమును పొందించి వ్యాధులు, పిచ్చి, మున్నగు జ్ఞాన వికారములను కలిగింతురు. ఈ విషయము "**ఆపదో దురితం రోగాః సమయాచారలంఘనాత్** " అను వాక్యముచే చెప్పబడినది. అని భావము. కనుక గురుపరంపరగా ప్రాప్తమైన విద్యనే గురుసేవాదులవలన అనుగ్రహరూపమున సంపాదించు కొనవలయును.

**అవ :** అథ "**మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని హి, శాస్త్రాణి ప్రథన్తే**" అను వచనము ననుసరించి గ్రంథాంతమున మంగళము నాచరించుచున్నాడు.

**శ్లో॥ అకథాసనం హాళక్షాంతరం సమాసాద్య మామకం జ్ఞానమ్ ।**
**మామకమేవానందం మహ్యం దదతో జయంతి గురుచరణాః ॥ 113**

అకథాసనం = వాక్కులకు అందనిది, హా = నిశ్చయముగ, ళక్షాంతరమ్ = లక్షణావృత్తిచే గమ్యమానమైనదియగు, మామకమ్ = ఆత్మాభిన్నమైన, జ్ఞానమ్ = జ్ఞానమును, బ్రహ్మాత్మైక

రూపమైన జ్ఞానమును, సమాసాద్య = పొంది, మహ్యమ్ = నా కొఱకు, మామకమేవ = ఆత్మాభిన్నమైన, ఆనందమ్ = ఆనందమును, దదతః = ఇచ్చుచున్న, గురుచరణాః = పూజ్యులైన గురువులు, జయంతి = సర్వోత్కర్షగా నున్నారు.

1. అకథాసనం = అకారాది, కకారాది, థకారాది, 16 అక్షరములు గల సహస్రారపద్మకర్ణికా మధ్యగతమైన, త్రికోణాత్మకమైన, ఆసనమ్ = ఆసనమును, హళక్షాంతరమ్ = హకార, ళకార, క్షకారములు, కోణాంతరములయందున్నదియు నగు దానిని, సమాసాద్య = పొంది, మామకమ్ = ఆత్మాభిన్నమైన, జ్ఞానమ్ = జ్ఞానమును, సమాసాద్య = పొంది, మామకమేవ = ఆత్మాభిన్నమై, ఆనందమ్ = ఆనందమును, మహ్యమ్ = నా కొఱకు, దదతః గురుచరణాః జయంతి.

**తా :** అకారాది, కకారాది, థకారాది షోడశవర్ణాత్మకమైన రేఖలుగలదియు హకార, ళకార, క్షకారములు కోణముల అంతరమున నున్నదియునగు, గుర్వాసనము నధిష్ఠించి, ఆత్మాభిన్నమైన జ్ఞానమును తాననుభవించుచు, వాచామగోచరమై లక్షణాగమ్యమైన, ఆత్మాభిన్నానందమును, నాకనుగ్రహించుచున్న గురుచరణులు సర్వోత్కర్షగా నుందురు గాక.

**శ్లో॥ గురుచరణైకసహాయో భాస్కరరాయో జగన్మాతుః ।**
**వరివస్యాతిరహస్యం వీరనమస్యం ప్రజగ్రంథ ॥ 114**

**తా :** శ్రీపదవాక్య ప్రమాణ పారావార పారీణులు, సర్వతంత్ర స్వతంత్రులు శ్రీనృసింహానంద నాథచరణారవిందమున చరించు భృంగాయమానులు నగు శ్రీభాస్కరానందనాథులచే గ్రథితమై వరివస్యారహస్యమున ద్వితీయాంశము సమాప్తము.

**'ఓం శ్రీగురుః సర్వకారణభూతా శక్తిః'**

**శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ**

**శ్రీశ్రీశ్రీ**

**శ్రీః**

